తొలి ముద్రణ :
మార్చి 21, 1983
కాపీలు : 1000

వెల : రూ. 8/-

ముఖపత్రరచన : కల్పన

ప్రతులకు :
బ్రహ్మాయ్య,
3/83, రంగనాయకుల పేట,
నెల్లూరు - 524 001.

R. P. ప్రకాష్,
16/33, మందరగిరివారి వీధి,
నెల్లూరు - 524 001.

ముద్రణ :
ఫ్రీడమ్ ప్రెస్,
28, టి. హెచ్. రోడ్, మద్రాసు-21.

# విషయసూచిక


| | | |
|---|---|---|
| ఒక్కమాట | : | దూపాటి బ్రహ్మయ్య |
| కృతజ్ఞతలు | : | లక్ష్మీరమణ |
| రిసెర్చి గెరిల్లా - బంగోరె | : | కె. వి. రమణారెడ్డి |
| శ్రీ బంగోరె | : | దిగవల్లి వెంకటశివరావు |


## I కూనిరాగాలు - సమీక్షలు

(జమీన్‌రైతు నుంచి)


| | | | |
|---|---|---|---|
| 1. | లోకలిస్టు జన్మదినం | — | 1-1-1965 |
| 2. | వీరేశలింగం - భారతి | — | 17-1-69 |
| *3. | భారతి - నెల్లూరు | — | 24-1-69 |
| 4. | చంద్రిక కథ | — | 9-5-69 |
| 5. | వేదం వెంకటరాయశాస్త్రిగారి పాండిత్య వైశాల్యం | — | 21-6-68 |
| 6. | కవి కోకిల అముద్రిత రచనలు | — | 20-11-70 |
| *7. | శ్రీశ్రీ పలుకులు | — | 29-11-68 |
| 8. | కొడవటిగంటి షష్టి పూర్తి | — | 31-10-69 |
| *9. | వర్ధమాన సమాజం - శ్రీశ్రీ షష్టి పూర్తి | — | 24-10-69 |
| 10. | చర్చిల్‌కు నెల్లూరుకు బాదరాయణ సంబంధం | — | 29-1-65 |
| 11. | బాలమురళి | — | 11-12-64 |
| 12. | ఆర్భాటం లేని ఐదుగురితో మహాసభ | — | 28-8-64 |
| 13. | వెంకటగిరి పుస్తక జీవసమాధి | — | 28-2-64 |
| 14. | చరిత్రవేత్తలతో కలసి వెలిగొండ లోయల్లోకి | — | 9-8-68 |
| 15. | అరుద్ర చెప్పిన విషయం | — | 19-8-68 |
| 16. | మలయాళ మహాచిత్రం చెమ్మీన్ | — | 2-12-66 |
| 17. | హిమాలయాలకు వెళ్ళాలి | — | 31-7-64 |


## II పరిశోధక వ్యాసాలు - ఇతరేతరాలు


1, 2, 3. నూరేళ్ళనాటి నెల్లూరు సంగతులు
(బైరల్ గ్రంథము నుంచి అనువాద భాగాలు
సహకారం: N. S. కృష్ణమూర్తి) — 14-6-68

4. దంపూరు నరసయ్య — 2-8-68
5. వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్రలో దంపూరు నరసయ్య — 25-10-68
6. 220 యేళ్ళనాటి సంగతులు — 17-7-70
7. రచయితగా శ్రీ నెహ్రూ — 19-6-64
8. వేమనపై వార్లగారి రెండు ఆంగ్ల గ్రంథాలు — 28-11-69
9. కన్యాశుల్కంలోని బహుముఖ విషయాలు — 4-4-69
10. శ్రీహరికోట దీవులు — ?
11. గురజాడకు 'బాస్వెల్' (శ్రీ K. V. రమణారెడ్డితో చేసిన రచన) — 14-2-69
12. షేక్స్పియర్ — 8-5-64
13. పరిపూర్ణ కళాకారుడు చిత్తూరు వి. నాగయ్య — 28-5-63
14. అర్ధంకాని మోడ్రన్ ఆర్ట్ — 2-2-68
15. నెల్లూరు మొదటి జర్నలిస్ట్ దంపూరు నరసయ్య — 9-5-69
16. ఖలీల్ జీబ్రాన్ - కాశోజి — 1-3-68


## III అమెరికన్ పరిశోధనారంగంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు

(అమెరికన్ రిపోర్టర్ నుంచి)


వీరేశలింగంపంతులుగారిపై అమెరికన్ యువకుని పరిశోధనలు —


## IV వీడ్కోలుపు

(యూత్ కాంగ్రెస్ నుంచి)


1. రచయిత — 27-6-74
2. పిలుపు — 13-5-75
3. నిర్గమన వీరాజనాలు — 13-5-75


## V బంగోరె జీవిత విశేషాలు


సవరణ పట్టిక ?


* ఈ గుర్తుగల శీర్షికలు శ్రీ బంగోరె పెట్టలేదు. పాఠకుల సౌలభ్యం కొఱకు మేమే పెట్టినాము. గమనించగలరు. —ప్రచురకర్త.

# ఒక్క మాట

మానవతావాది నిర్భీకుడైన ఉత్తమ జర్నలిస్టు, సాహిత్య, చారిత్రక పరిశోధకులలో అగ్రగణ్యుడు - ప్రస్తుతం 'అదృశ్యుడు' అయిన మహామనిషి మన బంగోరె.

సాహితీరంగంలో నెల్లూరును చిరస్మరణీయం చేసిన శ్రీ బంగోరె తో మా యువజన లలితకళాసమాజానికి విడదీయరాని అనుబంధం వుండేది. సాంస్కృతిక విషయాల్లో మాకు మార్గదర్శిగా వుండేవారు.

పత్రికా వార్తా ప్రచురణలో బంగోరెది వొక ప్రత్యేకబాణి. పాఠకుల హృదయాలలో హత్తుకువి, యీ సమాజంపట్ల వారి బాధ్యత లేమిటో తెలిపేలా ఆయనలో ఆవిర్భవించిన ఆవేశాన్ని అచ్చు గుద్దే వారాయన పాఠకుల యెదల్లో.

నిరంతర గవేషణాదృష్టితో శ్రమించి ఎన్నో అమూల్య సాహితీ విషయాలు మన కందించారు.

చీకటి కుహరాలు త్రవ్వి చరిత్రకు వెన్నెలపూసి వెలుగు చూపించిన ద్రష్ట శ్రీ బంగోరె.

దరిద్రజీవులవిషయానికొస్తే ఈ పెట్టుబడీదారీ విధానాన్ని నట్టనడి రోడ్డులో ముట్టడించి దహించే రోజుకోసం ఎదురుచూసేవారిలో తొలి వరుసలో వుండేవా రాయన.

ఆయన హఠాత్తుగా అదృశ్యమవడం సాహితీప్రియులందరికీ అశనిపాతం. మా కనీసకర్తవ్యంగా 'జమీన్ రైతు' 'యూత్ కాంగ్రెస్' 'అమెరికన్ రిపోర్టర్'లలో వెలువడిన బంగోరె రచనలు కొన్ని సేకరించి యీ చిరుపొత్తంగా అందిస్తున్నాము.

ఈ సంకలనవ్యాసాలద్వారా శ్రీ బంగోరె సాహితీప్రతిభ కొంత వరకైనా ప్రదర్శితమవగలదని ఆశిస్తూ.

—మూపాటి బ్రహ్మయ్య.

# కృతజ్ఞతలు

'యువజన లలితకళా సమాజం' స్థాపించిన ఈ 5 సం॥ లలో మొదటిసారిగా యీ పుస్తక ప్రచురణల బాధ్యతను స్వీకరించింది. అసలు మొదటిగా మా సంస్థ ప్రచురణనుంచి శ్రీ సంజీవదేవ్‌గారి 'English letters' రావలసి వుండింది. కాని, ఆకస్మికంగా అదృశ్యమైపోయి ఎంతో శోకాన్ని, అంతకుమించిన పరిశోధనా బాధ్యతల్నీ మన కొదిలేసిన మిత్రులు బంగోరె పుస్తకం వెంటనే అచ్చువేయవలసిన పరిస్థితి కలిగింది. బంగోరెకు పుస్తకాలకు వున్న అనుబంధంగురించి వేరుగా వివరించ నక్కరలేదు. వొకసారి తిరుపతిలో ఆయన పరిశోధనలవిషయంలో తీవ్రంగా నిమగ్నమై వున్నప్పుడు ఆచంటగారికి వొకసారి కనిపించారట.

'ఏం బంగోరె' అలా వున్నావ్? అని ఆయన అడిగినప్పుడు తన సహజ ధోరణిలో, 3 రోజులైంది భోజనంచేసి, అన్నారట బంగోరె. అప్పుడు ఆచంటగారు కొంతడబ్బు ఇస్తే, దాన్ని తీసికెళ్ళి పుస్తకాలు కొన్నారు బంగోరె. ఆయన చేతిమీదుగా మన కింకా ఎన్నో పరిశోధనాగ్రంథాలు, రచనలు రావలసివుండగా ఆయనలేని ఆయన రచనలనుమాత్రమే ఇక మనం ముద్రించుకోగలం. మన ఆంధ్రుల ఈకర్మకు చింతిస్తూ, తక్కువ వ్యవధిలో ఈ బంగోరె రచనలను ఆయన పనిచేసిన పత్రికలనుంచి సేకరించి కూర్చాము. ఇది తక్కువవిషయ మేమీ కాదు. బంగోరె రచనలలో ఏది ఎక్కువది, ఏది తక్కువది అని నిర్ణయించగలగడం సాహసమే అవుతుంది. ఒక రచన గొప్పది అంటే మరొకరచన గొప్పదికానిది అని కాదు. కాని రచనాసమయాలకు, స్థలాలకు, విషయాలకు గల ప్రాముఖ్యతనుబట్టి ఆయన వేల రచనలనుంచి కొన్నిటినిమాత్రమే సేకరించాము. ఇది బంగోరెని తక్కువ చేయడానికికాదు - పుస్తకాలకు పరిశోధనలకు అంకితమైపోయిన ఆయనకు శ్రద్ధాంజలిని, సంతాపసభలకు, వర్ధంతి సభలకు పరిమితంచేయకుండా ఆయన రచనలను నలుగురికీ సులభంగా అందేట్లుగా ఏరి కూర్చి పుస్తకరూపంగానే అందిస్తున్నాము.

ఈ పుస్తకముద్రణలో మాకు 'జమీన్ రైతు' పూర్తిసహకారాన్ని, సమాచారాన్ని అందించింది. 'యూత్ కాంగ్రెస్' పత్రికలలోని రచనలను వేసుకోవడానికి L. V. కృష్ణారెడ్డిగారు అనుమతించారు. 'అమెరికన్ రిపోర్టర్' పత్రికకు, ఇతర సమాచారాన్నందించిన మిత్రులు మద్రాసు యూనివర్సిటీ విద్యార్థి రవీంద్రరెడ్డిగార్కి,

సహృదయతతో మాకు పూర్తిగా సహకరించిన మిత్రులు-ప్రఖ్యాత దార్శనికులు, విమర్శకులు, రచయిత, చిత్రకారులు డా. సంజీవదేవ్, D. litt; గారికి, మాకు తగిన సలహా సహకారాలు పూర్తిగా అందించి ఎంతో సహకరించారు 'గోపి' (జపాన్ రైతు) గారికి, ముందుకు కదిలించకుండా సహకరించినమిత్రులు K. V. రావు, (T. T. E; Sc Railway) గారికి, M. V. సుధాకరరావు, లెక్చరర్, N. B. K. R. Engg. College) గారికి, ఆర్థికంగా పూర్తిసహకారాన్నిచ్చిన శ్రీమతి సుమిత్రా గోపాల్ రెడ్డిగార్కి, శ్రీమతి నర్మదా P. K. రెడ్డిగార్కి, అడిగినవెంటనే ముందుమాట రాసియిచ్చిన శ్రీ K. V. రమణారెడ్డిగార్కి, అసలు మొట్టమొదటిగా యీ పుస్తక ప్రచురణకు ప్రోత్సాహాన్నిచ్చిన శ్రీమతి కృష్ణాబాయిగార్కి మాత్రమే కాకుండా, యీ పుస్తకనిర్మాణంలో ఇంకా ఎందరో మా వెంకవిళ్ళి మమ్మల్నెంతో పుత్సాహపరిచి ఎవరికర్తవ్యాలను వారు నెఱవేర్చిన మిత్రులు, సాహితీవేత్తలు ఎందరో వున్నారు.

అందరికీ యివే మా హృదయపూర్వకమైన అభినందనలతోపాటు ఈ కృతజ్ఞతలు కూడా.

—లక్ష్మీరమణ,

అధ్యక్షుడు,

యువజన లలితకళా సమాజం.

# రీసెర్చి - గెరిల్లా బంగోరె

పోరాటకారుడు కాకపోతే మరేమీకాదు బంగోరె. తదితరరంగాలలో దేని లోనూ సాగని పోరాటాన్ని అక్షరరంగంలో ఎడతెరిపిలేకుండా పది పన్నెండేళ్లపాటు సాగించాడు. విద్రాణంగానో అల్పసంతృప్తితోనో పడివున్న పరిశోధనాలోకంమీదికి ఉరుములు మార్మ్రోగి మెరుపులు విదిలించే దుందుడుకు వానమబ్బులాగా దూకి పడ్డాడు. గతానుగతికత్వానికి గుండె కంపరం పుట్టించాడు. గ్రంథచౌర్యప్రవృత్తి ముఖంమీది ముసుగు ఊడలాగి, అక్రమంగా ఆర్జించిన కీర్తిధనాన్ని కక్కించాడు. విద్వల్లోకం ఉలికిపడేలా, అకాడెమిక్ పాండిత్యం వెలవెలబోయేలా, పీఠాలూ డాక్టోరేట్లూ ప్రొఫెసర్‌గిరీలూ దడుచుకునేలా, అద్భుతమైన ఉపజ్ఞతో అధిమానుషమని పించే ఉగ్రదీక్షతో సాహసోపేతంగా అజ్ఞాతవిషయాలను, 'అప్రకటిత' రూపంలోనైనా సరే. ఎన్నిటినో. సుపరిచితవిషయాలుగా మార్చగలిగాడు. నిజానికి 1970-1980 దశాబ్దం పరిశోధనారంగంలో నిస్సందేహంగా బంగోరెది.

చదివింది కామర్సు. ఆనర్స్ కోర్సు - నెగ్గుకురాలేకపోయింది కామర్సుగా మారిన లోకజీవితంలోనే. చదువుకు సరిపోయే కొలువు రెండేళ్లుమించి చెయ్యలేక కడప కో-ఆపరేటివ్ బ్యాంకి అధ్యక్షుడి నెదిరించి బైటపడిన నాటినుంచీ హిమాలయ సందర్శనానికంటూ అనుబంధాలనూ రక్తపాశాలనూ తెగదెంచుకు వెళ్ళిననాటిదాకా, బండి గోపాలరెడ్డిది నిలకడలేని బతుకే. ఆంధ్రా యూనివర్సిటీ విద్యార్థి దశలోనే అతని హృదయం వెలికురికింది - జర్నలిజం తన అభిమానవిషయమనేది సూచనగా లోకానికి తెలిపింది. సాహిత్యంవంటి కళావిషయాలలో గాఢమైన అభినివేశం ఉన్నట్టుగాకూడా, బుచ్చిబాబు, సంజీవదేవ్, కాళోజీ, ఆచంట జానకిరామ్‌వంటి వారితో తన సాహచర్యం బైటపెట్టింది. నెల్లూరికి తిరిగివచ్చాక 'జమీన్‌రైతు'లో సహాయ సంపాదకుడుగా కుదురుకుని తాను జీతభత్యాలరూపంలో దానినుంచి పొందినదానికంటె ఎన్నోరెట్లు ఆ పత్రికకు ప్రసిద్ధి కలిపించాడు. ఆతర్వాత మదరాసులో అమెరికన్ కాన్సలేట్‌లో కొంతకాలం ఉండి మళ్ళీ నెల్లూరికివచ్చి ఈమారు 'యూత్ కాంగ్రెస్' పత్రికనుసైతం జీవశక్తితో నిగనిగలాడించగలిగాడు. తిరుపతి శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీవారి సి. పి. బ్రౌన్ ప్రాజెక్టు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి వేమన ప్రాజెక్టు, ఆంధ్రా యూనివర్సిటీవారి సి. ఆర్. రెడ్డి ప్రాజెక్టు, బంగోరె అనే

వాడేలేకుంటే, దవిటీబుర్రల దవిటీబుర్రలే అయివుండేవి. పట్టిందల్లా బంగారమే అయిందంటే కారణం, బంగోరె 'హస్తవాసి' మాత్రమే.

బండి శంకరరెడ్డి శంకరమ్మల కడుపు చల్లగా మినగల్లు గ్రామంలో మామూలు రైతుకుటుంబంలో పుట్టి, కోవూరులో నెల్లూరులో చదువుకుని, వాల్తేరులో చదువు డిగ్రీ పుచ్చుకున్న బండి గోపాలరెడ్డి, కడప వుద్యోగంనాటికి బ. గో. రె. గా పిల్ల పిడుగయ్యాడు. చిచ్చర పిడుగైంది 'బంగోరె'గానే, పూర్వజన్మసుకృతం మాటెందుకు గాని, తన సామాజిక పారిసర్యంకూడా ఈ పరిణామానికి అనుకూలమైంది కాదు. శ్రుతపాండిత్యమైనా లేదనాలి. మరి ఇంతటి గొప్పవింతగా ఫలించిన విషయపరిజ్ఞాన- ఆసక్తి ఆతనికి ఎలా సమకూరిందో ఊహించడంకూడా కష్టమే. రెండుకాళ్ళ పటశో ధనాగారంగా రూపొంది ఒక్కొక్క అంగ ఒకొక్క అన్వేషణనిపిస్తూ ఔత్సాహిక పరిశోధనాకృషిని సముజ్జ్వలం చెయ్యగలగడం నిజంగానే విస్మయకరం. అయితే ఏదీ కూడా మిన్నులనుంచి ఊడిపడదు. నేపథ్యంలో అదృశ్యంగా సాగుతూ సుదీర్ఘమైన సన్నాహాలు ఉండంటే. హఠాత్ పరివర్తనతో కళ్ళు మిరుమిట్లుగొలిపే పర్యవసానం ఏవీ కలగదు.

బుచ్చిబాబు నవల 'చివరకు మిగిలేది', ఆచంట జానకిరామ్ స్వీయచరిత్ర 'సాగుతున్న యాత్ర' ఖలీల్ జిబ్రాన్ రచన 'ప్రాఫెట్' పీటితో మొదలైంది బంగోరె సాధన - నాకు తెలిసి. 'జమీన్‌రైతు'లో 'లోకలిస్టు'గా వారం వారం ఒక శీర్షికను నిర్వహించేక్రమంలో మొగ్గ విప్పింది పరిశోధన. అయితే మొదట్లో దానికొక దారీ తెన్నూ వుండేదికాదు. నిర్దిష్టమైన లక్ష్యంగానీ స్పష్టమైన కార్యప్రణాళికగానీ లేదు. బాల్యచాపల్యంలాంటి మనస్థితిలో ఎటుబడితే, అటుగా చెంగలిస్తూ, ఎప్పటి కప్పుడు ఆకర్షణను ఆసక్తిగా మార్చుకుంటూ, నెల్లూరి 'మొలగొలకు' వరి వంగడం మొదలు హిమాలయ దృశ్యసౌందర్యంవరకు ఎన్నో చిన్నవిషయాలగురించి గొప్ప వాస్తవాలను ఆవిష్కరించాలనే దాహంతో కిందుమీదౌతూ వచ్చారు. శ్రీహరికోట మరుగుజ్జులు, దుగరాజపట్నం లైట్‌హౌస్, నెల్లూరులో క్రైస్తవుల గోరీలమిట్ట గోప్యాలు, నెల్లూరు సుబేదార్ యూసుఫ్‌ఖాన్, నెల్లూరి మొదటి జర్నలిస్టు దంపూరి నరసయ్య - ఇలా బంగోరె అభిమానవిషయాలతాలూకు రేఖాచిత్రంలో 'కర్వ్' క్రమంగా నెల్లూరి పరిమితులు మీరిపోసాగింది. దంపూరి నరసయ్య పుణ్యమా అని కందుకూరి వీరేశలింగం ముగ్గులోకివచ్చి నిలిచినట్లుగానే, హైరల్ అనే బ్రిటిష్ పోలీసు అధికారి పర్యటనాగ్రంథ ప్రస్తావనామూలంగా బ్రిటిష్ ప్రభుత్వంమీద ధ్వజ

మైత్రి జాతీయస్వాతంత్ర్యచరిత్రలో అజ్ఞాతంగానేవున్న 'వెంకటగిరి వీరుడు' ప్రత్యక్ష
మయ్యాడు. ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంద్వారా గురజాడ అప్పారావు వచ్చారు.
ఒకటి సుబ్రహ్మణ్యభారతి అసంపూర్తి నవల 'చంద్రిక కథ' అనువాదానికి పురిగొలి
పితే, మరొకటి 'మెట్టమొదటి కన్యాశుల్కం' పునర్ముద్రణకు దారితీసింది. వేమన,
బ్రౌన్ విషయాల పరిశోధనకు మళ్ళించిన నార్లవారి గ్రంథాల ప్రస్తావనకుకూడా ఈ
శీర్షికే పనికివచ్చింది. అందుచేత ఒకమాట అనవచ్చు: ముందు ముందు బంగోరె
మార్కు పరిశోధనా విజయపరంపరకు ప్రాతిపదిక 'లోకలిస్టు' శీర్షికే.

'నిత్య నైమిత్తిక వార్తాపరిధి'కి కట్టుబడి కూపస్థమండూకంలా బంగోరె
ఎన్నడూ వుండలేదు. తన జీవనోపాధికి జర్నలిజం పనికి వచ్చిందిగాని జీవనోపాధి
జర్నలిజానికి ఏనాడూ తాను లొంగిపోలేదు. ఎన్నో చిల్లర విషయాలతో జీవిత
క్రౌర్యంతో రాజీపడి వుండవచ్చుగాని జీవితక్రౌర్యానికి వెల్లవేసే క్షుద్ర లౌక్యప్రవృ
త్తికి తన శిరస్సునుగానీ హృదయాన్నిగానీ తాకట్టు పెట్టలేదు. తనతనం బంగోరె
మూలధనం. అది చెక్కుచెదరలేదు. రాజకీయవిషయాలగురించి తన పరిమితులు
తనవి అభిమాన దురభిమానాలకారణంగా తాను ప్రజాపోరాట రాజకీయాన్ని బోధ
పరచుకుని సమర్థించవలసినంతగా అపని చెయ్యలేదుగాని పాలకవర్గరాజకీయమైన
రాజకీయంతో తెలిసితెలిసి శ్రుతిగలిపిన సందర్భాలు చాలా తక్కువ 'రేడికల్' అన
దగిన భావపైఖరి బంగోరెది. అతని పరిశోధనాఫలితాలుకూడా అలాంటివే - తీగతో
బాటు డొంకనంతా కదిలించందే తృప్తిపడేఘటం కానందుచేత, ఒక సర్వసాధారణ
మైన అంశంనుంచి పరమ అసాధారణమైన విశేషాన్ని ఆవిష్కరించడానికి నిద్రా
హారాలుమాని పరిశ్రమించేవాడు. కావలసిన లోగట్టా రాబట్టేందుకు, సామగ్రిని సేక
రించేందుకు, అష్టకష్టాలయినా పడేవాడు. చిన్నపుస్తకంకోసం వందలు పోసేవాడు.
బూజూ దుమ్మూ నిండిన గదులలో భూతంలా మసలేవాడు. అవసరమనుకుంటే
హస్తలాఘవవిద్యను అనన్యంగా ప్రదర్శించేవాడు. పరిశోధన ఆపేక్షించిన మనిషి
గనక, అరాకొరా పనితో బద్ధకంతో అశ్రద్ధతో ఈ రంగంలో పనిచేసే బడుద్ధాయి
లను చూసి 'విసుక్కునేవాడు. ఔన్సు పరిశ్రమకు టన్ను ప్రతిఫలంపొందిన బుజ
కీర్తులు తగిలించుకున్నవారిగురించి శుద్ధ సంస్కృతం ప్రయోగించేవాడు. ఈ విష
యంలోమాత్రం చిన్నంతరం పెద్దంతరం తెలీదు. దూకుడుకి మారుపేరుగా బంగోరె
తన చేతినీ నాలుకనూ బాగా పదునెక్కించుకున్నాడు. రెండు కొనలనుంచీ మండ
సాగిన కొవ్వొత్తిలా తన ఆరోగ్యాన్ని శక్తినీ అమితంగా ఖర్చు చేసుకున్నాడు.

ఇచ్చిపోయినదానికంటె మరెంతో ఎక్కువ ఇవ్వగలిగిన విషయసంభారం గుట్టలుగా తనవద్ద పోగుబడివుండికూడా, ప్రభుత్వంలోనేగాక విద్యాసంస్థలలోనూ వేళ్లు దన్నుకొనివున్న అధికారరోగం కారణంగా తీవ్రమైన మనస్తాపానికీ నిర్వేదానికీ గురయ్యారు. కాబట్టే మనమంచి స.క్షుపూర్వకంగా తప్పుకున్నారు. ఎవ్వరినీ పెలవడగలేదు. వీడ్కోలు చెప్పలేదు. అగ్నిపర్వతంలా తనలో తనే పొగలు కక్కుకుంటూ 'దౌర్భాగ్యపు' ఈదేశాన్ని విద్యావిజ్ఞానరంగాల్ని రోసి, ఖలీల్ జిబ్రాన్ అన్నట్లు 'మరణ సౌందర్యం' వెదుక్కుంటూ వెళ్ళిపోయారు. బంగోరె లేని లోటుని బంగోరె తప్ప మరొకరు తీర్చలేరు.

అతని అభిమానులు కష్టపడి సేకరించిన బంగోరె తొలి పరిశోధనావిషయాలు గ్రంథరూపంలో రావడం సంతోషించదగిన సంగతి. ఏ ప్రెస్‌లో తాను స్వయంగా వుండి దాదాపు తప్పులనేవే లేనంత నిర్దుష్టంగా తన పుస్తకాల నెన్నిటినో అచ్చు వేయించుకున్న బంగోరె, అదే ప్రెస్‌లో అచ్చుపడిన ఈ పుస్తకాన్ని చూసి ఏమిచేసి వుండేవాడో! అదేమోగాని, ఈ యువమిత్రుల చిత్తశుద్ధిని మాత్రం ఎన్నబుచ్చి వుండేవాడు కాదు. ఇందులో కూడా బంగోరె తొలి రచనలన్నీ లేవు. ఉండితీరవలసినవి ఇంకొకగ్రంథంగా రావలసివుంది. ఈ మిత్రులే ఆపనికూడా నెరవేరుస్తారని ఆశిస్తున్నాను.

జవహర్ భారతి,
కావలి.

కె. వి. రమణారెడ్డి,
15-3-1983

# శ్రీ బంగోరె

శ్రీ బంగోరె నాకు ప్రియమిత్రుడు, మాస్నేహము 23-10-73 తేదీన ప్రారంభమైంది ఆరోజున ఆయన బెజవాడకువచ్చి తాను ప్రచురించిన బ్రౌను జాబుల ప్రతి యిచ్చారు. చాలావిషయాలనుగురించి కొన్నిగంటలసేపు మాట్లాడుకున్నాము. మా మనస్సులు కలిసినవి. అప్పటినుండి ఆయన తరచుగా నాకు జాబులు వ్రాసేవాడు. మాయింటికి వచ్చేవాడు. తాను చేసే చారిత్రకపరిశోధనలసంగతులు నాతో చెప్పి నా సలహాను పొందేవాడు. నన్ను గురుతుల్యునిగా గౌరవించేవాడు. తాను ప్రచురించిన ప్రతిగ్రంథంలోను నన్ను పేర్కొనేవాడు. 1973 వ సంవత్సరంలోనే పూర్వం 1955 సం॥లో పి. పి. బ్రౌనుదొరగారు ప్రచురించిన తాతాచార్ల కథలను శేషాచలం కంపెనీవారు పునర్ముద్రణ చేయదలచి దానిలోని చరిత్ర విశేషాలతో Edit చేయ వలసినదని బంగోరెగారిని కోరినారు. ఆ కథలలో బ్రిటిష్‌యుగ చరిత్రకాలంనాటి విశేషాలు నిబిడీకృతమై యున్నవి. బంగోరె నాసహాయము వర్థించాడు, ఆ కథాంశా లనుగూర్చి అనేకప్రశ్నలు లేవదీశాడు. వాటికన్నిటికీ నేను విపులమైన వివరణ లివ్వగా చాలా సంతోషించి ఈ క్రిందిజాబు వ్రాశాడు.

బంగోరె :

18, Sannadhi Street, Madras. 22—11—73

శివరావుగారూ నమస్కారాలు. మీ పెద్దకవరు ఇప్పుడే అందింది. గుక్క తిప్పు కోకుండా చదివేసి మీకు జాబు వ్రాస్తున్నాను. మీ సాహిత్య వైదుష్యానికి విస్తు పోతున్నాను. ఈవిషయాల్లో మీకుగల పరిచయానికి విస్తృతికి జోహార్లు సమర్పించు కొంటున్నాను. మీపాదాలకు సాష్టాంగపడుతున్నాను. నాసందేహాలు ప్రశ్నలు స్వల్ప మైనవి. కాని, మీరు అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్టు వివరించారు. ఈ వివరించే అర్హత, స్తోమత కలిగినపండితులు మరెవ్వరు లేనట్లుగానే ఈ ప్రశ్నలు, సందేహాలు లేవదీసే దృష్టికోణము నేటి యువకుల్లో బంగోరెకితప్ప మరెవ్వరికీకూడా లేదేమో. అందుకే కాబోలు ఈ విచిత్రమైన అనుబంధం అనుకోవాలా: అందువల్లే ఆరోజున మీసన్నిధిలో నేను పసిపాపగా అలా తనివితీరా యేడ్చింది: వెక్కివెక్కి యేడ్చింది. జోహార్లు, శివరావుగారూ పదిరోజుల్లో ఈ కథలూ గాథలూ Press copy ఇచ్చేస్తాను. మీ రుణం తప్పక తీర్చుకుంటాను. మళ్ళీ విపులంగా జాబు వ్రాస్తాను.

వందనాలతో బంగోరె.

ఈ జాబు చూశాక నా హృదయం కరిగిపోయింది. పాపం బంగోరె తన తల్లి గారికి అంకితం చెయ్యదల్చుకున్న తాతాచార్ల కథలను నాకే అంకితంచేసి అందులో నన్ను ఆకాశానికి ఎత్తి పొగిడినాడు.

శ్రీ బంగోరె నేటి చారిత్రకపరిశోధకులలో అగ్రగణ్యుడు. తిరుపతి వెంక టేశ్వర విశ్వవిద్యాలయంవారు స్థాపించిన సి. పి. బ్రౌను రిసెర్చి ప్రాజెక్టులో స్పెషల్ ఆఫీసరుగా పనిచేసి గొప్ప పరిశోధనచేసి కొన్ని ఉద్గ్రంథాలు ప్రకటించాడు. ఆంధ్ర విజ్ఞాన వికాస చరిత్రను నూరు సంవత్సరాలవెనుకకు తీసుకొనివెళ్ళాడు. లండన్‌లో నున్న బ్రౌను వ్రాతప్రతుల మైక్రో ఫిల్ము పేజీలు తెప్పించాడు. వాటిని ఉపయోగించి ఉద్గ్రంథాలు వ్రాయదల్చాడు. గాని దరిద్ర దేవతవల్ల ఈకృషికి అంతరాయం కలిగింది, బంగోరె చాలా బాధపడ్డాడు. చెన్నారెడ్డిగారు ముఖ్యమంత్రిగా వుండగా భారీఎత్తున తలపెట్టిన వేమనయోగి విజ్ఞానకేంద్రానికి బంగోరె స్పెషల్ ఆఫీసరై వేమననుగూర్చిన అపూర్వచరిత్ర సామగ్రిని సంపాదించాడు. 1829 నాటి బ్రౌను సంకలనం పద్యాలు మాత్రం చేరికతో ముద్రించాడు. ఇంతలో చెన్నారెడ్డిగారు వదలిపోగా ఈ కృషి వ్యర్థమైపోయినది. తాను తలపెట్టినగ్రంథాలు ప్రచురించే అవకాశం పోయినది.

బంగోరె కృషివల్లనే క్రీ శ. 1731 సం॥ లో ఒక ఫ్రెంచి పాదరీ పారిస్‌కు పంపిన వేమనపద్యాల వ్రాతప్రతికి ఫోటోకాపి వచ్చింది. దానికి నకలు వ్రాయించి నాకు పంపించాడు. ఇంతేగాక నాకోసం అమెరికా ప్రొఫెసర్ బర్టన్‌స్టీన్‌గారు రచించిన దక్షిణ భారతదేశచరిత్ర అనే అపూర్వ పరిశోధకగ్రంథం రు. 158 లకుకొని 1982 జనవరిలో నాకిచ్చాడు. ఈ పారిస్ ప్రతిని పరిశీలించగా అందులో వేమనపైన తమిళ సాహిత్యప్రభావం కనబడింది.

దీనికి ప్రోద్బలమిచ్చాయి. వీరశైవము తమిళశైవ సిద్ధాంతంనుండి పుట్టినదే యని బర్టన్ స్టీన్‌గారు వ్రాశారు. ఈసంగతులు బంగోరెకి వ్రాశాను. చాలా సంతోషించాడనుకొంటాను. ఢిల్లీ వెళ్ళి వచ్చినతర్వాత ఉత్తరాలు లేవు. బంగోరె అకాల మరణానికిముందు 31-8-82 తేదీన నాకు వ్రాసిన జాబువల్ల ఆయన మానసికబాధ తెలుస్తున్నది.

బంగోరె

Room No. 1. Faculty Club Upstairs

31-8-82 Andhra University, Visakhapatnam 530003.

శ్రీ దిగవల్లి మేష్టారికి నమస్కారములు. నన్ను మన్నించాలి మీ జాబులన్నీ చేరాయి మొన్న ఫిబ్రవరిలో ఢిల్లీనుంచి తిరిగొచ్చినప్పటినుంచి నేనింతకాలం ఎట్లా బ్రతికానో అర్థం కావడంలేదు. యింత low spirits లో నేనెప్పుడూ లేను. యూనివర్సిటీని వదులుకొని మరో పదిరోజుల్లో నెల్లూరుకు వెళ్ళిపోవటానికి నిశ్చయించుకొన్నాను, ఆవుల సాంబశివరావుగారు అమెరికాలో ఆపరేషన్ చేయించుకొని మొన్నటి వారమే వచ్చారు. ఆయనతో మాట్లాడి Finalగా Relieve అయి వెళ్ళిపోవటానికి నిర్ణయం. బహుశా ఒకటి రెండురోజుల్లో ఈవిషయం తేలిపోవచ్చు.

నాజీవితమే యిట్లా అర్థాంతరంగా ముగిసే కార్యక్రమాలతో సాగిపోతూ ఉంది. ఏమిటో మాస్టారు నాజీవితం ఇన్నివక్రాల్లో తిరుగుతుందని అనుకోలేదు, యిక భరించడం నావల్ల కాదు. నాభార్య ఆపరేషన్ జరిగి బాగున్నది. యిప్పుడు కాలేజీకి వెళుతున్నది. భార్యా పిల్లలకు దూరంగా ఉండడంవల్ల నాలో ఈ భయంకరమైన పరిణామం సంభవించిందేమో ననుకుంటాను. అప్పుడప్పుడు ఆత్మహత్య ఆలోచనలు కూడా వస్తుంటాయి. ఏమిటో మాస్టారు మొత్తంమీద మనస్సేమీ బాగాలేదు.

మీకు మళ్ళీ నెమ్మదిగా జాబు రాస్తాను. వెంకటరత్నంగారికి నమస్కారాలు. ఆయన పిల్లలంతా బాగున్నారని తలుస్తాను.

వందనాలతో,

మీ బంగోరె.

Inland Cover Card.

ఈ జాబు చూడగానే నాకు చాలా బాధ కలిగింది. నేను వెంటనే బంగోరెకి ఉత్సాహం కలిగించేటందుకు మీరు చేసిన అపూర్వ పరిశోధనలవిలువ సామాన్యులకు తెలిసేరీతిగా బ్రౌను విషయమునుగూర్చి ఒక ప్రత్యేక గ్రంథం వ్రాయడం అవసరం. అలాగే వేమననుగూర్చికూడా వ్రాయాలి. మీరు మనస్సు పాడుచేసుకోవద్దు. అధైర్య పడొద్దు. వివరాలు వెంటనే వ్రాయండి అని బదులు వ్రాశాను. దానికి జవాబు రాలేదు.

నేను గుంటూరుజిల్లా చెరుకుపల్లిలో మా మూడవఅబ్బాయిదగ్గర వుండగా బంగోరె దుర్మరణవార్త పత్రికలో పడింది. ఆరోజురాత్రి నాకు నిద్ర పట్టలేదు.

దిగవల్లి వెంకట శివరావు.

# లోకలిష్టు జన్మదినం

నూతన సంవత్సర శుభాభివందనములు చెప్పడం సంప్రదాయమైతే కావచ్చునేమో కానీ, ఆ ఆచారాన్ని పాటించడం నాకు అలవాటు లేదు. అట్లాని అలవాటు లేదని చెప్పి ఈ కూనిరాగాల ప్రియులకు నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలుపడం లేదని మాత్రం అనుకోవద్దు మీ అందరికి అంటే కూనిరాగాల పాఠకావళి కందరికీ నా శుభాకాంక్షలు. లోకలిష్టుకూ మీకూ సంబంధించినంత వరకూ ఈ జనవరి 1 అనేది మరోరకంగా కూడా ప్రత్యేక ప్రాముఖ్యమైనదనే విషయం నేను ప్రత్యేకంగా చెప్పనక్కరలేదనుకొంటాను. మీకూ, నాకూ పరిచయమై, స్నేహమేర్పడి సరిగ్గా ఒక సంవత్సరం కదా! సరిగ్గా పోయిన జనవరి 1 నాడే కదా లోకలిష్టు కూనిరాగాలాపన ప్రారంభమైంది. అప్పటినుంచి దాదాపు ప్రతివారమూ ఈ 52 వారాలు వరుస తప్పకుండా కూనిరాగాలు వస్తూ వచ్చాయి. మీరు చదువుతున్నారు, మధ్య ఒకటి, రెండు వారాలు తప్ప.

లోకలిష్టుకు కూనిరాగాలు ప్రారంభమైన క్రొత్తలోనే కొన్ని భయాలు కలుగక పోలేదు. ఇవి ఇంతకూ కూనిరాగాలా? లేక ఖూనీరాగాలా? అని కొందరు మిత్రులు యెగసక్కెం చేయక పోలేదు. మరికొందరు మిత్రులు "లోకలిష్టా" లేక "కల్లోలిష్టా?"- అని వ్యంగ్యరించక పోలేదు. "పాలికుడు" మాత్రం- కూనిరాగా లేమిటయ్యా! భాషను భ్రష్టు పట్టిస్తున్నావ్ కూన రాగాలనలేవూ? - అని మందలించాడు. ఈ విమర్శలు, విసుర్లూ, నాలో అప్పుడప్పుడూ భయసందేహాలను రేకెత్తిస్తుండినా, అభయ సందేశాలుగానే భావిస్తూ వచ్చాను.

నాకో దురలవాటుంది. అప్పుడప్పుడూ నన్ను నేను తిరగేసుకొని చూచుకొంటుంటాను - ఇప్పుడట్లా చూచుకొంటూ జ్ఞాప

కాలూ, జ్ఞాపికలూ నెమరువేసుకొంటే 'లోకలిష్టు'గా నా అవతరణ రోజు నా జన్మదినం నాడు నన్ను వేసుకొన్న జర్నలిస్టిక్ సవాలు స్మరణకొస్తుంది.

వార్తాలోకంలో కేవలం స్థానికాలనే పట్టుకొని, లోకల విషయాలనే ఆధారంచేసికొని నగ్నగర్భంగా మందరస్థాయిలో కూని రాగాలాపనగా ఒక శీర్షికను నిర్వహించడం సాధ్యమా అనే సవాల్‌ను స్వీకరించాను. వట్టి స్థానికాలకు ఒక సారస్వత స్థాయిని పరిధినీ కల్పిస్తూ సవిమర్శకంగా రసమయమైన ధోరణిలో చర్చించడం ఎప్పుడూ సాధ్యమయ్యేపనేనా, అదే అనుమానం ప్రారంభంలో పీకిస్తుంది. తర్వాత, తర్వాత ప్రోత్సాహ జనితంగానే వుండింది. ఈ నిత్యనూతనమైన ప్రోత్సాహమే మెదడుకు పదును పెడ్తూ ఇరుకైన మార్గములో నడిపించగల్గుతున్నది. పతాక శీర్షికలో గల గలమంటూ దర్శనమిచ్చే వార్తల వెనుక గొంతు నులిమి వేయబడే సన్నాకిలేని గుసగుసలను చెవియొగ్గి వినగల్గుతున్నంతవరకూ లోకలిష్టుకు సేగిలేదు.

వేమనకాలంలో వార్తాపత్రిక లున్నాయో లేవో కాని ఆయన ఆటవెలది మాత్రం నాబోటి "వార్తాహారు"నికి ఆదర్శమైంది.

"పుత్తడి గలవాని పుండు బాధయుకూడ
వసుధలోన చాల వార్తకెక్కు
పేదవాని ఇంట పెండ్లైన ఎరుగరు
విశ్వదాభిరామ వినుర వేమ!"

ఈ మాటే లోకలిష్టు మెదడుకు మేత వేస్తూంటుంది. ఒక సవాలుగా హెచ్చరిస్తూ ఉంటుంది.

## వీరేశలింగం — భారతి

జమీన్ రైతులో గతవారంనుండీ వీరేశలింగంగారిపై భారతి గారు వ్రాసిన తమిళ నవల తర్జుమాను చదువుతున్నారు. ఈ ప్రకరణంలో సుబ్రహ్మణ్య భారతిగారు మొదటిసారిగా నవల్లో మన కందుకూరి వీరేశలింగంపంతుల్ని పరోక్షంగా ప్రవేశపడుతున్నారు. తమిళ పత్రిక "స్వదేశమిత్ర" సంపాదకులు జి. సుబ్రహ్మణ్యయ్యర్ గారి ద్వారా.

నార్ల వెంకటేశ్వరరావు వీరేశలింగంపై ఇటీవల రాసిన ఆంగ్ల గ్రంథం ముందు మాటలో ఒకమాటన్నారు. భారత దేశంలో అగ్ర స్థానము అలంకరించదగిన మొదటి అరడజనుమంది సంఘ సంస్కర్తలలో వీరేశలింగంపంతులుగారు నిస్సందేహముగా వొకరు ప్రత్యేకించి దక్షిణభారతంలో మహిమాన్వితమైన వ్యక్తిగా ప్రకాశించినా నేటి ఈ దేశ చరిత్రలో వీరేశలింగంగారు దాదాపు అనామకమైపోయి వారికి రావలసిన సముచిత స్థానం రాలేదంటూ - ఎస్. నటరాజన్ వ్రాసిన "Acentury of Social Reform in India" అనే ఆంగ్లగ్రంథంలో వీరేశలింగంగార్ని గూర్చి చాలా అప్రముఖమైన ప్రస్తావములు రెండే రెండు చోట్ల మాత్రం దొర్లాయని, అదీ ఏదో మామూలు ధోరణిలో పేర్కొవడం జరిగిందనీ Charles H. Heim—sath వ్రాసిన "Indian Nationalism and Hindu Social Reform అనే గ్రంథములో వీరేశలింగం గూర్చి కేవలం ఒకే ఒక వాక్యం ఉందన్నారు.

మరి మన ఇరుగు పొరుగు తమిళ జాతీయకవిగా సుప్రసిద్ధులయిన సుబ్రహ్మణ్య భారతిగారు ఏకంగా మన తెలుగు వీరేశలింగంగార్ని తీసికొని ఏకంగా ఒక నవలరాస్తే అది మన తెలుగువారికే ఇంతదాకా తెలియలేదంటే ఇక బయటవారికి విదేశాలవారికి ఏ

మాత్రం తెలుస్తుంది. వీరేశలింగం ఉద్యమశీల విస్తారమైన భవంగూర్చి ఇంకా మున్ముందు మరిన్ని రచనలు రావల్సిఉంది. డి. ఆంజనేయులు గారు నేషనల్ బుక్ ట్రస్టువారి తరఫున వీరేశలింగంగార్ని గూర్చి ఆంగ్లంలో ఒక గ్రంథం రాస్తున్నారట.

ఇక జాన్ జి. లియోనార్డ్ అనే అమెరికన్ విద్యార్థి విస్కాన్ సిన్ యూనివర్సిటీ తరపున వీరేశలింగంగారిపై వొక గ్రంథం వ్రాయ సమకట్టి, విషయం సేకరణకై కొన్ని పాత పత్రికలను పరిశీలించడానికి నెల్లూరు వచ్చినప్పుడు 1966 ఫిబ్రవరిలో జమీన్‌రైతు వ్రాసిన కొన్ని విషయాలు కొందరు పాఠకులకైనా గుర్తుంటుందని అనుకొంటాను. ఆ అమెరికన్ అబ్బాయి పుస్తకం వెలువడిందో లేదో తెలియదు కానీ ఈ ప్రయత్నాలు, పథకాలు, శుభసూచకముగానే కనపడుతున్నాయి. ఇన్నాళ్ళకైనా తెలుగువాడైన వీరేశలింగంగారు "ప్రపంచపౌరులు" కాగలుగుతున్నందుకు తెలుగువారైన మనం సంతోషిద్దాం.

## భారతి — నెల్లూరు

తమిళ మహాకవి సుబ్రహ్మణ్యభారతిగారి తమిళ నవల చంద్రిక కథ తర్జుమా రెండు అధ్యాయములు సాగి మూడో అధ్యాయం కూడా ఈ వారంలో పూర్తి అవుతుంది. మహానుభావుడు వీరేశలింగం పంతులుగారు ఈ అధ్యాయమునుండి నేరుగా నవలలో ప్రవేశిస్తున్నారు.

ఈ నవల జమీన్‌రైతులో పూర్తయేదాకా వారం వారం శీర్షిక క్రింద సమానాంతరంగా సుబ్రహ్మణ్యభారతిగార్ని గూర్చి వీరేశలింగంగార్ని గూర్చి కొన్ని విశేషాలను విన్పించాలని "లోకలిస్టు" ఆకాంక్ష.

సుబ్రహ్మణ్యభారతిగూర్చి, వారి గీతాలను గూర్చి తెలుగు వారికి బహుశా మొదటిదఫా అనుకొంటున్నాను. ఒక నెల్లూరీయుడు పరిచయం చేసియున్నాడు గతంలో.

నెల్లూరు మండల కాంగ్రెస్ ప్రముఖులు కొమాండూరు పార్థసారధి అయ్యంగార్ గారు 1947 లోనే భారతిగారి తమిళ జాతీయ గీతాలను ఏడింటిని తెలుగులోకి తర్జుమాచేసి తన "కాంగ్రెస్ ప్రచార పాటలు" పుస్తకంలో చేర్చి అచ్చొత్తించారు. ఆ పుస్తకం నెల్లూరులోనే అచ్చయింది.

ఇకపోతే సుబ్రహ్మణ్యభారతిగారు నెల్లూరుకు వచ్చారు లేదో కానీ 1917 జూన్ 1 వ తేదీ నెల్లూరులో కీ॥ శే॥ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారి అధ్యక్షతన జరిగిన ఆంధ్ర మహాసభ సభలను గూర్చి 'శక్తిదాసన్' అనే నామాంతరంలో భారతిగారు తమిళంలో ఒక వ్యాసం వ్రాసి ప్రచురించారు. దీని ఆంధ్రానువాదం చల్లా రాధాకృష్ణశర్మగారి "సుబ్రహ్మణ్యభారతి" అనే గ్రంథములో అచ్చయి కూడా ఉంది. సుబ్రహ్మణ్య భారతి రచనలను గూర్చి ఈ రెండు కుతూహలకరమైన అంశాలే, ప్రత్యేకించి నెల్లూరు వారికి.

## ముగియని చంద్రిక కథ

తమిళకవి స్వర్గీయ సుబ్రహ్మణ్యభారతిగారి అసంపూర్ణ నవల 'చంద్రికకథ' ఈ వారంలో అఖరైంది. సరిగ్గా నాలుగు నెల్ల క్రితం నుండి జమీన్ రైతులో ధారావాహికగా వస్తున్న తెలుగు వెలుగు చూడని 'తమిళ నవల'కు ఈ వారంతో క్రారావడిచుట్టడం జరిగింది.

కందుకూరి వీరేశలింగం వంటి తెలుగు మహాపురుషుడు - తమిళ జాతీయ కవిగా ప్రఖ్యాతుడయిన సుబ్రహ్మణ్యభారతిగారి నవలకు కథావస్తువు కావడమే ఒక విచిత్రమైన సంగతి. ఎంత

సుప్రసిద్ధులైనా సమకాలిన వ్యక్తులు అచ్చంగా కావ్యనాయకులు, కథానాయకులు కావడమనే సాంప్రదాయం మన అలంకార శాస్త్ర రీత్యా కూడా శాస్త్ర విరుద్ధమైన విషయం. కేవలం సమకాలీన వ్యక్తులనే కాదు, సమకాలిక సమస్యలకు కూడ మన సాహిత్యం యిటీవల తరంవరకు దూరంగా ఉంటూ వచ్చింది.

నేషనల్ ఇంటిగ్రేషన్ అనే పదం మన దేశంలో నేడు పదే పదే వినబడుతున్నా ఒక భాషవారు ఇంకొక భాషవార్ని గూర్చి సాహిత్యపరంగా తెల్సుకునే అవకాశమే బొత్తిగా ఉండడంలేదు. ఇంగ్లీష్, రష్యన్, అమెరికన్ సాహిత్యాలు తెల్సుకోగల్గుతున్నంతగా మన ఇరుగు పొరుగు తమిళ, కన్నడ, మళయాళాద సాహిత్యాలు తెల్సుకోలేకపోతున్నాం. ఏదో పెద్ద అగాథం వంటిది మన దేశాలమధ్య గోచరమవుతున్నది.

అట్లాంటిది దాదాపు 50 ఏళ్ళ క్రితం ఒకభాషలోని ఒక నవలలో ఇంకో భాషాప్రాంతంలోని మహాపురుషుడు పెనవేసుకొని పోవడం ఆశ్చర్యకరమైన విషయమే. ఒక చరిత్రధోరణిలో ఈ నవల సాగింది. ఇది సుగుణమో, దుర్గుణమో కాని; యీ ఒక్క గుణంవల్లనే 'చంద్రికకథ'కు మన దేశభాషా నవలల్లో ప్రత్యేకస్థానం ఉంది.

ఎంతమంది పాఠకులు చదివారు కాని, ఆ చదివిన పాఠకుల రియాక్షన్స్ తెలుసుకున్న తర్వాత యీ చంద్రిక కథను గూర్చి 'లోకలిస్టు'కు కొన్ని విషయాలను చర్చించాలని వుంది.

నవల తొలిసగందాకా ఎంతో ఆసక్తి దాయకంగా సాగింది కాని తర్వాతర్వాత కొంత గందరగోళంలో పడ్డది. నవల పేరును బట్టి చూస్తే యింతవరకు సాగిన నూరు పేజీల కథ కేవలం నవలకు నాందీప్రస్తావన వంటిదిగానే కనపడుతుంది. పేరునిబట్టి చూస్తే నవ

లలో ప్రధానపాత్ర 'చంద్రిక'. యింతవరకు జరిగిన కథాభాగంలో చంద్రిక బాల్యం మాత్రమే ప్రస్తావన కొచ్చింది కాబట్టి నవల పూర్తయివుంటే ఉంటే చాలా పెద్దదిగా వుండేదని మాత్రం చెప్ప వచ్చు. ఉత్తరోత్తర భారతిగారు చంద్రికలో ఒక భారతీయ 'మాడ్రన్ గర్ల్' కుండాల్సిన లక్షణాలన్నిటినీ పొందుపర్చి-విద్యావతి, ధైర్యవిలసిత సంస్కార సౌజన్యగుణ సంపన్నగా చిత్రించదల్చి నట్లుగా స్ఫురించకపోదు. స్త్రీజన పునరుద్ధరణ గూర్చి తన భావా లన్నిటినీ యీ నవలలో చర్చించదలిచాడా అనిపిస్తున్నది. రచనా ధోరణీ, రచనా ప్రణాళిక చూస్తే.

ఏమైనా ఈ నవల పూర్తికాకుండా, మధ్యలో వాక్యమైనా పూర్తికాకుండా నిల్చిపోవడం ఆశ్చర్యకరం. ఆగిపోయిన మహారచ నగా పేర్కొనవలసి వుంది. అదేమి దురదృష్టమో కాని - స్వాతం త్ర్యోద్యమరోజుల్లో పాండిచ్చేరిలో తలదాల్చుకొన్నప్పుడు భారతి వ్రాసిన స్వీయ కథాత్మక నవల 'చిన్ని శంకరన్ కథను ఎవరో దొంగిలించుకుపోగా మళ్ళీ చాలావరకు తిరిగి వ్రాశాడు. భారతిగారి రచన వచనలు ఈ విధంగా పరిణమించడం ఆశ్చర్యాత్మకం, దుర దృష్టకరం.

ఇక పోతే ఒక సాదృశ్యం - మొన్న లైఫ్ పత్రికలో (1969 జనవరి 20 సంచిక) యిట్లానే మార్క్‌ట్వైన్ (అసలు పేరు క్లిమెన్స్) 'ఇండియన్' అనే అసంపూర్ణ నవలను బయటకు లాగి అచ్చు వేశారు; తీరాచూస్తే అది 9వ అధ్యాయంలో ఒక వాక్యం మధ్యలో ఆగిపోయింది - ఆ తరువాతి విషయ మేమిటి అనే దానిపై పెద్ద చర్చ జరిగింది. ముగిసిన రచనలకంటే, ముగియకుండా మధ్యలో ఆగిపోయిన రచనలే సారస్యంగా ఉంటాయా అనిపిస్తుంది. షెల్లీ కవి చెప్పిన 'అన్ హెర్డ్ మెలోడీస్' మాదిరిగా.

# వేదం వెంకటరాయశాస్త్రిగారి పాండిత్య వైశాల్యం

మద్రాసు మల్లికేశ్వరుడి గుడిసందులో వొకప్పుడు ఆంధ్ర వాఙ్మయరంగంలో ఎంత ప్రసిద్ధికెక్కిందో మొన్న తెలుసుకో గలిగాడు. 'లోకలిస్టు'. ఒక నెల్లూరు మహా పండితునికి ఆ వీధిలోని ఒక ఇల్లు బహుకాలం నివాస గృహంగా వుంటూ వచ్చింది. ఆయనే మహామహోపాధ్యాయ వేదం వెంకటరాయశాస్త్రిగారు.

దాదాపు యాభై ఏళ్ళక్రితం గురజాడ అప్పారావుగారు వొక లేఖలో - ఈ ఎండల్లో యీతూరి మీ ఇంటికి రాలేను. అనేదానికి బదులు ... మల్లికేశ్వరస్వామి వీధికి ప్రయాణం చేయలేను — అన్నారు వేదం వెంకటశాస్త్రిగారికి రాసిన జాబులో. అంతటి మహా పండితుడు నివసించబట్టే ఆ వీధికి ఎంతటి పేరు వచ్చిందా అని ఆశ్చర్యపోయాను.

మొన్నీమధ్య సరిగ్గా మిడిసికాసే ఎండల్లో మేము - అంటే నేను (లోకలిస్టును), కె. వి. రమణారెడ్డిగారు, మెయిల్ పత్రిక సబ్ ఎడిటర్ గా ఉంటున్న బాలాంత్రపు నళిని కాంతారావుగారూ కల్సి నానాతంటాలుపడి ఆ ఇంటికి వెళ్లాము. అంతేమరి ఈ తరంవారికి వేదం వెంకటరాయశాస్త్రిగార్ని చేరుకోడానికి ఇన్ని తంటాలుపడాలి కాబోలు.

అసలు వేదం వెంకటరాయశాస్త్రిగారు దివికేగినా, అదే పేరు కలిగిన ఆయన మనుమడు యిప్పుడు ఆ యింటిలోనే ఉంటున్నాడు. ఆ గుహవంటి ఇంటిలో ఎంతటి పాండిత్యవైభవం దాగి ఉందా అని విస్తుపోయాము.

వేదం వెంకటరాయశాస్త్రిగారు బ్రతికినంతకాలం పఠన మందిరంగా ఉపయోగించిన గదిలోకి మమ్మల్ని సాదరంగా తీసుకు వెళ్లారు. సారుగులోంచి ఒక్కొక్క కట్టతీసి చూపాడు. వేదం వెంకటరాయశాస్త్రిగారు చదివిన పుస్తకాలు ఆ పుస్తకాల్లో ఆయన తీసుకున్న మార్జినల్ నోట్సు', ప్రతి పుస్తకంలో దాదాపు ప్రతి లైన్లో ఎక్కడో ఒకచోట 'అండరలైన్' చేసి ఏదేదో వివరణ వ్రాసుకున్నారు వెంకటరాయశాస్త్రిగారు. ఈ మార్జినల్ నోట్సు చదువుకుంటేనే ఎంతో పాండిత్య మబ్బుతుంది మనబోటివారికి. ఉదాహరణకు ఎర్రాప్రగడగారి నృసింహపురాణం' వావిళ్ళవారి ప్రతిలో ప్రతి పేజీనిండా కుప్పతిప్పలుగా నోట్సు వ్రాసుకొని వున్నారు. ఎన్నో పాఠభేదాలు, అర్థవివరణలు, వివాదాలు, ఇవన్నీ ఫుట్ నోట్సుగా ముద్రిస్తే యింకెంత విలువైన పుస్తకం తయారవుతుందా అనిపిసుంది. ఇట్లా ఎన్నో పుస్తకాలకు ఫుట్‌నోట్సులు.

ఇంకా చిన్న చిన్న నోటుపుస్తకాల్లో ఎన్నో వాఙ్మయ విషయాలగూర్చి సంక్షిప్తంగా వ్రాసుకొని వున్నారు డైరీ మాదిరిగా, వీటిలో కొన్ని టిని యేరి వొక పుస్తకరూపంలో ముద్రిస్తే ఎంతో విలువైన సంపుటం మవుతు దనిపిస్తుంది.

ఇకపోతే వెంకటరాయశాస్త్రులగారికి ఆ కాలములో ఎందరెందరో మహాపండితులు వ్రాసిన జాబులు కొన్ని కట్టలు చూపించారు. మనుమడు వెంకటరాయశాస్త్రిగారు వ్రాసిన తమ తాత వేదం వెంకటరామశాస్త్రిగారి జీవిత సంగ్రహంలో చాలా జాబులు ప్రచురించారు. ఇంకా అముద్రితంగా ఎన్నో జాబులు మిగిలి పోయాయి. అట్లా అముద్రితంగా మిగిలిపోయిన జాబుల్లో 1912-14 సంవత్సరాలమధ్య వేదం వెంకటరాయశాస్త్రిగారికి గురజాడ అప్పారావుగారు వ్రాసిన ఏదారు జాబులు కనబడ్డాయి. ఈ లేఖల్లో కూడా ఎన్నో విలువైన విషయాల ప్రస్తావన లున్నాయి. గురజాడ

జీవితచరిత్ర రచనలో నిమగ్నులై ఉన్న శ్రీ కె. వి. రమణారెడ్డి గారికి ఈ గురజాడ అముద్రిత లేఖలు చూడంగానే ప్రాణం లేచివచ్చింది. ఆ లేఖలన్ని కాపీచేసికొని అచ్చుకు సిద్ధంగా ఉన్న తన గ్రంథంలో అనుబంధంగా ఇరికించారు. కె. వి. రమణారెడ్డి గారి గ్రంథం వెలువడితే గురజాడ వేదంవారల మధ్యవున్న సంబంధాలపై అనేక కొత్త అంశాలు వెలుగు చూడవచ్చునిపిస్తుంది.

మొత్తంమీద చూస్తే వొక్క వేదం వెంకటరాయశాస్త్రి గారి పాండిత్యంమీదనే రిసెర్చిచేయ తగ్గంతగా మెటీరియల్ ఉంది. అదే విదేశాల్లో అయితే కవి, పండితుల మరణాంతరం- ఈ లేఖలు, డైరీలు, నోట్సుల ఆధారంతో ఎన్నో జీవిత చరిత్ర-విమర్శ గ్రంథాలు వచ్చేవి. మనలో ఈ కృషి చాలా తక్కువ. ప్రస్తుతం వేదం వారిపై డాక్టరేట్ చేస్తున్న శ్రీమతి మల్లంపల్లి సుజాతమ్మగారు ఈ లోపం పూరించి వేదం వెంకటరాయశాస్త్రిగారిపై వొక సర్వ సమగ్రమైన థీసిస్ గ్రంథాన్ని రాయాలని, లేదా ఆయన మనుమలు వెంకటరాయశాస్త్రిగారినైనా ఇందుకు పూనుకోవాలని నా ఆశ.

ఇంకో విషయం - మరుగున పడిపోయిన మరో మహా పండితులు కీ. శే వేదం వెంకటచలమయ్యర్ గారి ఉత్తర ప్రత్యుత్తరాల కట్టలు చెదపురుగులు తినగా మిగిలిన కొన్ని లేఖలు తనవద్ద ఉన్నవని వెంకటరాయశాస్త్రిగారు చెప్పారు. ఆ అంశాలను కూడా వెలుగులోకి తీసుకురావాలని వారికి విజ్ఞప్తి చేస్తున్నాను.

ఏమైనా ఇట్లాంటి అమూల్యమైన సారస్వత సామగ్రి అంతా ఏ విశ్వవిద్యాలయాల్లోనో, లేదా ఏ కాలేజీ గ్రంథాలయాల్లోనో లేదా మరే ప్రఖ్యాత పుస్తక భాండాగారాల్లోనో మ్యూజియంలుగా భద్రపర్చ తగినవి. వాటికి ఆ ఆచారము లేదు. ఏం చేస్తాం?

## కవికోకిల అముద్రిత గ్రంథాలు

ఉత్తముడైన కవి మరణించిన ఎన్నో వేళ్లకు కూడ అతని సాహిత్యాన్ని గూర్చి కొత్త పరిశీలన, పరిశోధన, అనుశీలన సాగుతూనే ఉంటుంది. అందుకే కవి అన్నవాడికి మరణం లేదని మనవారు అనేది.

కవికోకిల దువ్వూరు రామిరెడ్డిగారు మరణించి రెండు దశాబ్దాలైంది. ఆయన రచనలన్నీ దాదాపు 9 సంపుటాలుగా వెలువడినాయి కొన్ని ఏడెనిమిది ముద్రణలు కూడ పొందినాయి. ఆయన డైరీలు – ఉత్తరాలు, జాబులు ఒక చిన్న సంపుటంగా కూడ వెలువడినాయి. ఆయన జీవితము – సాహిత్యము ఎస్టిమేట్ చేస్తూ ఒక పెద్ద గ్రంథమూ వచ్చింది. ఇవన్నీ చదివిన వారు చదువుతున్నారు, మర్చిపోయినవారు మర్చిపోతున్నారు.

ఇరవయి ఏళ్ళు గడిచిపోయిన తరువాత కూడ కవికోకిలను గూర్చి ఇంకా ఏముంది స్టడీ చేసేందుకు – అని తోచవచ్చు. కాని నిన్నగాక మొన్న లేచిన అభ్యుదయ కవిత్వ వివాదాల్లో శ్రీ శ్రీ ఒక వ్యాసం రాస్తూ ("ఆ మాటకొస్తే ఆధునిక కాలంలో మొట్టమొదట వచనగేయం రాసింది శ్రీ కవికోకిల దువ్వూరు రామిరెడ్డి") అని అన్నారు. ఏమిటా వచనగేయం అని ఆయన రచనలన్నీ తిరగవేయవలసి వచ్చింది. కొత్తకోణాన్ని ఏర్పరచుకోవలసి వచ్చింది.

గ్రంథరూపంలో రావల్సిన, రాతగిన కవికోకిల అముద్రిత రచనలు ఇంకేమున్నాయో అనుకునేవారికి బహుళ జనవరి సం॥ శాంతినాటికల్లా శ్రీ. వి. రమణారెడ్డిగారు 'కూర్పరి' తనంలో వెలుగు చూడబోతున్న సంపుటమే సాక్ష్యం కాబోతుంది. అముద్రితంగా ఉన్న కవికోకిల రచనలు – ప్రారంభ రచనలు – పరిణత రచనలు –

ఇంకా ఎన్నో ఉన్నాయంటే కాలం మాటున ఇంత కాలం అణిగి మణిగి ఉన్నాయంటే ఆశ్చర్యమే కలుగుతుంది.

'గుడివాడ రత్నం' అనే ఒక కథ, 'నా దేశాటనం డైరీ' అనే సుదీర్ఘమైన బయోగ్రాఫికల్ వ్యాసం పాత 'భారతి'లో అచ్చయింది. ఇంకొక కథ అట్లానే ఈ సంచికలోనే డా॥ డి. వి. సుబ్బారెడ్డిగారు ప్రస్తావించిన "కర్షకవిలాసం" అనే సాంఘిక నాటకం అదృష్టవశాత్తు 1917 నాటి ఈ నాటక ప్రతి కవికోకిల సొంత అక్షరాలతో భద్రంగానే ఉంది. కాని అక్కడక్కడ చెమ్మగిలి అక్షరాలు శిథిలమై ఉన్నాయి. ఈ నాటకాన్ని 1917 లో ఏదో కాన్ఫరెన్స్ సందర్భంగా నెల్లూరు టౌన్ హాలులో ప్రదర్శించడం జరిగింది. కానీ అది ఇంత కాలం గ్రంథస్థం కాలేకపోయిందా) అట్లానే 'ధృవ' అనే మరో నాటకం ఇదీ అముద్రితమే.

కీ. శే. రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు మరణించిన సందర్భంగా రచించిన పద్యాలు, తనకు తెలుగు చెప్పిన అయ్యవారి స్మృతి సూచకంగా వ్రాసిన పెద్ద పద్యరచన, అలాగే విలువిద్యలో నిపుణులైన 'కలియుగార్జునుడి' పై వ్రాసిన పద్యాలు, మరోకొన్ని పద్య ఖండికలు కొన్ని ఇంగ్లీష్ జాబులు, రచనలు, వ్యాసాలు, ఇట్లా అన్నిటిని కె. వి. రమణారెడ్డి సంకలనం చేసి ప్రెస్ కాపీని సిద్ధపరచి ఉన్నారు. దాదాపు రెండువందల పేజీల గ్రంథమవుతుంది. బహుశ డిశంబర్ లో ప్రెస్ కు పోవచ్చు. ఈ పాత రచనల్ని గాలికి పోనికుండా ఇంత కాలం భద్రపరిచిన కవికోకిల కుమారుడు (శ్రీ) వేణుగోపాలరెడ్డి బహుధ అభినందనీయులనే చెప్పాలి.

ఇన్ని అముద్రిత రచనలు నిలబడినా, ఇంకా కొన్ని వెలుగు చూడవల్సి ఉన్నాయి. ఉదాహరణకు కీ. శే. (శ్రీ) వాత్సవగారు బ్రతికుండగా ఆ మధ్య ఒక వ్యాసంలో వ్రాయడమే కాకుండా పదే పదే ప్రస్తావిస్తూ వచ్చారు. 1927 లో నెల్లూరులో పెద్ద గాలి

వాన వచ్చినప్పుడు ఆ మందటనే 'గాలివాన' అనో 'తుఫాన్' అనో కథ వ్రాసి ఆంధ్ర దినపత్రికలో అచ్చువేసి ల్లు చెప్తాండేవారు. శ్రీ వాల్మీకిగారు ఊరకే గాలికి చెప్పిన మాటకాదు. బాగా జ్ఞాపకంగా బాధ్యతతో చెప్పిన మాటే అది కానీ దురదృష్టవశాత్తు ఎంత గాలించినా ఆ కథపడ్డ ఆంధ్రపత్రిక ఇతవరకు దొరకలేదు. ఆ కథపడ్డట్లు స్మృతి ఉన్నవారు కూడ మరెవరు కనపడ్డం లేదు. ఎవరి దగ్గరైనా ఆ పత్రిక ఉండి పంపితే కృతజ్ఞతతో స్వీకరించి ఈ సంపుటంలోనే చేర్చి ముద్రించగలనంటున్నాడు శ్రీ కె. వి. రమణారెడ్డి.

ఇంకా వెలుగు చూడవలసిన కవికోకిల ఇంగ్లీష్ అనువాద గేయ రచనలున్నాయి. "వాయిస్ ఆఫ్ ది రీడ్" అచ్చయిన తరువాత రామిరెడ్డిగారు 'ఫలితకేశం' కావ్యాన్ని మొత్తం ఇంగ్లీష్ లోకి అనువదించారు. ఇంకా మరికొన్ని చిన్నగేయాలు కూడ ఇంగ్లీష్‌లో వ్రాసిపెట్టి పోయారు. "వాయిస్ ఆఫ్ ది రీడ్" తో కలిపి వీటినికూడ చేర్చి ఒక సంపుటంగా ఒక లండన్ ప్రెస్ వారిచేత అచ్చు వేయించే ప్రయత్నమొకటి జరిగింది అది సఫలం కాలేదు. పి. వి. రాజమన్నార్‌గారు కవికోకిల నాకు కళ పత్రిక రోజుల్లో వ్రాసిన జాబులకట్ట ఉంది, వెతుకుతాను అన్నారు-' ఆ మధ్య అవి కూడ దొరికితే మరో తరం దాటాకైనా ఇంకో సంపుటం తయారు కావచ్చునేమో, ఎవరు చూడొచ్చారు.

## శ్రీశ్రీ పల్కులు

శ్రీశ్రీగారు గత ఆదివారం నెల్లూరు వచ్చిపోయారు. స్టూడెంట్స్ ఫెడరేషన్ వాళ్ళు (ఉగ్రవాదుల బ్రాంచి కాబోలు) సభపెట్టి శ్రీశ్రీని పిలిపించారు. అంతటి ప్రఖ్యాత కవి నెల్లూరుకు వచ్చారు కాబట్టి, వి. ఆర్. కాలేజీ తెలుగుశాఖ విద్యార్థులు పిల్చి ఒక చిన్న సభ పెట్టారు. ఇది నిజానికి మంచి సంప్రదాయమే.

ఎవరైనా ప్రఖ్యాత వ్యక్తులు నగరానికి వచ్చినప్పుడు కాలేజీ వాళ్ళయినా పిలిచి ఒక చిన్నగోష్ఠి ఏర్పాటు చేద్దామనే జిజ్ఞాసే లేకుండా పోతున్నది నేటి మన కాలేజీలవాళ్ళకు.

ఈ దౌర్భాగ్యపు భారతదేశానికే కొట్టుకలాడి పడి వచ్చిన ప్రఖ్యాత సోషలిస్టు సైంటిస్టు జె. బి. యస్. హాల్డేన్ భార్య (ఈయన కూడా సైంటిస్టే) ఈ మధ్య ఒక పెళ్ళి సందర్భంగా నెల్లూరుకువచ్చి రెండు మూడు రోజులుంటే – ఇటు వి. ఆర్. కాలేజి వాళ్ళుకాని, అటు లేడీస్ కాలేజివాళ్ళు కాని పిల్చి ఒక చిన్న సభ పెట్టిద్దామనే జ్ఞానమే కలుగలేదు వాళ్ళకు. విజ్ఞాన కేంద్రాలుగా వుండాల్సిన మన కాలేజీలు కడకు విజ్ఞాన విరోధులుగా తయారౌతున్నవా అనిపిస్తున్నది. సరే ఈ గొడవ వదిలేసి అసలు విషయానికి వస్తాం.

శ్రీశ్రీగారు వచ్చారు వి. ఆర్. కాలేజి ప్రాక్ భవనంలో సభ. ఉపన్యాసశీర్షిక "ఆధునిక కవిత్వం" మామూలుగా శ్రీశ్రీ రాతగాడేకాని కొందరు అదృష్టవంతులైన ఆధునిక కవులమాదిరి కూతగాడు కాదు, కనీసం పాటగాడు కూడా కాదు. కవిత్వంలో ఎంతగా విజృంభించగలడో, గావుకేకలు వేయగలడో, ఉపన్యాసంలో అంత చప్పగా వుండగలడు. కయ్ కయ్ అనలేడు. ఆరోజు 'డోస్' వేసుకోలేదేమో అనూజువల్‌గా బాగా మాట్లాడాడనే చెప్పాల్సి వుంటుంది.

"ఆధునిక కవిత్వం" అనే గుడారం క్రింద అన్ని ప్రక్రియల్ని కప్పివేయవచ్చుని, దానికి అంత విస్తృతార్థం వ్యవహారంలో వుందని చెప్తూ– అసలు కవిత్వాన్ని రెండు విధాలుగా, తాను విభజిస్తానని ఒకటి పాడేది, మరొకటి మాట్లాడించేది, పలికించేదనీ చెప్పారు. ఇందుకు పాత కొత్త కవిత్వాల్లో వుదాహరణలిస్తూ నన్నయ్య, శ్రీనాథుల కవిత్వం పాడుతుందనీ, ఝుమరవిస్తుందని చెప్పారు. ఇక తిక్కన, వేమన, చెళ్ళపిళ్ళకవి వీరు కవిత్వంతో మాట్లాడిస్తారని

అంటూ నవ్వుల్లో గురజాడ వర్గానికి చెందితే రాయప్రోలు తొలి వర్గానికి చెందుతారని అన్నారు.

తిక్కన కవిత్వం సమకాలాన్ని దాటి ఎంతో ముందుకు వచ్చిందని చెప్తూ తిక్కన సినిమా టెక్‌గా కూడా రాస్తారని పేర్కొంటూ యిందుకు కృష్ణుడు రాయబారం వెళ్ళేముందు ద్రౌపది అతని ముందుచేసిన ప్రసంగఘట్టం వుదాహరణ అని, ద్రౌపదిని తిక్కన క్లోజప్‌లో చూపుతాడని యిది గొప్ప ప్రతిభ అని చెప్పారు.

(తిక్కనగూర్చి, తిక్కన కవిత్వవైభవముగూర్చి శ్రీశ్రీ అనేక సందర్భాల్లో వేనోళ్ళ ప్రస్తుతించి వున్నాడు. ఈ యేడైనా తిక్కవరపు రామిరెడ్డిగారు కవిత్రయ జయంతులను శ్రీశ్రీని పిల్చి తిక్కన జయంతిలో ఆయనచేత ప్రసంగింపజేసి తిక్కన్న బహుమానాన్ని శ్రీశ్రీ కివ్వడం వుచితంగా వుంటుందని 'లోకలిస్టు' సూచిస్తున్నాడు.

## 'నిత్యవృద్ధుడు' శ్రీ కొడవటిగంటి కుటుంబరావు చేసుకోని షష్టిపూర్తి

“ఇవాళ అకస్మాత్తుగా పత్రికలన్నీ ఆగిపోతే ఏమవుతుంది? అని మనల్ని నిలేసి ప్రశ్న వేస్తే మనకు నవ్వు, ఆశ్చర్యమూ, కోపమూ కూడా వస్తాయి. ఎందుచేతనంటే అది అర్థంలేని ప్రశ్న. పత్రికలు లేకుండా ఈనాటి జీవితాన్ని మనం ఊహించుకోకూడా లేం. ఇవాళనించి పత్రికలను నిషేధిస్తే జనం అల్లాడిపోతారు. అంత వరకు మనం సులభంగా గ్రహించుకోగలం. కానీ ఎందుకు అల్లాడిపోతారు? పత్రికలు చదవనివారంతా నష్టపడిపోతున్నారా? అంటే మటుకు సూటిగా చెప్పలేం. ఒకప్పుడు ప్రజలు పత్రికలు లేకుండా బతికారు. రిపోర్టుచెయ్యకుండానే ఎంతో చరిత్ర గడిచిపోయింది.

అటువంటప్పు డీనాడు ప్రజలకు అకస్మాత్తుగా పత్రికల అవసరం ఇంతగా ఎట్లు కలిగింది?

ఈ ప్రశ్న లన్నిటికీ సమాధానం చెప్పవచ్చు. ఒకనాటి ప్రజా జీవితానికీ ఈనాటి ప్రజల జీవితానికి చాలా వ్యత్యాసం ఉంది. ఆనాటి ప్రజల జీవితం ఖండజీవితంగా వుండేది. వారి ప్రపంచమూ, వారి అనుభూతీ క్లుప్తంగా ఉండికూడా సమగ్రంగా ఉండేవి. ఇప్పటి ప్రజల జీవితం జీవితఖండం. విశ్వప్రజాజీవితంలో వివిధ దేశ, రాష్ట్ర, గ్రామ ప్రజల జీవితం ఒక్కో తునక. దీనికి సమగ్రత లేదు. ఏ జర్మనీ మీదనో ఇంగ్లండు, ఫ్రాన్సు దేశాలు యుద్ధం ప్రకటించగానే ఈ దేశంలో ఒక మూల ఒక పల్లెలో ఉన్న అన్నదమ్ముల విడిపాటవుతుంది. మరో మూల మరో పల్లెటూళ్ళో వున్న కుర్రవాళ్ళందరికీ సంపాదన దొరుకుతుంది. ఇంకో మూల ఇంకో పల్లెటూళ్ళో తిండిదొంగలు బయల్దేరి గ్రామస్తులను మాడ్చేస్తారు...... ఈనాటి ప్రజాజీవితం దేశాన్ని చుట్టేస్తుంది. ప్రపంచాన్నే చుట్టివస్తుంది. పత్రికలు లేనిపక్షంలో ఎవరి అనుభవానికి అర్థం కనబడదు......

ప్రజలంతా పత్రికలు చదవడం లేదు. చదివేవాళ్ళు కూడా ప్రజాజీవిత సినిమాకథను పూర్తిగా అవగాహన చేసుకోవడం లేదు. కాని టూకీగానైనా అధిక సంఖ్యాకులకు మానవచరిత్ర అర్థమవుతున్నదంటే అది పత్రికలమూలంగానే, పత్రికలు చూడనివాళ్ళు కూడా చూచినవారి సంపర్కంవల్ల కొంతవరకు జ్ఞానం సంపాదిస్తున్నారు......"

అసలు సమస్య పత్రికలు ప్రజలకు వుపయోగపడతాయా అని కాదు, ఇంతకన్నా అధికంగా ఎందుకు ఉపయోగపడటం లేదని; ప్రజాజీవిత సినిమాకథ ప్రజలందరికీ పత్రికలద్వారా ఎందుకు సరిగా అర్థంకావడం లేదని. ఈ ప్రశ్నకూ సమాధానం ఉంది; పత్రికలు సాధారణంగా నడపబడుతున్నది ప్రజలకోసం కాదు....." అంటూ ప్రశ్న వేసుకుంటూ సమాధానాలు చెప్పుకుంటూ నడిచి పోతుంది ఈ వ్యాసం.

ఆఖరున ఉన్న ముగింపు వాక్యాలు చూడండి!

సత్యం జరిగినదానితో జరిగేదాన్ని ముడిపెట్టే జీవితంలో ఏకత్వం నిరూపిస్తుంది. అసత్యం దాని కాళ్ళమీదనే అది ఎంతో కాలం నిలబడలేదు—అన్నాడొక మహాపురుషుడు. నిజమైన ప్రజా సేవ చేసే పత్రికలు జరిగే చరిత్రలో ఏకత్వాన్ని నిరూపిస్తే, ప్రజలకు ద్రోహం చేసే పత్రికలు ఏనాటిమాట ఆనాడు చెబుతై. వీటిని సీరియల్‌గా వెలువడే అసత్య చరిత్రలనవచ్చును."

ఈ వ్యాసం మధ్యలోనే మరో కీలక వాక్యం వుంది—"మానవ చరిత్రలో పత్రికలు చేసిన భయంకరమైన, సంఘవిద్రోహకరమైన పనులకు, పత్రికలే మనుషులై ఉంటే వాట్ని ఎప్పుడో ఉరితీసి ఉండవచ్చు... కానీ పత్రికలు నడిపేవారు చెప్పి చెవర లేదు."

ఈ వ్యాసం దాదాపు ఇరవై ఏళ్ళ క్రితం 'నవోదయ' అనే పత్రికలో అచ్చయింది. వ్యాసకర్త కొడవటిగంటి కుటుంబరావు గారు. ఈ వ్యాసం అచ్చుపడ్డ ఇరవై ఏళ్ళ తర్వాత మొన్నా మధ్య పాతపత్రికలు గాలిస్తుంటే నాకళ్ళ పడ్డవి. జర్నలిజంలో ఆరేడేళ్ళపాటు నలిగి ప్రథమ పాఠాలు నేర్చుకున్న స్థాయిలో ఉన్న నేను ఈ వ్యాసం చదివిన తర్వాత వొక విధంగా కనువిప్పును పొందాను. నాలో అస్పష్టంగా మెదులుతూ ఉండిన భావాలను ఆయన ఇరవై ఏళ్ళ క్రితమే స్పష్టీకరించారు. పై వ్యాసంలో నేనిక్కడ వుల్లేఖించకుండా వదలివేసిన భాగాలే నన్ను కదల్చిన అంశాలు.

ఏది వ్రాసినా అమోఘమైన స్పష్టత ఉంటుంది కుటుంబరావు గారి రచనల్లో; సరళత ఉంటుంది. కథ వ్రాసినా, వ్యాసం వ్రాసినా, గల్పిక వ్రాసినా, నవల వ్రాసినా, సాహిత్య చర్చ చేసినా తికమకలు యేకోశానా వుండవు. clarity వుంటుంది. ఇంత స్పష్టత వుండబట్టే నేమో ఆయన కవిత్వం జోలికి పోలేదు.

ఈ నెల 28 వ తేదీతో ఆయనకు 60 యేళ్లు పూర్తయినాయి. కుటుంబరావు వంటి సాహిత్యవ్యక్తికి 'షష్టి పూర్తి' అనేది సరిపొద్దు కాదు, కొండగుర్తూ కాదు, కుంచుకపోకుండా ఆయన ఈనాటికీ చురుకైన రచనలు చేస్తూనే వున్నాడు. అందుకే ఆయన షష్టిపూర్తి లాంఛనంగా కూడా చేసుకోలేదు.

ఆయన వ్రాసిన మొదటికథ 'గృహలక్ష్మి'లో 1931 లో అచ్చుపడ్డది. మొదటి మూడు నాలుగు సంవత్సరాలు తప్పటడుగులు వేశాడేమో కానీ దాదాపు 1935 నుండి పడ్డ అడుగు ప్రతి రచనలోనూ పరిపక్వత చూడగలం. దాదాపు 35 యేళ్ళ క్రితం నుండి కూడా 'తల నెరిసిన' మనిషిగానే 'జ్ఞాని'గా వ్రాస్తూవచ్చాడు. అందుకనేమో 'కుటుంబరావు నిత్యవృద్ధుడు' అన్నారు రమణారెడ్డి.

ఈ 35 యేళ్ళుగా ఎన్నో పత్రికల్లో ఆయన రచనలు దర్శనమిస్తాయి. దాదాపు 5, 6 వందల కథలు; మరో 2, 3 వందల వ్యాసాలు; 20, 30 నవలలు, నవలికలు, ఇంకా గల్పికలు, అవీ, ఇవీ ఇంకా ఎన్నో.

60 యేళ్ళు ఇంకో మూడు రోజుల్లో నిండుతాయనంగా మద్రాసులో ఆయన్ని కలిశాను. ఆయన సంపాదకుడుగా ఉన్న 'బాలల పత్రిక'లో ఆయన సంపాదకత్వ ముద్ర నాకేకోశానా కనబడదు కానీ 90 వేల సర్క్యులేషన్‌లో ఉన్నదట. ఇదే హిందీలో ఉండే 60 వేల సర్క్యులేషన్‌లో వున్న ఒక ఉత్తరాది బాలల పత్రిక సంపాదకుడికి 1800 రూపాయల జీతమైతే కుటుంబరావుకు అందులో సగంకూడా లేదేమో. ఇది మన దక్షిణాత్యుల ధోరణికి నిదర్శనమేమో నంటాను.

కుటుంబరావుగారిది ఎప్పుడూ వ్యక్తివాదం కాదు. సాంఘిక వాదమే. సోషియాలజీ బాగా వంటబట్టించుకున్న రచయిత. ఒక స్పష్టమైన సాంఘిక దృక్పథం ఆయన రచనల్లో కనపడుతుంటుంది.

వ్యక్తుల మనస్తత్వాలను గూర్చి గాలికబుర్లకన్నా ఆమనస్తత్వా న్నాడించే సాంఘిక శక్తుల చిత్రణే కుటుంబరావుగారి రచనల్లో మనకు కనపడేది.

ఒక వ్యాసంలో ఆయనంటాడు! "నేను మధ్యతరగతి సంస్కారం కలవాణ్ణి, ఈ సంస్కారంతో నేను అభ్యుదయ రచనలు చేయగలను కానీ ప్రజాసాహిత్యమూ, శ్రామికవర్గ సాహిత్యమూ సృష్టిచేయలేను...కానీ మధ్యతరగతి వారిలో ప్రజా జీవితానికి అనుకూలించే పరివర్తన తెచ్చే అవకాశం వుంది" అంటాడు.

## వర్ధమాన సమాజం — శ్రీ శ్రీ షష్ఠిపూర్తి!

శ్రీశ్రీ మహాకవి షష్ఠిపూర్తి విశాఖపట్నంలో రేపు జన వరిలో జరుగుతున్నది. పేరుకు విశాఖపట్నంలో అనేగానీ సగం పనంతా నెల్లూరులోనే జరుగుతున్నది.

శ్రీశ్రీ షష్ఠిపూర్తి అంటే పూలమాలలు, సన్మానాలు, సభలు, సందడులుకాదు. ఆరోజు శ్రీశ్రీ సాహిత్యమంతా పుస్తక రూపంలో సంపుటీకరించి వెలువరిస్తారు. దాదాపు 2 వేల పేజీలకు సరిపడే సాహిత్యం సృష్టించారు శ్రీశ్రీ.

ఇంతదాకా ప్రపంచం బాగా ఎరిగిన "మహాప్రస్థానం", "ఖడ్గసృష్టి"-ఇత్యాది గేయాలే కాదు, ఇంకా ఎన్నో అపురూప మైన పద్యాలు, గీతాలు, వ్యాసాలు, విమర్శలు, కథలు, స్కెచ్‌లు, అనువాదాలు, లేఖలు, జోక్స్ ఇట్లా ఎన్నో ఉన్నాయి.

ఇప్పుడు ఈ షష్టిపూర్తి సందర్భముగా ఈ రచనలన్నీ ఏర్చి కూర్చి గ్రంథరూపంలో వెలువరించేపని మన శ్రీ కె. వి. రమణా రెడ్డిగారికి అప్పగించారు. ఆయన ఇల్లు యిప్పుడు శ్రీశ్రీ రచనల

యజ్ఞగుండంగా తయారైనది. ఏవేవో పాతపత్రికల్లో చిక్కిరి బిక్కిరిగా మాటు మణిగియుండిన శ్రీశ్రీ రచనలన్నీ త్రవ్వి తీయడమనే పరిశోధనా కృషిలో శ్రీ రమణారెడ్డి పరిశ్రమిస్తున్నారు. తెలుగుదేశం దౌర్భాగ్యం ఏమిటంటే-ఎవరి పత్రికలు వారి కార్యాలయంలోనే పూర్తిగా పద్దులుగా ఉండవు. మన తెలుగుదేశపు గ్రంథాలయాలకు కూడా ఆస్పృహ లేదు.

నెల్లూరు వర్ధమాన సమాజ గ్రంథాలయానికి కొంతకు కొంత అస్పృహ ఉండబట్టి ఆ పాతపత్రికల సంపుటాలన్నీ భద్రంగా ఉంచబట్టి శ్రీశ్రీ ప్రారంభ రచనలన్నీ లభ్యమయ్యాయి. వేటపాలెం సారస్వత నికేతనం లైబ్రరీలోను మరికొన్ని లభ్యమయ్యాయి. ఇక ఆంధ్రదేశం వివిధనగరాలనుండి శ్రీశ్రీ అభిమానులెందరో సేకరించి పంపించారు.

ఇక్కడ మనకు సంబంధించి నేను చెప్పదల్చుకున్న దేమంటే ఈ శ్రీశ్రీ సహిత్య సేకరణ మహాయజ్ఞంలో నెల్లూరు టౌన్‌హాల్ లైబ్రరీ యథోచితంగా కొన్ని సమిధలు సప్లయిచేసిందని మాత్రమే.

శ్రీ శ్రీ సాహిత్య సంపుటాల ముద్రణ జరుగుతూ ఉన్నది. ఇప్పటికి రెండు సంపుటాల పనైంది. ఇంకా మరో రెండు మూడు సంపుటాలు ముద్రణ కావల్సి ఉన్నది. షష్టిపూర్తినాటికి "శ్రీశ్రీ సాహిత్య సర్వస్వం" విడుదల అవుతుంది.

ఇన్నిచోట్లనుండి యిన్నిరకాలుగా సేకరణ జరిగినా ఇంకా శ్రీశ్రీ ముద్రిత రచనలు కొన్ని అలభ్యంగానే యున్నవి మరి, 1925 ప్రాంతాన పురిపండా అప్పలస్వామిగారి సంపాదకత్వాన వెలువడిన "స్వశక్తి" పత్రికలో "దివ్యాలోచనములు" అనే శ్రీశ్రీ ప్రథమ కవిత్వం అచ్చుపడ్డది. అప్పటికి శ్రీశ్రీ వయస్సు 15 సంవత్సరములు మాత్రమే.

ఆ పద్యాల్లోనుండి లీలగా జ్ఞాపకం ఉన్న వ్యక్తినుండి ఈ క్రింది చరణాలు సేకరించగలిగారు. రమణారెడ్డిగారు. విశ్వరూపం ధరించిన కృష్ణపరమాత్మను ధృతరాష్ట్రుడు దృష్టిదానం అర్థిస్తున్నాడు ఆ పద్యచరణాలికి.

"ఓ మహాత్మా! త్వదీయ మహోన్నత ప్రభావమింతని తెలుప నెవ్వానితరము?...దివ్యలోచనముల ప్రసాదింపుమయ్యా!"

అట్లనే 1925 లో విశాఖపట్నం తుఫాను వచ్చినరోజుల్లో "పరిణయ రహస్యం" (అనే డిటెక్టివ్ నవల) అచ్చయినది. పదిహేను వళ్ళలోనే శ్రీశ్రీ కవితలు నవలలు వ్రాశాడు. అచ్చు వేసాడు కూడా. చరిత్రకారుడికీ, చరిత్ర దృష్టిఉన్న పాఠకుడికీ ఇవి ఎంతో ముఖ్యమైన రచనలే పై రెండూ ఎంత ప్రయత్నించినా ఇంత వరకూ లభ్యంకాలేదు. రమణారెడ్డిగారు ఇంకా గాలిస్తూనే యున్నారు. ఎందరెందరితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ బహుధాప్రయత్నాలు చేస్తున్నారు.

అచ్చుపడ్డ రచనలకే ఈ దేశంలో గతిలేదంటే ఇంకేమనాలో చెప్పండి. 40 వళ్ళక్రితం అచ్చుపడ్డ వాటికి ఎంత తంటాలు పడవల్సి వస్తున్నదో చూడండి. ఈ మాత్రం చారిత్రిక స్నేహమున్న గ్రంథాలయాలు, సారస్వత సంస్థలూ ఈ దేశంలో లేవుమరి!

ఏమైతేనేం కె. వి. రమణారెడ్డి వొక్కడు వీటన్నిటిన్నీ త్రవ్వి తీస్తున్నారు. ఒక యజ్ఞదీక్షతో ఆయన విపుల పీఠికలలో రేపు జనవరిలో వెలుగు చూడనున్న ఈ నాలుగైదు సంపుటాల "శ్రీ శ్రీ సాహిత్యసర్వస్వం" నవ్యాంధ్ర సాహిత్యప్రియులకు అభిమానాంశముగా ఉండగలదు.

# చర్చిల్‌కు నెల్లూరుకు బాదరాయణ సంబంధం

మేరు పర్వతంవంటి చర్చిల్ పరమపదించారు. చర్చిల్ అంటే నిజం చెప్పాలంటే నాకు మంచి అభిప్రాయంలేదు. ఏదో మూర్తీభవించిన ఆరిస్టోక్రసీ ముద్దకట్టుకొని ఉన్నట్లు కనబడతాడు. ఆయన అంతేకాదు ఆయనకు భారతీయులంటే భారతీయనాయకులంటే ఎప్పుడూ గిట్టలేదు. గాంధీగారిని నేకెడ్ ఫకీర్ అన్నాడు. నెహ్రూ అంటే ఆయనకు అనుకూలాభిప్రాయంలేదు. భారతీయనాయకత్వం మరుగుజ్జని అంటాడాయన. (మరి ఇందులోని నిజం ఇప్పుడిప్పుడు బోధపడుతున్నది కదా!)

ఇట్లాంటివారిని మనమెందుకు ప్రేమించాలి? మనకెందుకు సదభిప్రాయం వుండాలి? అని కాదుగాని ఆయనను నేను ప్రేమించేది గొప్ప రచయితగా, గొప్ప ప్రజాస్వామికా పార్లమెంటేరియన్‌గా, చలోక్తిమయ భావనా చక్రవర్తిగా, పాలనా యంత్రాంగంలో, యుద్ధతంత్రాంగంలో సవ్యసాచిత్వం జరిపిన ధీశాలిగా ఆయనను నేనభిమానిస్తాను.

అయితే ఇంతకు నేను చెప్పొచ్చేదేమిటంటే నా వ్యక్తిగతాభిమానాలనుకాదు. కొన్ని చారిత్రకాంశాలను గురించి మాత్రమే. నెల్లూరుకు చర్చిల్‌కు కొంత చరిత్రకెక్కని బాదరాయణ సంబంధముందని మాత్రమే. చర్చిల్‌ను పోలో ఆటలో ఓడించిన ప్రజ్ఞావంతులైన క్రీడాకారులు ఆ రోజుల్లో నెల్లూర్లో వుండినారని చెప్పడానికి మాత్రమే.

1902 లో కాబోలు ఇండియాకు మిలిటరీ ఆఫీసరుగా చర్చిల్ వచ్చారు. చర్చిల్ మంచి పోలో ఆటగాడు. బెంగుళూరులో ఆయన కొన్నాళ్లు వుండినప్పుడు మన నెల్లూరులో వారితో పోలో ఆట ఆడి ఓడిపోయారని వొక చరిత్రకాంశాన్ని చదవడం తటస్థించింది.

అప్పటి రోజుల్లో వెంకటగిరిరాజులు పోలో ఆటలో మంచి ప్రజ్ఞావం తులుగా ఉన్నారు. రాజా వేణుగోపాలయాచేంద్ర, రాజా వెంకట కృష్ణయాచేంద్ర, బాలారెడ్డి రామనాథం, బాలారెడ్డి కాశప్ప మొదలైనవారు పోలో ఆటలో మంచి ఘటికులుగా ఉండి పేరుపడ్డారు. ఆనాడు చర్చిల్ జట్టు పోలో ఆడింది యీ మన వెంకటగిరి జట్టుతోనే. చర్చిల్ జట్టు వోడిపోయింది. తర్వాత చర్చిల్ తన పోలో గుర్రాలను వెంకటగిరి రాజులకు విక్రయించి లండన్ వెళ్ళినట్లు చరిత్ర చెపుతున్నది. బాలారెడ్డి రామనాథంగారు వ్రాసిన "How to play polo" (పోలో ఆట ఆడ్డం ఎట్లా?) అనే పుస్తకంలో ఈ వృదంతం వుంది. మన నెల్లూరుజిల్లా పరిషత్ వారి సర్వస్వంలోకూడా యీ చారిత్రకాంశాలన్ని గ్రంథీకరించి వున్నారు. ఇప్పుడు చెప్పండి చర్చిల్‌కు నెల్లూరుకు బాదరాయణ సంబంధం ఉందో లేదో? ఈ సందర్భంగానైన "నెల్లూరు జి. ప. సర్వస్వం" ప్రస్తావనకు రావడం ఆసర్వస్వం చేసుకున్న అదృష్టమేననుకోవాలి.

## నెల్లూరు శ్రోతల చెవుల తుప్పు వదలిగొట్టిన సంగీతసభ

ఆదరించే తాహతు లేదు గాని, అభినివేశించే సాధన లేక పోయినా గానీ, నాకు సంగీతమంటే, ప్రత్యేకించి శాస్త్రీయ సంగీతమంటే అభిమానం, ఆభిరుచి వల్లమాలినంతగా ఉన్నాయి. నేనేదో గంధర్వాంశములో పుట్టానని నేనో గాయకోత్తముణ్ణయ్యే లక్షణాలున్నాయని నా జాతకం చెప్తున్నది. కాని ప్రస్తుతానికి యీ కూనిరాగాలాపన మేళకర్తగానే మిగిలిపోయాను. సంగీత సభలంటే చెవికోసుకునే వాల్యాం మాత్రం మిగిలింది.

డాక్టర్ బాలమురళీకృష్ణగారి సంగీత కచ్చేరి గురించి 'లోకలిస్టు కూనిరాగాలు' అనేది అధికప్రసంగం అని జమవేసుకునే సంప్రదాయజ్ఞులుంటే వుండవచ్చుగాని, శాస్త్రం అంతగా తెగ తెలియని

వారికికూడా ఆయన సంగీతకచ్చేరి శాస్త్ర ఆనందించడానికి వీలేటంత అవకాశంఉంది. ఎందువల్లనంటే ఆయనది స్వర్ణకంఠం. సాధారణంగా కర్ణాటక గాత్ర సంగీతజ్ఞుల కుండే ముక్కుపొడి ప్రౌఢ మోతమోగే కంఠం కాదు ఆయనది. అమిత సునాయాసంగా, సహజంగా, సజీవంగా రాగభావాన్ని వెల్లాగ్చే అమోఘమైన, శక్తిసంపన్నమైనది ఆయన స్వర్ణకంఠస్వరం. అద్భుతమైన ఆయన రాగ విస్తారం, స్వరవిస్తారం, ప్రజ్ఞాప్రాభ వేంద్రజాల వేగాలు సగటు స్థాయి శ్రోతకూడా క్షణంలో సమ్మోహమైపోవడానికి వారి సొమ్ముతా అపూర్వమైన వారి "వాయిస్ కల్చర్."

శాస్త్రీయ స్వచ్ఛతకు యెక్కడా భంగం రానీయకుండా అతను సాధించే మౌలికమైన 'మెలోడీ' అద్భుతమైంది. కర్ణాటక బాణీలోనే మనోహరమైన హిందుస్థానీ ఛాయల్ని భ్రమింపచేస్తాడు. రాతిసంప్రాయమైన శాస్త్రాంశాలనే కాకుండా రాగంలోని ఆయువు పట్లు నెరిగిన కళాశీలి. అంత పాండిత్యమున్నా ఆయనలో ఇంకా యేదో నవనవోన్మేషమైన గవేషణతోటి విన్నూతన చురుకైన ప్రయోగశీలత కానవస్తుంది. కళ్యాణి రాగంలో "సుందరీ నీ దివ్య రూపు", "వాతాపి" కీర్తనలు చాలా గొప్పగా గానం చేశారు. దర్బారీ కానడలోను, సింధుమంధారి, ఝుంఝూటిలోను రక్తికట్టించారు. తత్వాలు, తరంగాలు, అష్టపదులు, భక్తిగీతాలు ఇట్లా మెన్నో—ఒక మహావిస్తృతమైన రాగసామ్రాజ్యాన్ని సృష్టించారు. రెండు గంటల సేపుకు పైగా "నగుమోమును" రక్తికట్టించ లేక పోయాడు. ఒకటనిపిస్తుంది. మధ్యమ, మంధార స్థాయిలలో తప్ప తారస్థాయిలో మెప్పించలేకపోయా డనేది బాగా బట్టబయలై పోయింది. ఇట్లాంటి అగ్రశ్రేణి కచ్చేరిని నెల్లూరులో ఏర్పాటుచేసి తమ అగ్రశ్రేణి అభిరుచిని మరొకసారి వ్యక్తం చేసుకొన్నది "యువభారతి".

## ఆర్భాటంలేని ఐదుగురితో మహాసభ

మొన్న రాజవీధిలో ఒక మేడపైన ఐదుగురితో ఒక సభ జరిగింది. అది ఎంతో ప్రధానమైన సభగా నేను భావిస్తున్నాను. కేవలం తాత్కాలికమైన రాజకీయ విభేదాలతో రంగవల్లులు సృష్టిసూ సభలు, సమావేశాలు, టీ పార్టీలతో, విందులతో సన్మాన సభలు జరుగుతున్న ఈ రోజుల్లో యిదేమి లేకుండా కళ, సంస్కృతి మొదలైన శాశ్వత విలువలతో ప్రమేయం పెట్టుకున్న భావుకులు ఐదారుగురు కల్సి రాజవీధిలో సభచేశారు. మొన్న 22 వ తేదిన రాజవీధిలో ఒక పహామి ప్రముఖ పత్రికారచయిత స్వర్గీయ భాషా సుబ్బారావుగారు జీవించిన భవనం ప్రక్కన ఒక మేడమీద ఒక గలీజు గది ఉంది. ఆ గది గలీజుగా ఉండి ఉండవచ్చుగాని అది ఒక విజ్ఞాన ఖని. ఆ గదిలో ఎక్కడ చూచినా పాత పుస్తకాలు, పాత పత్రిక సంపుటాలు, ఉపనిషత్తులనుండి షేక్స్పియర్ పై యిటీవల వచ్చిన పుస్తకాలదాకా అన్ని రకాలవి చిందరవందరగా పడి వుంటాయి చెల్లాచెదురుగా. ఆ గది గోడపైన శ్రీ హెచ్. వి. రామగోపాల్ గీసిన స్వర్గీయ ఆనందకుమార్ స్వామిగారి పెద్ద రేఖా చిత్రం ఉంటుంది. దాని ప్రక్కన నటరాజు చిత్రం ఏదో పురాతన సంస్కృతీ సౌరభం ఆ గదిలో గుప్ గుప్మంటూంటుంది.

నాలుగణాలు పెట్టి పూలు తెచ్చి సన్నని పూలమాల అల్లారు. ఆ పూలమాలను ఆనందకుమారస్వామి పటానికి వేసారు. వి. ఆర్. కాలేజి లెక్చరర్ శ్రీ కాపుటూరు రామచంద్రరావు శ్రీ ఆనంద కుమారస్వామిగారిపై వ్రాసుకొచ్చిన ప్రసంగ వ్యాసం చదువు తున్నారు. ''లోకలిప్తం''ను కూడ పిలిచారు కనుక మీమూ ఈ సభకు వెళ్ళారు. వెళ్ళేసరికి ఆ గదిలో సభాసదులు అయిదుగురున్నారు. ఒకరు శ్రీ ఎన్. ఎస్. కృష్ణమూర్తి, మరొకరు సి. పద్మనాభరావు,

మరిద్దరు కాలేజి విద్యార్థులు, లోకలిష్టును కూడ కలుపుకుంటే అయిదుగురు. శ్రీరామచంద్రరావు శ్రీ కుమారస్వామిగారి వ్యక్తిత్వ వైభవాన్ని గూర్చి వ్రాసిన వ్యాసం చదవడం పూర్తిచేసారు.

ఆ తర్వాత శ్రీ ఎన్. ఎస్. కృష్ణమూర్తిగారు మూడు నాలుగు మాటలు చెప్పారు. "చాలా రోజుల కితం 'లా మెరా' అనే పాశ్చాత్యవనిత ఉదయశంకర్ గారు న్యూయార్క్‌లో పర్యటిస్తుండి నపుడు ఆయన దగ్గరకు వెళ్ళి మీ శిష్యురాలిగా చేర్చుకుని నాకు భరత నాట్యం నేర్పించండి – అని అర్థించింది. అప్పుడు ఉదయశంకర్ గారు మీకు నేను నాట్యం చెప్పలేను కానీ ఇదిగో ఈ పుస్తకం తీసుకోండి; ఈ పుస్తకం రాసినాయన నా గురువుగారు, దీన్ని మీరు చదివితే మీకు ఆయన గురువై పోతారు – అని పుస్తకాన్ని ఆమెకిచ్చారు. ఆమె ఆ పుస్తకాన్ని తీసికెళ్ళి చదివిందా, ఆయన రాసిన ఇంకా వందలాది పుస్తకాలని చదివింది. ఆయన్ను గురువుగా స్వీకరించింది. న్యూయార్క్‌లో ఒక నాట్య పాఠశాలను స్థాపించింది. దేశ దేశాల నాట్యాలను నేర్చింది, నేర్పించింది. ఇంతకు ఏమిటా గ్రంథం? ఎవరు ఆ గ్రంథాన్ని వ్రాసిన రచయిత? ఆ గ్రంథం నందికేశ్వరుని "అభినయ దర్పణము" అనే గ్రంథానికి. The Mirror of Gesture

అనే పేరుతో చేసిన ఆంగ్లానువాదం. ఆంగ్లానువాదకులు శ్రీ ఆనందకుమారస్వామి, కీ. శే. శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి సహకారంతో అనువాదం చేసారు. శ్రీ కుమారస్వామి ఆ గ్రంథానికి గొప్ప పీఠికను కూడ వ్రాసారు. ఆ పీఠిక మరీ ఆ వనితను ముగ్ధురాల్ని చేసింది. శ్రీ ఆనందకుమారస్వామి, ఆ నాట్యకర్త్రి లామెరీల మధ్య భారతీయ నాట్య సంప్రదాయంపై ఒకనాడు జరిగిన సంభాషణను న్యూయార్క్ రేడియో ప్రసారం చేసింది. శ్రీ కుమారస్వామి భార్య ఆ రికార్డును నాకు పంపింది. మీరు వింటారు కదా ఆ రికార్డును అని శ్రీ ఎన్. ఎస్. కృష్ణమూర్తి ఆ రికార్డు పెట్టారు. 7 నిమిషాలపాటు ఆ రికార్డు విన్నాము. కుమారస్వామి గొంతు వినగల్గాము. అయిదు

గురము లేచి శ్రీ ఆనందకుమారస్వామి చిత్రపటానికి శ్రద్ధాంజలి ఘటించాము అంతే అంతటితో సభ అయిపోయింది.

భారతీయులకు ఆనందకుమారస్వామి ప్రతిభ తెలియక పోయినా కళా సంస్కృతులతో ప్రమేయం ఉన్న ప్రతి ప్రపంచ రచయితకు ఆయన వంద్యులు ; ఆయన్ను గురించి చెప్పటానికి నా కెలాంటి అర్హత లేదు.

శ్రీ సంజీవ్ దేవ్ గారు ఆయన్ను గురించి వ్రాసిన ఈ నాలుగు మాటలు వినండి చాలు. విశ్వవిఖ్యాత శిల్ప మర్మజ్ఞులంతా శ్రీ ఆనందకుమారస్వామి చూపిన వెచ్చని వెల్గులో తమ తమ చలినీ, చీకటిని పోగొట్టుకున్నారు. ఆయన వచనాలు శిల్పజగత్తులో నిర్వచ నాలుగా నిలిచిపోయినవి. ఆయన బుద్ధిజ్యోతిర్మయం, ఆయన హృదయం రసమయం, ఆయన చేతలు చైతన్యమయం, ఆయన అనుభూతి ఆనందమయం, ఆయన సమీక్షలు సమత్వమయం, ఆయన జీవితం వీటన్నిటిమయం.

1910 లో కాబోలు కుమారస్వామి భారత దేశంలో సంచారం చేసి మారుమూలాలల్లో విస్మృతమైన భారతీయ ప్రాచీన శిల్పాలు, చిత్రాలు సేకరించారు. భారతీయులు కనుక కాశీలో కనుక ఒక మ్యూజియమును, చిత్రశాలను నిర్మించి ఇస్తే తన అమూల్య శిల్ప సంగ్రహాన్నంతా దానికి సమర్పిస్తానని ఆయన చెప్పారు. కానీ మన దేశ నాయకులెవ్వరు శ్రద్ధతీసుకో లేదు. చివరకు అమెరికాలోని బోస్టన్ మ్యూజియం వారు వీరు కోరిన మందిరాన్ని నిర్మించి ఆ శిల్పసముదాయాన్నంతా అక్కడ భద్రపరచుకున్నారు. కుమార స్వామి అక్కడ జీవిత పర్యంతము ఆ మ్యూజియం పరిశీలనాచార్యులుగా ఉండిపోయారు.

వివేకానందస్వామి విదేశాల్లో భారతీయ వేదాంతానికి ఎంత సేవచేశారో, ఆనందకుమారస్వామి విదేశాల్లో భారతీయ శిల్పానికి,

సంస్కృతికి అంతకుమించిన సేవ చేసారు. ఆయన్ను అంతసత్వరమే మనవాళ్ళు మర్చిపోవటం శోచనీయం. ఆయన వ్రాసిన వందలాది పుస్తకాల్లో కొన్నైనా మన స్వంత గ్రంథాలయాల్లో ఉంచుకుని అధ్యయనంచేసి బాగుపడే ఓపిక కూడ మనకు లేకపోవడాన్ని ఏమనాలి? ఆయనకీ జన్మదిన సంస్మరణ సభను యింత నిరాడంబరంగా ఏర్పాటుచేసిన శ్రీ ఎన్. ఎస్. కృష్ణమూర్తిని ఏమనాలి?

## వెంకటగిరి పుస్తక జీవసమాధి

ఇప్పుడుండే అతురాస్యునిపై ఉధృతంగా పుస్తకాలొచ్చి పడుతుండడంచేత అక్కడక్కడా చిన్నచిన్న ఇంటింటిగ్రంథాలయాలు వెలుస్తున్నాయి కాని పూర్వపురోజుల్లో ఊళ్ళకు ఊళ్లు వెతికినా మచ్చుకొక గ్రంథాలయమైనా ఉండేవికాదు.

పుస్తకాలు ప్రపంచాన్ని పరిపాలిస్తాయని ఒక లోకోక్తి. నిజానికి సుశిక్షితులైన పౌరులు తయారయ్యేది గ్రంథాలయాల్లోనే. దురదృష్టవశాత్తు మనం ఈ సత్యాన్నింకా గ్రహించలేకున్నాం. మన పుస్తకాలు బోలెడు విదేశీయుల దండయాత్రలో కొల్లగొట్టుకొని పోయి వాళ్ళవాళ్ళ దేశాల్లో భద్రపరచుకొన్నారు. బ్రిటన్‌లో, ఫ్రాన్స్‌లో, గ్రీస్‌లో, జర్మనీలో వగైరా అనేకచోట్ల మన తాటాకు పుస్తకాలు బోలెడు ఉన్నాయి. లండన్‌లో ఉన్న మన పుస్తకాల వ్యవహారం మనదేశానికి ఇంకా ఒక సమస్యగానే పీఠం వేసికొని కూర్చుంది.

ఇంతకూ ఈ ఉపోద్ఘాతం ఎందుకయ్యా అంటే మొన్న ఈ మధ్య హైద్రాబాద్ పండితమిత్రుడు ఒకాయన హఠాత్తుగా నెల్లూరులో దిగారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంవారు భారతం ఎడిట్ చేస్తున్నారు కదా! అందుకని దేశంలోఉన్న వివిధప్రతులు పరిశోధించేనిమిత్తమై వెంకటగిరి సంస్థానం లైబ్రరీలో ఏవైనా

దొరకుతాయేమోనని వచ్చారాయన. సరే వెంకటగిరి వెళ్ళొచ్చాక అడిగాను ఆయనను కళ్ళనీళ్ళు పెట్టుకొని చెప్పారు. "నాకు కావలసిన అనేక పుస్తకాలు అక్కడ లభ్యమయ్యాయి. కొన్ని అక్కడేవుండి గబగబా చదివి నోట్సు తీసికొన్నాను. ఐతే నా బాధ అంతా ఎక్కడంటే చాలా పుస్తకాలు చెదలుపట్టి శిథిలావస్థలో వున్నాయి. కొన్ని అప్పుడే పనికిరాకుండా పోయాయి. ఇంకొన్నాళ్ళు ఉంటే అసలు పూర్తిగా పనికిరాకుండా పోతాయి. ఈ దేశ దౌర్భాగ్యస్థితిని చూచి నా గుండె చెరువైపోయింది. వాటిని కాపాడే నాథుడిప్పుడు ఆ సంస్థానములో ఎవ్వరూ లేనట్టుగా ఉంది అని వాపోయాడు.

పూర్వకాలములో పూండ్ల రామకృష్ణయ్య (అప్పటి వెంకటగిరి రాజా ఆప్తులే అముద్రిత గ్రంథ చింతామణి ద్వారా నెల్లూరునుంచి అనేక అముద్రిత గ్రంథాలు వెలువరించారు.

కుమార్ రాజాగారూ విన్నారు కదా, ఆ పండిత మిత్రుని ఘోష. అట్లా నాశనం కావలసిందేనా. ఆ పుస్తకాలు బూజు, దుమ్ము చెదలు పట్టి, అట్లా మగ్గిపోవలసిందేనా? ఈ పుస్తకాలకు మోక్షం ప్రసాదించమని మాజీ కలెక్టర్ శ్రీ రాజగోపాల్ కుమార్ రాజాగారికి పలు ఉత్తరాలు రాసారట.

యువరాజ సోదరులకు నాదొక్కటే మనవి. ఎన్నేళ్ళనుండో నెల్లూరులో ప్రజల జ్ఞాన దాహాన్ని తీరుస్తున్న పురాతన గ్రంథాలయం "ప్రోగ్రెసివ్ యూనియన్" వారిది ఉంది. ఆ పుస్తకాలను బూజు దులిపించి ఇక్కడకు చేర్పిస్తే జ్ఞానదానం చేసినవాళ్లవుతారు.

మీరు రాజకీయాల్లో ఇప్పుడిప్పుడే ప్రవేశించారు. ప్రజా సమస్యలు అవగాహన చేసికొంటున్నారు. ఈ పని చేశారంటే నెల్లూరు సంగతులు ఏమో కాని నామటుకు నేను నాతోపాటు పలువురు పండిత మిత్రులు వీరికి శాశ్వతంగా ఋణపడి ఉంటాము.

ఈ సందర్భములోనే మరో విషయం జ్ఞాపకం వస్తున్నది. ఇటీవలి కాలంలో మన జిల్లాలో బాగా పుస్తకములు సేకరించిన వ్యక్తి కీ. శే. కవికోకిల దువ్వూరు రామిరెడ్డి. ఆయనకు పెద్ద గ్రంథాలయం ఉంది. పిన్నా రెడ్డిపాలెంలో కవికోకిల కుమారుడు వేణుగోపాలరెడ్డిగారు సాహిత్యంపట్ల గౌరవం ఉన్న వ్యక్తి కనుక తన తండ్రి సేకరించిన గ్రంథాలను చాలాభాగం "ప్రోగ్రసివ్ యూనియన్ లైబ్రరీ"కి ఇవ్వనున్నారు. కుమార్ రాజాగారూ: మీరూ ఈ పని ఎందుకు చేయకూడదు ?

## చరిత్రవేత్తలతో కలసి వెలుగొండ లోయల్లోకి

ప్రఖ్యాత చరిత్రకారులు ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ఆర్కియాలజీ డిప్యూటి డైరెక్టరుగా వుంటున్న డాక్టరు నేలటూరు వెంకటరమణయ్యపంతులు మొన్న నెల్లూరు వచ్చారు. ఈ మధ్య ఆ యన రాసిన ఒక లేఖ జమీన్ రైతులో చదివేయుంటారు. కనిగిరి తాలూకా వెలుగొండల్లో కనుమరుగై యున్న కళాక్షేత్రం వాల్లప్ప శిలలోని శిలాశిల్పాలు. శాసనాదులనుగూర్చి వెల్కపల్లి సుబ్రహ్మణ్యం శర్మగారు వ్రాసిన వ్యాసం చదివి అత్యంత కుతూహలాన్ని కనపర్చి ఆ శాసనాదుల్లో నిలిపిని పరిష్కరించి, యిందులో యిరుక్కొని ఉన్న వెలుగుచూడని చరిత్రాంశములను వెలికి తీసేందుకు డాక్టరు వెంకటరమణయ్యగారు ప్రధానంగా నెల్లూరు వచ్చారు.

అదే సమయానికి ఇంకో ప్రభుత్వ చరిత్రకారులు పురావస్తు శాస్త్రవేత్త అయిన నాగార్జునసాగర్ త్రవ్వకాలను జరిపించి అందలి అద్భుత కళాఖండములను వెలికితీసి యిప్పటి నాగార్జునకొండ మ్యూజియంకు ప్రాణప్రతిష్ఠ చేసిన డాక్టరు ఆర్. సుబ్రహ్మణ్యంగారు కూడా నెల్లూరులో ఉన్నారు. ఇంకేం యిద్దరు చరిత్రకారులు కలి

సారు. ఇక చెప్పాలా! మరో స్థానిక చరిత్రకారుడు శ్రీ ఎన్. ఎస్. క్రిష్ణమూర్తిగారు కూడా తోడైనారు. వీళ్ళంతా కలసి 'మల్లప్పశిల ఛలో' అన్నారు. వీళ్ళతో కలిసి 'లోకలిస్టు కూడా ఛెలో' అన్నాడు.

వీళ్ళంతా నెల్లూరువాళ్ళే. డాక్టరు వెంకటరమణయ్యగారిది ముత్తుకూరుదగ్గరి నేలటూరు గ్రామం. బహుకాలం మద్రాసు విశ్వ విద్యాలయంలో చరిత్ర అధ్యాపకులుగాయుండి రిటైర్ అయిన తరువాత కొంతకాలం ఆంధ్రప్రదేశ్ 'గెజిటర్స్' శాఖలో పనిచేసి చాలించుకొని, ఇప్పుడు ఆర్కియాలజీ డిప్యూటి డైరెక్టరుగా యుంటున్నారు. వయస్సు 70 సంవత్సరములు దాటినా పట్టుసడలని చరిత్రదృష్టి కలిగి మదరమాగిన పండితులు శ్రీ వెంకటరమణయ్య గారు. తెలుగు సాహిత్యాన్ని చరిత్రను జోడించి అసంఖ్యాకమైన వ్యాసాలెన్నో రాసారు. ఇటీవలనే వీరి వ్యాససంపుటి ఒకటి వెలువడినది. మరో సంపుటి ముద్రణలో యున్నది. ప్రస్తుతం ప్రభుత్వ ఆధ్వర్యంలో జిల్లాలువారీగ చారిత్రక శాసనాలు సంపుటాలను 'ఎడిట్'చేసే కృషిలో నిమగ్నులై ఉన్నారు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కాలధర్మం చెందిన తర్వాత మన మధ్యన ఉన్న అగ్రశేణి చరిత్రకారుల్లో శ్రీ వెంకటరమణయ్యగారు మొదట పేర్కొనదగ్గవారు.

ఇక ఆర్. సుబ్రహ్మణ్యంగారిది నెల్లూరు సమీపగ్రామం పల్లిపాడు'-చరిత్రలో డాక్టరేటుపట్టా ఉంది. పురావస్తు శాస్త్రంలో నిష్ణాతుడు. కేంద్ర పురావస్తుశాఖ బరోడా – ఆగ్రా – మద్రాసు ప్రాంతాల్లో ఉన్నతోద్యోగం నెరిపిన వ్యక్తి. హరప్పా మొహంజొదారలో పరిశోధనలు సల్పివచ్చిన పండితుడు. ముఖ్యముగా నాగార్జునసాగర్ త్రవ్వకాలలో ప్రముఖపాత్రను నిర్వహించిన అధికారి. ఈ నాగార్జునసాగర్‌లోని అమూల్య త్రవ్వకాల విషయమై సర్గీయ నెహ్రూని వప్పించి, ఆ త్రవ్వకాలను తమ ఆధ్వర్యములోనే నిర్వహించి నాగార్జునకొండ మ్యూజియం అవతర

నకు దృశ్యపాత్ర వహించిన వ్యక్తి డాక్టరు సుబ్రహ్మణ్యంగారు. ఈజిప్ట్ వారి అశ్వానిడామ్ త్రవ్వకాలు పర్యవేక్షణాధికారిగా పిలుపు వచ్చినా వ్యక్తిగతకారణాలవలన అక్కడకు వెళ్ళలేకపోయారు. ప్రస్తుతం ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తాత్కాలిక చరిత్రాచార్యులుగా యుంటున్నారు. వీరు రాసిన పుస్తకం - నాగార్జునసారముతో ముడిపడిన ఆంధ్రుల ఉజ్వలచరిత్ర; శాలివాహనుల, ఇక్ష్వాకుల - విష్ణుకుండినుల - నాగార్జునుడు (మద్యమమున) వగైరా తరతరాల చరిత్రాంశములపై వ్రాసిన బహుద్గ్రంథ రచన వీరు పూర్తిచేసి దాదాపు దశాబ్దం కావస్తున్నా అదింకా ప్రచురణ కాకుండా కేంద్రప్రభుత్వ పురావస్తుశాఖ ఫైళ్ళలోపడి మ్రగ్గిపోతూ ఉన్నది.

యథాలాపంగా యీ నెల్లూరు చరిత్రకారుల ప్రసక్తివచ్చింది కనుక ఇక్కడ ఒకమాట - అగ్రశ్రేణి చరిత్రకారులనే నెల్లూరు ప్రసాదించింది. తొట్టతొలుత పేర్కొనదగినవారు కీ॥ శే॥ K. రంగస్వామి సరస్వతిగారు, విజయనగర రాజ్యచరిత్రకు అమూల్యమైన ఆధారములను ప్రసాదించిన వ్యక్తి. మొదట నాగార్జునసాగర్ కళాఖండాల ప్రస్తావన తెచ్చి అక్కడ త్రవ్వకాలను జరిపించాలనే జాగృతిని కల్గించిన వ్యక్తి వీరే. తర్వాత పురావస్తు శాఖలోనే ఉన్నతోద్యోగం నెరిపిన కీ॥ శే॥ C. R. కృష్ణమాచార్యులుగారు కూడా నెల్లూరువారే. కీ॥ శే॥ ఒంగోలు వెంకటరంగయ్యగారు కూడా ఉన్నత శ్రేణి చరిత్రకారులుగా పేర్కొనదగినవారే. ఆచార్య మామిడిపూడి రంగయ్యగారు సరేసరి. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చరిత్రాచార్యులుగా ఇటీవలే ప్రమోషనైన ఓరుగంటి రామచంద్రయ్యగారు ఒకరున్నారు. వీలుచూచుకొని వీళ్ళను గూర్చి వరుసగా ఒక్కొక్క పరిచయ వ్యాసం వ్రాయాలనే కోర్కె బహుకాలంనుంచి "లోకలిష్టు"లో ఉన్నది.

ఈ కోర్కెలు, కోర్కెల సంగతి అటుంచి అసలు విషయము నకు వస్తాం. ఈ చరిత్రకారుని వెంట జీపులో దాదాపు 100 మైళ్లు ప్రయాణంచేసి కనిగిరి చేరుకొన్నాడు 'లోకలిస్టు'. కంభంపొమ్యూ రూటులో పదో మైలులోఉన్న తిమ్మారెడ్డి పల్లెదాకా మంచిరోడ్డే. అక్కడినుండి నానాతంటాలుపడి దారిడొంకలు వెతుక్కొంటా గొల్లపల్లి నందనవనం మీదుగా ఆనంద పురాగ్రహారం చేరికొనే సరికి రాత్రి 8 గం॥ అయినది. 'మల్లప్పశిల' వ్యాసకర్త తెల్కపల్లి వెంకటసుబ్రహ్మణ్యంగారిఇంట మా విడిది.

ఈ కడగొట్టుపల్లెలు చూస్తే గుండె చెఱువయినది. కీ॥ శే॥ నెల్లూరు వెంకటరామానాయుడుగారన్నట్లు "దారిడొంకలు లేని ముల్లున్నా, ఇవి దమ్మిడికి పనికిరావన్న"...అన్నట్లు అనేచరణం జ్ఞాప కానికొచ్చినది. రోడ్డమ్మట కనిగిరిదాకా పచ్చగా కనబడ్డ పొలం అనేది ఎక్కడా కనపల్లేదు. ఈ వందమైళ్లపొడవులో అంతా ఎండు ఎడారులు పర్చుకొనిఉంది. భూమి తామ దేవత పాలనబోయన్నట్లుగా ఏ వాగులోనూ నీటి చెమ్మ అనేది కనబడలేదు. ఈ సంవత్సరం ఈ జనం ఎట్లు బతకాలో ఈ వల్లకాటి సీమలో.

కనిగిరిదాటిన తర్వాత అక్కడక్కడ ఏదో పచ్చదనం ఉన్న పొలాలు. మెట్టబావుల క్రింద అవస్థలుపడుతూ నీళ్లు పారించుకొని ఎట్లనో బ్రతుకుతున్న ఈ గ్రామాలు ఎప్పటికి బాగుపడ్తారో! స్వాతంత్ర్యం వచ్చి సమితులు వెలసి ఏళ్ళు కావస్తున్నా ఈ గ్రామాలు గతి యింకా యిట్లానే ఉన్న దంటే ఏమనుకోవాలి! కరంటుతీగలు చూచే భాగ్యం యీ గ్రామాలకు ఎప్పుడు లభ్యం అవుతాయో! ఈ మెట్టబావుల బాధనుండి వీళ్ళకెప్పుడు విముక్తి కలుగుతోందో! ఇటీవల దాదాపు 20 లక్షలు ఖర్చుపెట్టి 2 ప్రాజె క్టులు నిర్మించినా వాటిక్రింద వంద ఎకరాలైనా సాగులోకి రాలేదు. బయటనుంచి వచ్చిన కంట్రాక్టర్లుమాత్రం బాగుపడ్డారు.

గుంటూరు జిల్లావాళ్ళు వచ్చి ఇక్కడి ఆ పొలాల్ని విపరీతంగా కొంటున్నారట పొగాకు సాగుకోసం. ఇక్కడి బీదవాళ్లే పొలాల్ని సాగు చేసుకోవాలంటే వీళ్ళదగ్గర పెట్టుబడేది పాపం ! ఒక విధంగాచూస్తే ఈ వెనుకబడిన తాలూకాలన్నీ కలసి కొత్త ఒంగోలుగా ఏర్పడటమే వీళ్ళకు బాగుంటుందేమోనని తోస్తుంది. ఈ మధ్య అమెరికన్ వాళ్ళు విమానాలమీద ఏరియల్ జియొలాజికల్ సర్వే జరిపారు. కనిగిరి, ఉదయగిరి, పొదిలి తాలుకాలపై కూడా ఈ సర్వే కొంతవరకు జరిగి నట్లుంది. ఇక్కడ ఏదైనా భూగర్భలోహాలున్నట్లు తెల్పితే అప్పుడే మైనా ఈ ప్రాంతం అభివృద్ధిచెందేదానికి అవకాశం ఉంటుందేమో వని ఇక్కడివారు కొనఊపిరితో ఆశగా ఎదురుచూస్తున్నారు.

ఇంత వెనుకబడిన ప్రాంతమైనా ఆమల్లప్పశిల వ్యాసకర్త శ్రీ టి. వి. ఎస్. శర్మగారు మా యీ బృందానికి చేసిన అతిథి మర్యాదలు మమ్మల్ని ముగ్ధుల్ని చేసాయి. ఎట్లనో తంటాలుపడి రాళ్లు రప్పలు దాటుకొని ఆ వెలుగొండల గుహాలలోనికి వెళ్లాము. ఆ లోయ దృశ్యం అద్భుతంగా ఉంది. అక్కడ లభ్యమైన కొన్ని ప్రాచీన శిలా శాసనాలు ఎస్టాంపేజ్ ప్రింట్స్ తీయించారు. శ్రీ వెంకటరమణయ్య గారు. ఆ శిలాశిల్పాలన్నిటికి ఫోటోలు కూడా తీయించారు. వీటన్నిటిని పరిశీలనచేసి అందలి చారిత్రకాంశములపై సమగ్ర సమాచారాన్ని త్వరలోనే పంపగలమని ఆ చరిత్రవేత్తలిద్దరూ ప్రామిస్ చేసారు. వీలైతే ఆ విషయాలను సచిత్రకంగా జమీన్‌రైతులో త్వరలోనే పాఠకులు చదువగలరు. ఈ ప్రాచీనచరిత్రకన్నా ఈ వెనుకబడిన పల్లెల వర్తమున దుర్భర జీవితచరిత్ర లోకలిప్తును ఇంకాహాంట్ చేస్తుంద. ఈ వల్లకాడువంటి సీమలో నిజమైన నిండైన జీవితం త్వర లోనే చిగిర్చగలదనే ఆశ మాత్రం ఏమీ లేకపోలేదు.

# ఆరుద్ర చెప్పిన విషయం

మొన్న జరిగిన జయంతి సందర్భంగా ఆరుద్రగారు నెల్లూరు వచ్చి వెళ్ళారు. 'లోకలిస్టు'తో యిష్టాగోష్టిగా మాట్లాడుతూ ఒక మాట అన్నారు—చిన్నయసూరి బాలవ్యాకరణానికి సమకాలికంగా నూరేళ్ళక్రితమే ఒక నెల్లూరు పండితుడు దాన్ని తలదన్నేట్లుగా యింకో వ్యాకరణం రాశాడట. నెల్లూరు ఫ్రీ చర్చి స్కూల్లో తెలుగు పండితుడుగా వుంటుండిన శ్రీనగరు ఆళ్వారుదాసు అనే ఆయన 1859 లో 'ఆంధ్ర వ్యాకరణ చంద్రిక'ను రాశాడట. నెల్లూరు కలక్టరేటు ప్రెస్‌లో అచ్చయిందట.

ఎన్నో నూతన వ్యాకరణ విషయాలు అందులో వున్నాయంటారు ఆరుద్ర. రావల్సినంత ప్రఖ్యాతిలోకి రాలేదంటారు కూడా. ఈ వ్యాకరణ గ్రంథాన్ని నెల్లూరు వర్ధమాన సమాజ గ్రంథాలయం నుండే తీసికెళ్ళి చదివారట ఆరుద్ర. నెల్లూరు లైబ్రరీలో యింతకాలంపాటు వున్నా ఈ గ్రంథాన్ని గురించి నెల్లూరు పండితులకు తెలియలేదంటే ఆశ్చర్యంగా వుంది.

నెల్లూరుజిల్లా కందుకూరు కవియైన కందుకూరు రుద్రకవిగారి జనార్ధనాష్టకాన్ని ఆరుద్రగారు సుదీర్ఘమైన పీఠికతో పాటు ఎడిట్ చేసిన గ్రంథాన్ని వి. ఎ. కె. రంగారావు ముద్రిస్తున్నారట. ఓరియంటల్ లైబ్రరీలో లభించిన మరి ఎనిమిది అముద్రితాష్టకాలు కూడా యిందులో వుంటాయట. త్వరలోనే ముద్రణ పూర్తి కాబోతున్నదన్నారు.

## మళయాళమహాచిత్రం "చెమ్మీన్" చూచివచ్చాక

'లోకలిస్టు' మొన్న మద్రాసు వెళ్ళినపుడు మళయాళ మహాచిత్రం "చెమ్మీన్" చూచి వచ్చాడు. అది చూచిన తరువాత జన్మతరించిందనుకొన్నాను. కేవలం అంతే కాదు నా తెలుగుదేశం మీద నాకే అసహ్యం వేసింది. ఎంత గొప్పచిత్రమది! ఈ సినిమా నిర్మాత ఈసా ఇస్మాయిల్ అని 25 ఏళ్లు అయినా నిండని యువకుడు. దర్శకుడు రామూకరియం అని సినిమా రంగంలో పెద్దప్రాభవమేమీ లేని వ్యక్తి. అట్లాటి తొలికారువాళ్లు ఒక ఈస్టమన్ కలరు సినిమా తీసారు. సెల్యులాయిడ్ తెరమీద ఒక మహాకావ్యంగా తీర్చిదిద్దారు. అది వాళ్ళ తొలిచిత్రమే అయినా అఖిల భారత స్థాయిలో గతసంవత్సరం వచ్చిన ఉత్తమోత్తమ చిత్రంగా ఎన్నికై రాష్ట్రపతి అవార్డును కూడా పొందింది.

వాళ్లు సినిమా తీయాలనుకొన్నప్పుడు కథకోసం వెతుక్కోలేదు. ఏ అరవం నుంచో, బెంగాలీనుంచో కథను దిగుమతి చేసుకోలేదు. వాళ్ళ మళయాళ భాషలో మహాప్రసిద్ధిగన్న "చెమ్మీన్" అనే నవలను తీయాలనుకున్నారు. తీసిచూపారు. చెమ్మీన్ అచ్చం కేరళ నవల. చేపలుపట్టి జీవించే జాలరుల జీవితాన్ని మనోజ్ఞంగా చిత్రించిన నవల. బెస్తవారికి సముద్రమే పెన్నిధి. ఆ సముద్రాన్నే ప్రసన్నురాలిగా చేసికొని జీవయాత్ర సాగించే బెస్తపల్లె–ఆ బెస్తపల్లెలోని పల్లీయులహృదయాలు–ఇవి ఆ నవలకు జీవం. ప్రాణం.

ఈ నవలను రచించింది శ్రీ తకళి శివశంకర్ పిళ్ళై అనే మళయాళ మహారచయిత. మన భారతీయ భాషలన్నింటిలోకి అనువదింపబడినది. కడకు మన తెలుగులో కూడా! అంతేకాదు ఇంగ్లీష్, జర్మన్, రష్యన్, ఫ్రెంచ్, ఇటాలియన్, స్పానిష్, పోలిష్ భాషల్లోకి అనువాదమై విశ్వవ్యాప్తమైన మహానవల. ఆ మధ్య యీ

నవల యొక్క రేడియో అనుసరణకూడా మన ఆలిండియా రేడియో వారు ప్రసారం చేసి పుణ్యం కట్టుకొన్నారు.

మళయాళంలో అంతటి మహానవల ఉండగా మరో అరువు తెచ్చుకున్న కథల నెందుకు ఎన్నుకోవాలో ఆ యువకులైన నిర్మాత దర్శకులకి బోధపడ్డలేదు. దాన్నే సినిమాగా తీయాలనుకొన్నారు. తీసారు. అఖిల భారతీయ స్థాయిలో మళయాళ సినిమా పతాకాన్ని ఎగురవేసారు. కేరళ సముద్రతీర శోభనంతా వెండి తెరమీద చూపి కేరళ సాంస్కృతిక గౌరవాన్ని వైభవాన్ని నిలబెట్టారు. మన తెలుగు 'మూగమనసులు' బ్రాండ్ సోదరులు గోదావరి తీరాన్ని ఔట్‌డోర్ షూటింగ్ అంతా జరిపించామని డబ్బా వాయించుకొన్నారు కానీ, ఆ నదీతీరశోభలో సహస్రాంశమునైనా వెండితెరమీదకు తీసికురాలేకపోయారు. మరి హిందీ 'మిలన్' లోనైనా ఆ ప్రయత్నం జరిగిందో లేదో తెలియదు.

ఇంతకూ ఈ 'చెమ్మీన్' ఎంతో మనోజ్ఞమైన చిత్రం. భారతీయ సినిమాకు స్థాయిని, గౌరవాన్ని సంపాదించి పెట్టే ఎంతో గొప్ప చిత్రం. స్థూలంగా ఈ సినిమా కథ ఇది :- 'కరుతమ్మ' ఒక ఆత్మాశ కలిగిన బెస్తవాడు 'చెంబన్‌కుంజు' యొక్క వలపులొలికించే వయసులో ఉన్న అందాల కూతురు. పారికుట్టి అనే చాపల వ్యాపారం చేసికొనే అమాయక ముస్లిం యువకుడు. వీళ్ళిద్దరి భగ్నప్రేమ- ఈ నవలకు కథావస్తువు.

కరుతమ్మ తండ్రి చెంబన్‌కుంజు జీవిత లక్ష్యమల్లా ఒక్కటే. ఒక స్వంత పడవను, వలను సంపాదించటమే. తన కూతురు ఆ ముస్లిం చేపల వ్యాపార యువకుడు పారికుట్టిల మధ్య ఉండే మానసిక సామీప్యతను చూచాయగా గ్రహించి కూడా పెద్దగా వారించడు. వీరిద్దరి మధ్యా సాన్నిహిత్యాన్ని వొక విధంగా ఎక్స్‌ప్లాయిట్ చేసికొని పారికుట్టి ధనసహాయముతో ఒక స్వంత పడవను కొనుగోలు కలుగుతాడు. ఆ పడవసాయంతో పట్టే చేపల్ని తనకు విక్ర

యించాలని కోరుతాడు పారికుట్టి. కరుతమ్మ తల్లిమాత్రం అతను ముస్లిం అని తెల్సికొని కరుతమ్మని గట్టిగా వారిస్తుంది. సముద్ర దేవత దాక్షిణ్యంతో బ్రతుకుతాము, తమ బెస్తజాతి ఆచార-వ్యవహారములు, సంప్రదాయాలు ఎగిరి బ్రతకమని గట్టిగా హెచ్చరిక చేస్తుంది. తమ ఆచారములకు సంప్రదాయములకు ఎంత శక్తి ఉందో గ్రహించిన కరుతమ్మ పారికుట్టిపట్ల తనకున్న ప్రేమను హద్దు మీరి పోనీకుండా అణచుకొని పెద్దలు నిర్ణయించిన యువకుని పెండ్లి చేసికొని వెళ్ళిపోతుంది. కానీ ఆ ముస్లిం యువకునిపట్ల తనకుండే ప్రేమను ఎక్స్ప్లాయిట్ చేసికొని తన తండ్రి పడవను కొనడం తను లోలోపల బాధపడిపోతుంది.

చెంబన్ కుంజు ఇప్పుడు తన స్వంత పడవ సహాయంతో చేపలు పట్టుకొని బాగా సంపాదిస్తాడు. అతనికి దురాశ పుడుతుంది. పడవ తెచ్చుకున్నప్పుడు ఎరతు ప్రకారం తాను పట్టే చేపలను పారికుట్టికి విక్రయించేందుకు వొప్పుకోడు. ఒకవైపు కరుతమ్మతో తన భగ్న ప్రేమ, మరోవైపు కరుతమ్మతండ్రి మోసంలో జీవితంపట్ల నిరాసక్తుడై పారికుట్టి వ్యాపారం దెబ్బతింటుంది.

కరుతమ్మమాత్రం ఆ ప్రక్క గ్రామంలో తన భర్త పనికి చేదోడువాదోడుగా ఉంటూ అతనికి తనను మనఃపూర్వకముగా అర్పించుకొని సంసారాన్ని నడుపుకొంటూ వస్తుంటుంది. ఒక బిడ్డను కూడా కంటుంది. కానీ పారికుట్టితో గల తనభార్య పూర్వ ప్రణయ వృత్తాంతం ఈ గ్రామానికి వ్యాపించి పళనిని చీకాకుపరుస్తుంది. పళనికి తన భార్యపై విశ్వాసము సడలకపోయినా ఇతర్లు అనుకొనే ప్రచారం విని ఒకనాడు సహనం కోల్పోయి ఆ కలిగిన బిడ్డ తనదేనా అని భార్యను గద్దిస్తాడు. కరుతమ్మ క్షోభించిపోయింది. తాను ఏ తప్పూ చేయలేదని వేడుకుంటుంది. పళని సంతృప్తిగా నిట్టూరుస్తాడు.

అక్కడ కరుతమ్మ తల్లి జబ్బుతో చచ్చిపోతుంది. తండ్రి రెండో పెండ్లి చేసికొంటాడు. సంసారం ఛిన్నాభిన్నమైపోతుంది.

ఒకానొక రాత్రి —చంద్రకాంతి – ఆ విరిసిన వెన్నెలలో సముద్రపు హోయలు పూర్వప్రేమికుడు పారికుట్టి సముద్రపు ఒడ్డునుంచి పాడా త్పలుపు. వారిద్దరి పరిష్వంగం–ఆదేక్షణాన సముద్రపు మధ్యన తన భర్త పళని ఒక పెద్ద సొరచేపతో ముదపు అరుపు...ఇన్నాళ్లు ఒక హద్దులో ఉండిన సంప్రదాయం భగ్నమైంది. సముద్రదేవత ఆగ్రహంతో పొంగిపోతుంది. పళని పెద్ద సుడిగుండంలో చిక్కుకుని పోతాడు. మరుసటిరోజు కరుత్తమ్మ, పారుకుట్టి శవాలు సముద్రపు ఇసుక తిన్నమీద ప్రక్కప్రక్కన పడిఉంటాయి. దూరంగా చచ్చి పడి ఉండే సొరచేప–చెమ్మీన్ అంటే మళయాళ అర్థం సొరచేప. పొడిపొడిగా చెప్పాలంటే ఇది ఆ నవలలోని స్థూలం కథ. కానీ సముద్రాన్నే గుడ్డిగా నమ్ముకుని జీవించే కేరళ సముద్రప్రాంత బెస్త పల్లీయుల జీవన సౌభాగ్యాన్ని సహస్రముఖాలుగా చిత్రించారు. వారి ఆచార వ్యవహారాలను, వారి ఆర్థిక, సామాజిక పోరాటాలను మనోజ్ఞంగా కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. ఆ నవలలో చిత్రించిన దంతా వీళ్ళ వెండితెరమీదకు కనులపండువగా తీసికొచ్చారు. ఒక కళానుభూతిలో కళ్లు చెమ్మగిల్లుతాయి. కేవలం ఒక సినేమాగా కాదు, ఒకరసప్రపంచంగా తీర్చిదిద్దారు. సాంతం చూచిన తర్వాత జోహార్లు సమర్పించకుండా ఉండలేం.

ఒక డ్యాన్సులేదు దిక్కుమాలిన ఛిందులు లేవు. రెండు మూడు పాటలు మాత్రమే ఉన్నాయి. సలీల్‌చౌధరిగారి అర్థ గాంభీర్యమైన సంగీతం చిత్రం చూస్తున్నంతసేపూ సముద్రప్రాంత పల్లీయుల పసివాడని జీవితం మన కళ్ళముందున్నట్లుంటుంది. అంతేకాదు, తమ భాషలోని అంతటి గొప్ప నవలలోని జీవితాన్నంతా వెండితెరమీదకు తోడితీసుకు రావాలనే ఆ నిర్మాత–దర్శకుల అమేయమైన చిత్తశుద్ధి ప్రతిభా పాటవం మనల్ని ఆకట్టుకొంటుంది. ఇక మార్కస్ బార్ట్లే ఫోటోగ్రఫీ అద్భుతంగా ఉంది. కేరళ సముద్రతీర సౌందర్యాన్నంతా మన కళ్ళముందు నిలుపుతాడు తన కెమెరాతో. సముద్రఘోషలన్ని

టని వినిపిస్తాడు. సినిమా అంటే సర్వకళల వైభవోన్నతి అని చాటి చెపుతుంది ఈ 'చెమ్మీన్'. మళయాళ భాష బొత్తిగా తెలియని నెల్లూరి వాణ్ణయినా కళ్ళప్పగించి చూచాను. ఈ చిత్రం చూచిన మహానుభూతిని మీతో తప్ప మరెవరితో పంచుకోగలను. ఇక ఈ చిత్రం చూచినతర్వాత నాలో చెలరేగిన చెదురు, మదురు భావాలంటారా? మరువం.

## హిమాలయములకు వెళ్ళాలి

హిమాలయములకు వెళ్ళిపోవాలనే కోర్కె నాలో అప్పుడప్పుడు కలవర పెడ్తూ ఉంటుంది. పోనీ చచ్చేలోగా హిమాలయాల్ని ఒకసారైనా చూస్తే బాగుండును. అనే కోర్కె నాలో రేకత్తింది. గతవారం వర్ధమాన సమాజం వారేర్పాటుచేసిన సభలో తమ హిమాలయాల యాత్రానుభవాలను గురించి ఆంధ్రుడు శ్రీ యశ్వంత సిన్హాగారి వుపన్యాసం విన్నతర్వాత.

గత సంవత్సరం త్రివేంద్రం ఆర్ట్‌గ్యాలరీలో (శ్రీ) రోరిక్‌గారి హిమాలయా వర్ణచిత్రాలు కొన్ని చూచాను. అవి ఇప్పటికీ అప్పుడప్పుడూ నిద్రలో కూడా నన్ను తట్టిలేపుతుంటాయి. అంతటి రసమయమైనవి ఆయన చిత్రాలు. ప్రఖ్యాత హిమాలయ చిత్రకారులు కీ. శే. నికోలస్ రోరిక్‌గారు వేలాది రంగుల చిత్రాలు గీసారు. దేశ దేశాలు నివాళులెత్తాయి ఆయన వర్ణనలకు. ఆ మహనీయుడు రష్యా వాడైనా హిమాలయాల్లో కాపురంచేసాడు. ఆయన చిత్రకళ ద్వారా హిమాలయాలకు అమరత్వం చేకూర్చారు. అమెరికాలో నేటికి ఆయన పేరుతో "రోరిక్ మ్యూజియం" అనే ఇరవై అంతస్తుల భవనం ఉన్నది.

హిమాలయాల్లో శ్రీ రోరిక్ కుటుంబముతో కొంతకాలం గడిపివచ్చిన ఆంధ్ర రచయిత, చిత్రకారులు, నాకు మిత్రప్రాయులూ అయిన శ్రీ సంజీవదేవ్ గారి ఉత్తరాలద్వారానూ ఆయన రచనల ద్వారాను, 'రసరేఖలు' అన్న పుస్తకం ద్వారానూ హిమాలయ ములు పరిచయమైనాయి. హిమాలయాలపై ఆయన రాసిన కొన్ని వ్యాసాలు నాలో స్వప్నాలు రచించాయి. ఆంధ్ర విశ్వవిద్యాల యంలో చదువుకునే రోజుల్లో నన్ను కలవరపర్చాయి. హిమాలయ ములు చూడకపోయినా యిట్లా దొరికినంతగా హిమాలయములపై వచ్చిన రచనలు చదువుతూ, చిత్రాలు చూస్తూ నా హిమాలయ పిపాసను తృప్తిపరుచుకుంటున్నాను. శ్రీ V. R. చిత్రాగారి హిమా లయ చిత్రాలు కొన్ని చూచాను. నిన్నగాక మొన్న శాసనసభ్యుడు శ్రీ G. C. కొండయ్యగారింటికి వెళ్ళినప్పుడు ఆయన లైబ్రరీలో — "Himalayan mountains of destiny - A study in geopolitics." అనే పుస్తకం కంటపడింది. ప్రస్తుతం ఆ పుస్తకపఠనంలో నేను ఉన్నాను.

జర్మనీభాషలో "ది సైకలాజికల్ యాస్పెక్ట్సు ఆఫ్ ఎర్లీ బుద్ధిజం" "సమ్ యాస్పెక్ట్సు ఆఫ్ స్తుపాసింబాలీజం." ఆర్ట్ అండ్ మెడిటేషన్." "డైమన్షన్సు ఆఫ్ కాన్షస్‌నెస్" అనే అనేకగ్రంథా లను, రచించిన శ్రీ లామా గోవింద చిత్రకారుడు కూడా ఆయన భార్య "లిగోతమి" కూడా చిత్రకారిణి. ఈ దపంతులిరువురూ ఆల్మోరాకు సమీపంలోని హిమాలయములలో నివాసమేర్పరుచుకొని సాంస్కృ తిక సాధనలో నిమగ్నమైయుంటున్నారు. వీరిద్దరూ మనోహరమైన వర్ణమార్గవంతో హిమాలయాల శోభకు జీవంపోసారు.

ఎక్కడో అమెరికాకు చెందిన చిత్రకారులు బ్రూస్టర్ దంప తులు హిమాలయాల్లో స్థిరనివాసమేర్పరుచుకొని తమ చిత్రాల ద్వారా హిమాలయ వాతావరణాన్ని, నీలారుగగనకాంతుల్ని, లోయల్లో కమ్మే పొగమంచునీ పాటల వర్ణపు పూతతో ఊగే

చర్రీచెట్లను, వంపులుతిరిగిన శైలమార్గాలను చూపుతూ హిమాలయ బహిరంగ శోభను ఎంతో కమనీయంగా సృష్టించారు.

స్వామి ప్రణవానందగారు ఆంగ్లములో రాసిన "కైలాస్ మానస సరోవర్" పోల్ బ్రంటన్ వ్రాసిన "ఎ హెర్మిట్ ఇన్ ది హిమాలయాస్" అనే పుస్తకాలలో హిమాలయాల్లోని రహస్యమయతను ఎంతో రమ్యంగా, ఎన్నో వివరాలతో ఆసక్తిజనకంగా గ్రంథీకరించారు.

ఇట్లాంటివి అడపా, దడపా చూచే భాగ్యానికి నోచుకొన్న వాణ్ని కనుక హిమాలయాలకు వెళ్ళిపోతే బాగుండిపోను. అని అనిపిస్తుటుంది అప్పుడప్పుడు. ఇంతవరకు సాధ్యపడలేదు. ఈ కోర్కెను మొన్నొక మిత్రునికి విన్నవించుకొంటే అతడు ఎంతో చులకనగా అన్నాడుకదా! "మిత్రమా నీవు చెప్పిన అట్లాంటి విశ్వప్రేమికజీవులకు, సాధకుల జ్ఞానతపస్సులకూ తరతరాలనుంచి జీవం పోసిన హిమాలయాలు ఇప్పుడు విపరీతమైన స్థితిలోయున్నాయి. ఆ మంచులో ఇప్పుడు రాజకీయాలు జొరవడ్డాయి. రోడ్లు నిర్మిస్తున్నారు. మంచును చెలిగేస్తున్నారు. నిన్న పేపర్లో చూళ్ళేదా కమ్యూనిష్టు చైనా టిబెట్‌నుంచి నేపాలుకు రోడ్డు నిర్మించడం దాదాపు పూర్తి అయిందట. రష్యావారు ఈ ప్రాంతములో వెయ్యిమైళ్లు పొడవున రోడ్డు నిర్మించడానికి నేపాల్‌తో ఒడంబడికలు కుదుర్చుకొన్నారట. జ్ఞాననేత్రాలు ప్రసరించిన ఈ "దేవభూమి"లో ఇప్పుడు ప్రపంచ రాజకీయనాయకుల కైపుచూపులు వడ్డాయి. హిమాలయాల్లో మారణఘోషలు వినిపిస్తున్నాయి. ఇంకో శతాబ్దంలోగా వీటి నైసర్గిక రేఖలో ఏవే పరిణామాలు కల్గుతాయో ఊహించడం కష్టం నీ వక్కడకు వెళ్ళి ఆగడబిడల్లో చిక్కుకోవడం ఎందుకు?" అన్నాడు మిత్రుడు.

1954 లో తన మానస సరోవర యాత్రానుభవాలను మనోహరమైన రీతిలో వివరిస్తూ శ్రీ యశ్వంత సిన్హా ఒక మాట

అన్నారు. ఆ మార్గమధ్యంలో అప్పటికే చైనీయుల "చెక్ పోస్ట్లు" కనిపించాయని, తనను తనతోటి యాత్రికులను చైనీయుల సిబ్బంది సోదా చేసిందని చెప్పారు. అయితే మీరీ విషయాన్ని దేశానికి ఇన్నాళ్లు ఎందుకు వివరించలేదయ్యా అని ప్రశ్నించాను. నేను చెప్ప డానికేమో చెప్పానండీ, ఆల్మోరాలో శ్రీ గోవిందవల్లభపంత్ అనుచరులకు. వారు – నీవు యాత్రికుడివి, నీకెందుకీ రాజకీయాలు, గమ్మునుండమని సలహా ఇచ్చారు. అవును నాకెందుకీ రాజకీయాలని గమ్మునుండిపోయాను," అని అన్నారు.

నేడు దేశం గాఢనిద్రలో ఉంది. నేను మాత్రం నిద్రలో కూడా కలవరిస్తుంటాను హిమాలయాలకు వెళ్లాలని. ఏవో! కనిపించని ప్రాపంచిక బంధాలు నన్ను కట్టిపడవేస్తున్నాయి. వీటిని తెంచుకో వడం సాధ్యంకాదు. భావ్యముకాదు. అయితే వీటిని కాస్సైనా సడలించుకొని హిమాలయములకు వెళ్ళి రావాలి ఎప్పటికైనా.

# నూరేళ్లనాటి నెల్లూరు సంగతులు

ఆశ్చర్యం, ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చెప్పగలరు? లేక పోతే ఈ క్రింద చెప్పే పుస్తకంలో యీ విషయాలుంటాయని ఎవరు అనుకోగలరు?

ఐ. టైరెల్ అనే బ్రిటీషాయన వ్రాసిన "From England to the Antipodes S-India 1846 to 1902 with starting revelations (or) 56 years of my life in the Indian mulmy police. S-jail. అనే పేరు కలిగిన దాదాపు 300 పేజీలు కలిగిన ఆంగ్లగ్రంథంలో ఎక్కడో మధ్య 50 పేజీల్లో నూరేళ్ళనాటి నెల్లూరు సంగతులు నిక్షిప్తమై వుంటాయని ఎవరు వూహించగలరు? నిజానికి ఎంతో ఆశక్తిని కల్గించే విధంగా ఎన్నో నెల్లూరు సంగతులు ఆయన అందులో వివరించి వున్నాడు. 60 ఏళ్ల క్రితం ఇది పుస్తకరూపంలో ప్రచురించినా (బహుశ రెండవ ముద్రణ కూడా పొందినట్లున్నది); నూరేళ్ళనాటి నెల్లూరి సమాజ చరిత్రను వేయి విధాలుగా వివరించియున్నా; ఎందువల్లనో ఈ గ్రంథం వెలుగులోకి రాలేదు. నెల్లూరు పండితుల దృష్టిలోకి కూడా వచ్చినట్లులేదు. ఏదో మా అదృష్టంకొద్దీ దీన్నిగూర్చి నేటి నెల్లూరువారికి పరిచయం చేసే భాగ్యం మా ఇద్దరికీ ఇన్నాళ్ళకు కల్గినట్లున్నది.

ఇక అసలు విషయానికి వస్తాం.

ఈ ఐ. టైరెల్ (I. Tyrel) అనే ఆయన 1860 అక్టోబరులో నెల్లూరు పోలీస్ రిజర్వ్ ఇన్స్పెక్టరుగా పనిచేయడానికి వచ్చారు. 1866 సంవత్సరం దాకా నెల్లూరుజిల్లా పోలీస్ శాఖలోనే ఉద్యోగం చేశాడు. దాదాపు 6 వ సంవత్సరంలో సేలంజైలు శాఖోద్యోగిగా బదిలీఅయి వెళ్ళాడు. ఈ ఆరేళ్ళకాలంలో నెల్లూరులో జరిగిన నానా

విషయాలను గూర్చి ఆయన ఎంతో సాగసైనరీతిలో గ్రంథీకరించి వున్నాడు. ఉదాహరణకు ఈ చిన్న కథ చదవండి :- 1862 ప్రాంతంలో నౌక ఫ్రెంచి నౌక నెల్లూరు దగ్గర మైపాడు సముద్ర తీరానికి కొట్టుకుని వచ్చింది. అప్పుడు మిస్టర్ హెచ్...అనే ఎందుకూ పనికిమాలిన నెల్లూరు పోలీస్ ఇన్‌స్పెక్టరునూ మరికొందరు పోలీసుల్ని కూడా సాయమిచ్చి ఆ నౌకలోని వారిని సామానును వొడ్డుకు చేర్చేయడానికి పంపారు. (ఈ మిస్టర్ హెచ్. అనే ఆయన పూర్తి పేరు వ్రాయలేదు. ఈయన ఎందుకూ పనికిమాలిన దద్దమ్మ ఇన్‌స్పెక్టరని మాత్రం సైరెల్ పేర్కొంటాడు ఈయన విషయం తర్వాత ఆరాతీసి చెప్పగలం.)

ఈ పోలీసు బలగం మైపాడుకు వెళ్ళారుకానీ, వీళ్ళల్లో ఎవరికీ ఫ్రెంచిభాష రాదు. ఆ నౌక కెప్టన్‌కు కానీ, ఆ ఇతర పరివారానికి గాని ఇంగ్లీషుభాష రాదు. సంభాషణ అంతా సైగలద్వారానే నడుస్తోండేది. ఎట్లయితేనేం కొన్నిరోజులు పట్టింది ఆ నావలోని సామానంతా వొడ్డుకుచేర్చడానికి. ఈ ఇన్‌స్పెక్టర్ హెచ్. ఆనౌక కమాండర్ బృందంతోనే కల్సిభోంచేసి గడుపుతూండేవాడు. ఒకే గుడారంలో ఆ వొడ్డునే సామాను ఒడ్డుకు చేర వేయడం పూర్తికాగానే ఆ పడవ వారి పరివారాన్ని నెల్లూరు రహదారి బంగళాకు తీసుకొచ్చారు. ఇక్కడినుంచి వీరిని ఇన్‌స్పెక్టర్ హెచ్...గారే వెంటబెట్టుకొని మద్రాసులోని మాస్టర్ అటెండెంటుకు అప్పగించాలి.

నెల్లూరు రాగానే ఆ పడవ కమాండర్ మిస్టర్ సింప్సన్ అనే నీలిమందు వ్యాపారిగారింట్లో దిగాడు. ఈ సింప్సన్‌కు ఫ్రెంచి భాష బాగా తెలుసునట. ఆ కమాండర్‌గారు ఈయనతో మొర పెట్టుకున్నాడు. ఆ సదరు ఇన్‌స్పెక్టర్ హెచ్... తమ పడవలోని చాలా విలువైన సామానును దొంగతనంగా ఇంటికి చేరవేసు కున్నాడని మిస్టర్ సింప్సన్ ఈ గొడవంతా విన్న తర్వాత నేరుగా వచ్చి అప్పుడు నెల్లూరు ఆక్టింగ్ కలెక్టరుగా వున్న ఇలియట్

గారితో విన్నవించుకున్నారు. అప్పుడు వెంటనే మద్రాసు పోలిస్ సూపరిండెంటుగారికి ఒక "టెలిగ్రాం" పంపబడింది. ఇన్‌స్పెక్టర్ హెచ్...ను మద్రాసు కో ఓబెన్ బేసిన్‌లోనే అరెస్టు చేయాల్సిందని ఈలోగానే; ఆ సైపాడుకు కొట్టుకువచ్చిన పడవను కాపలా కాసేం దుకు వెళ్ళిన పోలీసు బలగమంతా నెల్లూరుకు తిరిగివచ్చింది. కానిస్టే బుల్ షేక్ సులేమాన్ అనే ఆయన బహిరంగంగానే చెప్పడం ప్రారంభించాడు. ఆ పడవలోని అనేక విలువైన సామాన్లను ఇన్‌స్పె క్టర్ హెచ్...గుర్రాలమీద ఇంటికి రహస్యంగా చేరవేసుకున్నాడనీ అక్కడంతా ఆ ఫ్రెంచి పడవవారితో పెద్ద పెద్ద తగువుకూడా వేసు కున్నాడనీ బహిరంగంగానే చెప్పడం మొదలుపెట్టాడు.

కానిస్టేబుల్ ద్వారా ఇవన్నీ విన్నతర్వాత మన 'సైరెల్' గమ్మునుండలేక పోయాడు. నెల్లూరు పోలిస్ సూపరింటెండెంట్ గారితో ఈ విషయాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పగా ఆయన ఆ ఇన్‌స్పెక్టర్ హెచ్. ఇంటిచుట్టూ పోలీస్ కాపలా ఉంచాడు. లోపలికెవరన్నా పోనీయకుండా, ఇంటికి మరో తాళంవేసి సీలు చేశారు. ఇన్‌స్పెక్టర్ హెచ్‌ను మద్రాసు పోలీసులు అరెస్ట్‌చేసి నెల్లూరుకు తీసుకొచ్చారు. మన సైరెల్ ఆ ఇంటి దగ్గరే కాచుకూర్చున్నాడు. ఆయన రాగానే ఆ ఇంటికి సీలుచేసి ఉన్నారని చెప్పాడు. ఆయన్ను ఆ రాత్రికి అక్కడ్నే బంధించిపెట్టి తర్వాత రోజు ఉదయం ఇంటినంతా సోదా చేసి వెతికారు. ఆ పడవ తాలూకు సరుకులు చాలా కనపడ్డాయి. టవళ్ళు, ఫోర్కులు, స్పూన్లు ఇతర అనేక విలువైన సామాన్లు, కడకొక పిస్టల్ కూడ దొరికింది. వీటన్నిటిమీద ఆ ఫ్రెంచి పడవ ముద్ర "లెస్టన్ ఎబ్‌రెన్" అనే ముద్రవున్నది. దొంగ సులభంగా దొరికిపోయాడు. ఇంకా ఆ ఇల్లు సోదా చేయడంలో ఒకటిన్న అయిసుపెట్టెలో అప్పటి నెల్లూరు బాకు పెట్టుకునే నగలు, కొన్ని ప్రామిసరీనోట్లు కూడా దొరికాయి. తన ఇన్‌స్పెక్టర్ ఉద్యోగపు తాహాతుకు మించి కనబడ్డాయి. యీ నగలు నోట్లు అయితే ఈ

కేసు ఎంక్వాయిరీకి ఈ నగలకు సంబంధంలేదు కాబట్టి వాటిని వదిలే యాల్సి వచ్చింది.

అప్పట్లో పోలీస్ స్టేషన్ దగ్గర యూరోపియన్లు, జైలు సౌకర్య ములు సరిగా లేవు కాబట్టి ఈ ఇన్‌స్పెక్టర్ హెచ్ ... ను ఆ ఇంట్లోనే నిర్బంధంలో పెట్టి పోలీస్ బందోబస్తును ఉంచాల్సి వచ్చింది. జిల్లా మాజిస్ట్రేటుగారు కొన్నిరోజులపాటు విచారణ చేయాల్సి వచ్చింది. విచారణ పూర్తయి హైకోర్టుకు ట్రయల్‌కు వేశారు. అప్పుడు ఈ దొంగలింపబడిన సరుకులన్నీ కట్టగట్టి జిల్లా మాజిస్ట్రేట్ సమక్షంలో సీలుచేసి, ఒక హెడ్ కానిస్టేబులు ఆరు గురు పోలీస్‌ల వశంలో పెట్టి ఆ తర్వాత రోజూ ఉదయం ఈ సామానును ఆ ఇన్‌స్పెక్టర్‌ను మద్రాసుబండిమీద తీసుకువెళ్ళే యేర్పాటు చేశారు. [అప్పుడింకా నెల్లూరునుండి మద్రాసుకు రైలు మార్గం లేదు].

ఇన్‌స్పెక్టర్ హెచ్...ఆ ఇంట్లోనే నిర్బంధితుడై ఉన్నాడు. ఈ సీలుచేసిన సరుకు కూడా ఆ ఇంట్లోనే ఇంకో ప్రక్క వుంచి పోలీస్ సెంట్రీని పెట్టాడు జాగ్రత్తగా.

తర్వాత రోజు ఉదయం హైరల్‌లో దగ్గరకు ఒక పోలీస్ కాని స్టేబులు పరుగెత్తుకుంటూ వచ్చి - ఆ సీలుచేసిన సరుకు బండిల్ కన బడ్డంలేదు - అన్నాడు. హైరల్ పరిగెత్తుకుంటూ వెళ్ళాడు. కథ అడ్డం తిరిగిందే అని. ఇన్‌స్పెక్టర్ హెచ్ ... నిర్బంధింపబడిన గది లోనే అటు ఇటూ పచార్లు చేస్తున్నాడు మామూలుగానే. పోలీసు అంతా...గందరగోళంగా ఉన్నారు తమ కుతిక్కి ఎక్కడ తగులు కుంటుందోనని. హైరల్ వెంటనే జిల్లా మేజిస్ట్రేటుకు ఎస్. పి.కి తెలియచేశారు. రాత్రి జరిగిన గల్లంతు గూర్చి.

హైరెల్ కేమీ పాలుపోలేదు. పోలీసులందర్నీ దబాయించి అడిగాడు. రాత్రి పదిగంటలదాకా అందరూ చూచినట్లు వప్పు కున్నారు.

ఆ తర్వాత ఏమైందీ ఎవరూ సరిగ్గా చెప్పలేకపోయారు. ఒక పోలీసు మాత్రం యీ బండిపెట్టిన గదిలో అర్ధరాత్రప్పుడు ఏదో దెయ్యం వంటిది కనబడిందని గోణిగాడు. ఏమైతేనేం బయట వాడెవడూ చేసిన వ్యవహారంగా కనపళ్ళేదు. హైరెల్‌కు ఏమీ తోచక అటూ యిటూ పరిశీలిస్తూ పచార్లు చేస్తున్నాడు. ఆ ద్వారం గుండా సందులోకి వెళ్ళవచ్చు. ఆ సందు దారినే వెళ్ళితే ఆ ప్రాంగణంలోనే ఒక పాడుబడిన బావి ఉంది. ఇంకేం చటుక్కున స్ఫురించింది–ఈ బావిలో ఆ సరుకు మూటను పడవేసి ఉండాలని ఇనపగొలుసు గేలాలు తెచ్చి బావిలో లోడించాడు, హైరెల్ ఆశ్చర్యం! బండిల్ బయటపడ్డది. ఇంతలోనే ఎస్. పి జిల్లా మేజిస్ట్రేటు (కలక్టర్) వచ్చారు. పోలీసుల ముఖాల్లో జీవం కనపడింది. (ఈ పోలీసులు డిపార్టుమెంటల్‌గా తర్వాత శిక్షింపబడ్డారనుకోండి) ఎట్లయితేనేం గండం గడిచిందనిపించింది.

ఈ తడిసిన మూటను జిల్లా మేజిస్ట్రేటు కోర్టుకు పంపి, అక్కడొక రోజంతా ఆరబెట్టి మళ్ళీ భద్రంగా మూటగట్టి సీలుచేసి, పోలీసులకు భయం చెప్పి అన్ని పకడ్ బందీలు చేసి ఈ మూటను ఆ ఇన్‌స్పెక్టర్ హెచ్‌ను మద్రాసుకు చేర్చారు బండిమీద. ఇన్‌స్పెక్టర్ హెచ్‌ను మద్రాసు సెంట్రల్ జైల్లో వుంచారు.

హైకోర్టులో ట్రయల్ ప్రారంభమైంది. ప్రారంభమైన ముందురోజే ఒక వదంతి పొక్కింది – ఈ కేసు తప్పక తేలిపోతుందనీ ఎందుకనయ్యా అంటే ... ఈ ఇన్‌స్పెక్టర్ హెచ్...బంధువు జాన్ అనే ఆయన "జ్యూరీ"లో వొకడుగా వుంటాడని అతను ఎట్లనైనా ఈ కేసును కొట్టేయించడానికి ప్రయత్నించి తీర్తాడని లీలగా ఒక వదంతి పొక్కింది. ఆశ్చర్యం! కేసు కొట్టేయబడింది! ఆ జాన్‌గారే ఒక 'జ్యూరీ'గా వచ్చాడు! [ఈ జ్యూరీ! నియామకం తర్వాత రద్దు చేయబడింది. ఆ రోజుల్లో మరి ఎందువల్లనో వుంటుండేది, ఇప్పటికీ కొన్ని పాశ్చాత్యదేశాల్లో ఈ విధానమే

వుంది మరి! న్యాయమంటే ఇట్లానే ఉంటుంది! చావు తప్పి కన్ను లొట్టబోయిన ఇన్‌స్పెక్టర్ హెచ్ ... గారు మళ్ళీ నెల్లూరుకు వచ్చారు దర్జాగా. రెండునెల్ల తరువాత అతను బలవంతంగా రిటైర్ కావల్సి వచ్చిందనుకోండి.

ఇదీ ఒక కథ. నూరేళ్ళనాటి కథ. నూరేళ్ళ నాటిదైనా నిన్న నేటిదిలాగానే వుంది కదూ!

*　　　*　　　*

ఇంకొక అత్యంత ఆసక్తికరమైన విషయం కూడా చదవండి మన హైర్‌రెల్ నెల్లూరు రిజర్వు పోలీస్ ఇనస్పెక్టర్‌గా మూడు నాలుగేళ్ళు పనిచేసిన తరువాత వెంకటగిరి సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా బదిలీ చేయబడ్డాడు. అక్కడ జరిగిన ఒక చిన్న సంఘటన వెనుక వుండిన ఒక బ్రహ్మాండమైన వ్యక్తి జీవిత చరిత్ర చూడండి.

ఒకరోజు ఒక ఆడమనిషి చెరువులోపడి చనిపోయిందనే వార్త తెలిసింది. వెంకటగిరి స్టేషన్ ఇన్‌స్పెక్టర్ సమయానికి టౌన్‌లో లేనందువల్ల ఈ కేసును గూర్చి దర్యాప్తుచేసే భారం హైర్‌రెల్ మీాదే పడింది. ఆ ఆడమనిషి శవాన్ని చెరువులోనుండి బయటకు తీశారు. ఆ చెరువుగట్టుకు అత్యంత సమీపంలోనే ఆమె ఒక గుడిసెలో నివసిస్తుండేదట.

ఆ శవం చూడగానే - ఆ స్త్రీ మంచిరూపసి అనీ, నవ నవ లాడే యవ్వనంలో వున్నదనీ, వయస్సు 20-22 ఏళ్ళకుమించి ఉండదనీ అర్థమైంది. విచారణలో తెలిసిందేమిటంటే ఆమె ఎందుకనో ఆ చెరువులోపడి ఆత్మహత్య చేసికొని ప్రాణాలు వదిలిందని అర్థమైంది.

ఎవరు ఆమె? - అనే ప్రశ్నకు సమాధానం వినగానే హైర్‌రెల్ నిర్ఘాంతపోయాడు. ఈమె ఫలానా ఆయనగారి భార్య అనీ ఆయన ఆ సమయంలో ఇంగ్లాండులో పర్యటిస్తున్నాడని తెల్సుకోగానే!

ఆయన పేరు ఫలానా అని శ్రైరెల్ తన గ్రంథంలో పేర్కొనలేదు. పేరు వ్రాయకుండా చుక్కలు పెట్టాడు. ఆయన భారతీయ ప్రతినిధిగా ఎవరి వెంటనో వంట మనిషిగా వెళ్ళి ఇంగ్లాండులో పర్యటిస్తూ, విప్లవ ప్రసంగాలు చేస్తూ, యూరోపియన్ల కింద భారతీయులు నుగ్గిపోతున్నారనే విధంగా విప్లవోపన్యాసాలు చేస్తూ ఒక పెద్ద అలజడిని సృష్టించిన వ్యక్తి అట. నెల్లూరు సెషన్స్ కోర్టులో హెడ్ క్లర్కుగా కొంత కాలం పనిచేసి, న్యాయశాస్త్రంలో ప్రావీణ్యం సంపాదించి ఆంగ్లంలో అనర్గళంగా ప్రసంగించే వ్యక్తిగా రూపొందినవాడట. ఇతని అక్కడి ప్రసంగాలు అప్పటి ఆంగ్ల పత్రికలో వస్తే తను చదువుతుండేవాడనని కూడా శ్రైరెల్ పేర్కొన్నాడు. ఏమైతేనేం ఇట్లా యాదృచ్ఛికంగా అట్లాంటి అపురూపమైన వ్యక్తి జీవితంతో పరిచయం కల్గుతుంది. యీ పోలీస్ ఆఫీసరు శ్రైరెల్ కు! ఇంగ్లీషు ఆఫీసరై ఉండి అంతటితో గమ్మునుండిపోతాడా!

ఇతన్ని గూర్చి ఆరా తీశాడు. వెంకటగిరి, కాళహస్తి రాజాలతోనే గాకుండ, మద్రాసు రాష్ట్రంలో ప్రారంభంగా వుండిన వ్యక్తులతో మంతనాలు జరుపుతూ అప్పటి ఆంగ్ల ప్రభుత్వానికి వ్యతిరేకంగా బెంగాలులో సాగుతుండిన సిపాయిల తిరుగుబాటు బీజాలను వ్యాప్తిచేస్తూ వీరోచిత కృత్యాల్లో నిమగ్నుడై వుండే వాడనే విషయాన్ని ఆరా తీశాడు శ్రైరెల్. అంతే కాదు; నెల్లూరు సముద్ర తీరాల్లో ఈ విప్లవోద్యమ వీరులు రహస్యంగా నావల మీద ప్రయాణంచేసి వెంకటగిరి వగైరా ప్రాంతాల్లో ప్రచారం చేసి ఈ విప్లవోద్యమ జండాను రెపరెపలాడించాలని ప్రయత్నాలు, పథకాలు కొనసాగినట్లు కూడా ఆరా తీశాడు శ్రైరెల్. ఈ రాజాలు, యితర ప్రముఖులు అప్పుడు ఈ ఉద్యమకారులకు సహకారమంటూ యిచ్చి వుండి వుంటే దక్షిణభారతమే తీన్ తార్లై బ్రిటిష్ వారినుండి ఎప్పుడో విడివడి ఉండేదేమోనని కూడా అంటారు శ్రైరెల్. ఎందుకంటే అప్పుడు ఈ ప్రాంతంలో బ్రిటిష్ సాయుధ దళాలన్నీ కూడా బెంగాల్ కు

తరలించబడ్డాయికదా. ఆ "సిపాయిల తిరుగుబాటు"ను అణచడానికి! ఇదంతా ఆరా తీసేసరికి మైర్రెల్ గుండె గుభేల్ అని వుంటుంది. ఈ వెంకటగిరి టెర్రరిస్ట్ వీరుణ్ణి గూర్చి స్వవివరాలు సేకరించి ఎస్. పి. కి ఇన్‌స్పెక్టర్ జనరల్‌కు మైరల్ వెంటనే అందజేసి ఉంటాడు. ఉంటా డేమిటి అందజేసాడు!

ఈలోగా ఏమి జరిగిందో ఏమోగాని మూడేళ్ళతర్వాత మైర్రల్ మద్రాసు సెంట్రల్ జైలుకు బదిలీ అయి పనిచేస్తుంటే చీఫ్ సెక్రటరీ నుండి ఒక సీల్డు కవరు వచ్చిందట. అందులో ఏమున్న దయ్యా అంటే ఫలానా రోజు షిప్‌లో యీ ఫలానా వెంకటగిరి విప్లవవీరుడూ మద్రాసు హార్బర్‌లో దిగుతాడు. నీ వెళ్ళి అతన్ని అరెస్టుచేసి డిటెన్షలో వుంచాల్సింది అని మాత్రం వుంది! మైర్రల్ అతన్ని అరెస్టుచేసి తీసుకొచ్చి మద్రాసు సెంట్రల్ జైలులో వుంచా డట. కొద్దిరోజులు కాగానే తిరుచునాపల్లి జైలుకు మార్చబడి ఈ వెంకటగిరి వీరుడూ అందులోనే ప్రాణాలు వదిలాడట.

వెంకటగిరిలో నూరేళ్ళ క్రిందట ఇంతటి విప్లవవీరుడు; ఇంతటి విప్లవోద్యమం ప్రభవించిన వంటే ఆశ్చర్యంగానే వుంది. దురదృష్ట వశాత్తు ఇవి మన చరిత్రకే ఎక్కలేదు! ఇతన్ని గూర్చిన సర్వ వివ రాలూ సేకరించడమే ఆ విప్లవ మూర్తికి జోహార్లు అర్పించడం అవు తుంది.

ఇదీ మైర్రల్‌గారి ఆంగ్ల గ్రంథంలో మనకు దర్శనమిచ్చే ఆ అనామక వెంకటగిరి విప్లవవీరుని అద్భుత చరిత్ర మూలకథ. ఈ సంక్షిప్త అధ్యాయంలో ఇంతటి అద్భుత వీరయోధుని గాథ— దక్షిణ భారతదేశంలో చరిత్ర కెక్కకుండా కొనసాగిన స్వాతంత్ర్య పోరాట కథనం ఇమిడి ఉంది మరి! నమ్మశక్యం కానిదేముంది ఇందులో?

ఎవరీ నెల్లూరు మండలపు అద్భుతవ్యక్తి? అతని పేరేమిటి? అతను లేవనెత్తిన ఆమహోద్యమపు పూర్వాపరాలేమిటి? అనేవి సహజంగా మనలో ఆశక్తిని రేకెత్తించే అంశాలు.

బం. గో. రె మొన్న మద్రాసు వెళ్ళినప్పుడు తన శక్తివంచన లేకుండా ఆరా తీశాడు. ముందుగా మద్రాసు సెంట్రల్ జైలు సూపరింటెండెంట్ శ్రీ భగవతిమురుగన్ గార్ని కల్సుకొని అడిగాడు. పాపం, అత నెంతో సానుభూతిని, ఆశక్తిని ప్రదర్శించాడు కాని ఒక మాట అన్నాడు. 1920-30 ప్రాంతాల్లోని రాజకీయ బాధితుల జైలు ఖైదీ వివరాలే మేము సరిగా అందివ్వలేకున్నాము. అట్లాంటిది నూరేళ్ళనాటి రికార్డు మా దగ్గర వుంటుందా అనే అనుమానాన్ని వ్యక్తంచేసి - అయినా ఏదో ఒక పథకం సూచించి ఆ మార్గంలో ప్రయత్నించమన్నాడు. చూద్దాం. ఆ ప్రకారంగానైనా మనకీ వివరాలు అందుతాయో లేదో యిప్పుడే యెట్లా చెప్పగలం?

బంగోరె అంతటితో వదల్లేదు - మద్రాసు రికార్డు ఆఫీసులో గాలించాడు - కుప్పతిప్పలుగా పడివున్న వందల యేళ్ళనాటి ఆ పురాతన రికార్డుల్లో యెక్కడని దొరుకుతాయి యీ వెంకటగిరి విప్లవవీరుని వివరాలు? ఇండెక్సు క్యాటలాగే వాల్యూములు వాల్యూములుగా వున్నాయి. కళ్ళకు వత్తులు పెట్టుకొని వెతుకుతూ ఉంటే ఎక్కడో ఒకచోట స్టేట్ ప్రిజనర్ల జాబితాలు అని సంవత్సరాలవారిగా కనబడ్డది. మనవాడు కూడా స్టేట్ ప్రిజనర్ గా ఉండినాడు కనుక ఈ జాబితాల్ని వెతికితే కనపడవచ్చునని తోచింది. 1869, 1868, 1867 సంవత్సరాల జాబితాలు తెమ్మనగా 1867, 68 సంవత్సరాలవి మాత్రం ఇచ్చారు. 1869 సంవత్సరం రికార్డు మరీ పాతదై చినిగి ఉంది గనుక బాగు చేయించి తర్వాత యిస్తామన్నారు. 1867 లో లేదు; 1868 లో మాత్రం వేరే ఒక నెల్లూరాయన 'స్టేట్ ప్రిజనర్'గా ఉన్నట్లు దాఖలా కనబడ్డది. ఉదయగిరి మాజీ జాగీర్దార్ కుమారుడు సయ్యద్ మహమ్మద్ గౌస్ ఖాన్ ఏదో రాజ

ద్రోహం నేరంపై జైల్లో వుండినట్లు మాత్రం వున్నది అంతే. 1869 రికార్డు ఏదో అతికించి బాగుచేసి రెండోరోజు ఇచ్చారు. ఆశ్చర్యం! వొట్టి కవరింగ్ లెటర్ మాత్రం అందులో వుంది కాని, ఆ జైలర్ల జాబితా మాత్రం దానికి జత చేయబడలేదు అది ఎక్కడ పడి పోయిందో ఎంత దురదృష్టం!

1860 అక్టోబరులో నెల్లూరు రిజర్వుపోలీస్ ఇన్‌స్పెక్టరుగా వచ్చిన పైర్రల్ 1865 ప్రాంతాల్లో వెంకటగిరి డివిజన్ ఇన్‌స్పెక్టరుగా బదిలీ అయి 1866 సేలం జైలు శాఖకు వెళ్ళిపోతాడు. వెంకటగిరిలో ఉన్నదానికి మూడేళ్ళ తర్వాతే అన్నాడు గాబట్టి, యే 1869-70 ప్రాంతంలో గాని మన వెంకటగిరి వీరుడు విదేశ పర్యటన ముగించుకుని మద్రాసుకు రాగానే అరెస్టు చేయబడ్డాడని వుల్లేఖించబడి వుంది గాబట్టి రాగాని 1869-70లో వెతికితే బహుశా మనవాడి చరిత్ర బయటపడుతుందేమో. అప్పటికే మూడురోజులైంది. ఓపిక నశించింది. అదీగాక నిత్యనైమిత్తిక వార్తాపరిధిలో తిరగవల్సిన వాడు ఎంత కాలమని దీనికోసం ఆరా తీస్తూ వుండగలడు? అందుకనే మద్రాసుకు తాత్కాలికంగా గుడ్‌బై చెప్పి వచ్చేయవల్సి వచ్చింది. ఏమైనా ఒక ఆశ 1869-70 సంవత్సరపు రికార్డుల్లో వెతికితే బహుశ అసలు వివరం బయటపడవచ్చునని తోస్తుంది. అంతేగాక వొక్క "పోలిస్ ఆఫర్స్" అనే శీర్షిక క్రింద గాకుండా "హోమ్‌శాఖ" "రాజకీయ విభాగం" వగైరా రికార్డులు గాలిస్తే కొన్ని వివరాలు దొరకవచ్చునని పిస్తుంది. బహుశా ఈ సదవకాశం మళ్ళీ త్వరలోనే లభించవచ్చునని ఆశిస్తున్నాం.

ఏమైనా ఈ వెంకటగిరి మహావ్యక్తి తాలూకు అస్తికలు మాత్రమే మన కింతవరకు దొరికినవి. దొరకవల్సింది శోధించవల్సింది అంతా ముందే వున్నది. Flesh, blood and the very life — రక్తమాంసం అసలు జీవితం అంతా ముందే దొరకవల్సి వున్నది.

ఒకటిమాత్రం నిజం. మనం చరిత్రలో చదువుకునే పాఠం 1857 లో సిపాయిల తిరుగుబాటు బెంగాలులో ప్రారంభమై ఢిల్లీ దాకా పాకిందని! అదే భారతీయ తొలి స్వాతంత్ర్య పోరాటమని మాత్రమే దానికి శాస్త్ర దరిదాపులుగా నెల్లూరులో కూడ ఒక పెద్ద తిరుగుబాటు వుద్యమం లేవనెత్తిన ఒక వెంకటగిరి వీరు డున్నాడు- అని మైత్రెల్ వుల్లేఖించిన ఘట్టం మనకు విశదపరుస్తున్నది. ఏదో నెల్లూరు ప్రాంతంలో లార్డు బెంటింగు కాలంలో ఏదో తిరుగుబాటు ఛాయలు కొన్ని తలెత్తినవని ఇటీవల ఒక పరిశోధకుడు కొన్ని అంశాలు వెలుగులోకి తెచ్చాడని వింటున్నాము. ఇప్పుడు యివన్నీ కలిపి చదువుకోవల్సిన అవసరం ఏర్పడుతుందేమో.

## నెల్లూరులో అన్నా చెల్లెళ్ళ హత్య: కేసు త్రోసివేత జడ్జిపై అనుమానాలు

అప్పటి నెల్లూరుజిల్లా కలెక్టరు జేమ్సు విలియమ్ బాలెండైన్ డెన్సుగారు వొక ఆదివారం ఉదయం పూట స్వయంగా పోలీసు ఆఫీసు కొచ్చి నెల్లూరు టౌన్ లో జరిగిన హత్యోదంతం గురించి చెప్పారు. రోడ్డు పక్కగా పడివుండిన యువతీ యువకుల శవాలను తన స్వంత కళ్ళతో చూశానని, ఎవరో విషంపెట్టి చంపి ఉండవచ్చునని చెప్పారు. పోలీసు సూపరింటెండెంట్ కాని, ఇన్స్పెక్టరుగాని టౌన్ లో లేరు, యిద్దరూ క్యాంప్ వెళ్ళి వున్నారు. దీని విషయమై దర్యాప్తు జరిపే పని మైరల్ మీద పడింది.

యువతీ యువకుల శవాలనగానే వాళ్ళిద్దరూ ఏదో భార్యాభర్తలనో లేక రహస్య ప్రేమికులనో వూహించుకోవచ్చు. కానీ కాదు, నిజానికి వాళ్ళిద్దరూ సొంత అన్నాచెల్లెళ్లు; గొర్రెలు కాసుకునే వంశంలో పుట్టినవాళ్ళు. అప్పటి నెల్లూరు హెడ్ క్వార్టర్సు హాస్పిటల్లో ప్యూన్ గా వుండిన సుబ్బారెడ్డి అనే ఆయన ఈ చెల్లెలితో

రహస్య సంబంధం నెరుపుతుండేవాడట. ఇతను విషం కలిపి తెచ్చిచ్చిన కేకులు తిని పిల్లిద్దరూ చచ్చారు పాపం.

ఈ అన్నాచెల్లెళ్ళ తల్లి చెప్పిన కథనం ఇది–ఆ క్రితంరోజు సాయంత్రం సదరు సుబ్బారెడ్డి కొన్ని కేకులు తెచ్చిచ్చాడట, ఆ కేకుల్ని యీ అన్నాచెల్లెళ్ళిద్దరూ తినగా రాత్రంతా నానాబాధ పడిపోయి కొట్టకలాడిగింజుకొని చచ్చారట. ఆ సాయంత్రం పూట వాళ్ళింటికి యింకొకతను కూడ వచ్చి వుండివున్నాడట సుబ్బయ్య అనే బంగారుపని చేసుకొనే విశ్వబ్రాహ్మణ యువకుడు. ఈ సుబ్బయ్య ఆ సుబ్బారెడ్డికి కాంపిటీషన్‌గా ఆ అమ్మాయితో రహస్య ప్రేమాయణం సాగిస్తుండేవాడు. సదరు సుబ్బారెడ్డి కేకులు తెచ్చినప్పుడు యీ సుబ్బయ్యకూడా అక్కడికి వచ్చాడు. కేకులైతే తెచ్చావుగానీ, చక్కెర లేకుండా వొట్టి కేకులు తినేదెట్లా? చక్కెర తీసుకొస్తా నుండు–'' అని తాను వీధిలోకి వెళ్ళాడట. ఆ వెళ్ళినాయన అరగంట తర్వాత కాని మళ్ళీ తిరిగి రాలేదట. ఆ తర్వాత కాబోలు అన్నా చెల్లెళ్ళిద్దరూ ఆ కేకుల్ని తిని చచ్చినట్లున్నది.

పైరల్ దర్యాప్తులో తేలిన అంశాలు యివి. విషాహారం వల్లనే చనిపోయివుండాలని తీర్మానించుకొని; వాళ్లు తినగా మిగిలి పోయిన ఆ కేకుముక్కల్ని, ఆ శవాల్ని జిల్లా సర్జను వైద్యపరీక్షకు పంపగా పోస్టుమార్టంలో తేలిందేమిటంటే పాషాణం (Arsenic) కల్సిన ఆహారం తిన్నందువల్లనే యీ చావులు జరిగాయి – అని తేల్చి చెప్పడం జరిగింది. వాళ్ళ పొట్టలుకోసి మద్రాసు ప్రభుత్వ 'కెమికల్ అనలిస్టు'కు కూడా పంపడం జరిగింది.

సుబ్బారెడ్డి ఇంటిని సోదాచేయగా బండారం బయటపడి పోయింది. హాస్పిటల్‌నుండి దొంగతనంగా తెచ్చిపెట్టుకున్న కట్టల కట్టల మందులు కనపడ్డాయి – అందులో ఈ పాషాణం కూడా దొరికింది. (అప్పటినుండే వుందా యీ జాడ్యం – హాస్పిటల్ మందులు దొంగతనంగా యిళ్ళకు తెచ్చుకొని అమ్ముకోవడం!)

హైరల్ కడకు సుబ్బారెడ్డి సుబ్బయ్యలనిద్దర్నీ అరెస్టుచేసి తాన్ సబ్ మేజిస్ట్రేట్ ముందర చార్జిషీటు పెట్టడం జరిగింది. ఈ తాన్ సబ్ మేజిస్ట్రేట్ బ్రాహ్మణాయనట. ఆయనగారు ఈ కేసు నిర్వహించిన తీరు అనుమానాలకు దారితీసే విధంగా ఉండినదంటాడు హైరల్. నానబెట్టి, నానబెట్టి వాయిదాలు వేసి; ఆ బంగారుపని చేసుకునే సుబ్బయ్యపై నేరం ఋజువుకా లేదని విడుదలచేసి, వొక్క—సుబ్బారెడ్డి మీదనే నేరంమోపి, కేసును సెషన్సు కోర్టుకు పంపాడు.

కడకు ఈ కేసు జడ్జికోర్టులో విచారణకు వచ్చింది. హైరల్ సాక్ష్యం చెప్పాడు. సుబ్బయ్యను ఎందుకు వదిలివేయవలసి వచ్చింది; నిజమైన నేరస్థుడు అతనే ఐవుండవచ్చు కదా—అని జడ్జీ అడిగాడు. హైరల్ జరిగింది చెప్పాడు. ఇదంతా సబ్ జడ్జిగారు చేసింది, నా సలహాను కూడ త్రోసిపుచ్చి ఆయన ఈ పనిచేశాడు—అని హైరల్ మొత్తుకున్నాడు. జడ్జికడకు కేసును త్రోసివేస్తూ, సుబ్బారెడ్డిని విడుదలచేస్తు తీర్పు చెప్పాడు. అన్ని ఋజువులున్నా నేరం కడకు త్రోసివేయబడినందుకు అందరికీ ఆశ్చర్యం కల్గిందంటాడు హైరల్.

ఈ తాన్ మేజిస్ట్రేట్‌గారి అనుమానాస్పదమైన శీలంపై హైరల్ పెద్ద రిపోర్టువ్రాసి పోలీసు సూపరింటెండెంట్‌కు పంపాడు; అంతేకాదు జడ్జీగారిపై కూడా యింకోముక్క తగిలించాడు – ఒక క్రైస్తవ మిషనరీ పెద్దమనిషి జడ్జీతో అత్యంత సన్నిహితంగా వుంటుండేవాడు. జడ్జిగారింట్లో కూడా అతను స్నేహంగా, చనువుగా తిరిగేవాడని; ఆ క్రైస్తవ పెద్దమనిషి యీ ఇద్దరు నేరస్తులనుండి నగదు యితర విలువగల వస్తువులు లంచంగా తీసుకొని జడ్జితో మాట్లాడి యీ రకంగా కేసు త్రోసివేయించాడని కూడా హైరల్ విన్నవించుకొన్నాడు పోలీసు సూపరింటెండెంట్‌గారికి.

సూపరింటెండెంట్, జడ్జి – యిద్దరూ మంచి స్నేహితులు. ఒకరోజు సూపరింటెండెంటు జడ్జితో మాట్లాడుతూ ఏదో మాటల సందర్భంగా సున్నితంగా అడిగాడట – ఫలాన క్రైస్తవమిషనరి యీ

ఫలానా కేసు సందర్భంలో ఫలానా కేసుయినా రెకమెండేషన్ తెచ్చాడా? అని మొహాన్నే అడిగాడట. అందుకు జడ్జిగారు యీ క్రింది విధంగా జవాబు చెప్పాడట – "ఆ! అతను అందుకు ప్రయత్నించిన మాట వాస్తవమే కాని; కేసు విషయమై అట్లా రెకమెండేషన్లు తీసుకొచ్చి నందుకు గట్టిగా మందలించాను – అని అన్నాడట.

ఆ ఖాన్ సబ్ మేజిస్ట్రేట్ మాత్రం పట్టి అప్రాచ్యుడని అర్థమై పోయింది. దీని తర్వాత ఇంకొక కేసులో అవాంఛనీయంగా వ్యవహరించినందుకు కలెక్టరు అతన్ని డిస్మిస్ చేసినట్లు మైరల్ పేర్కొంటాడు.

"......ధనవంతులు చట్టాన్ని కొనగలరు" (........Richmen buy the law) అని గత శతాబ్దంలో ఇంగ్లాండులో ఒక పెద్ద రచయిత అన్నట్లుగా, యిట్లాంటివారు న్యాయాధికారులుగా వుంటే కేసులు అట్లాగాక ఇంకేమౌతాయి? మన దేశంలో లంచగొండితనానికి ప్రారంభదశగా యిట్లాంటి ఉదంతాలను పేర్కొనవచ్చునేమో! మైరల్ తన గ్రంథంలో పేర్కొన్న ఇట్లాంటి కొన్ని క్రైమ్‌కథలు యీ రకం పరిశోధనలకు పనికొస్తాయేమో?

## నూరేళ్ళనాటి నెల్లూరు సంగతులు

1860 సం॥ నాటి మాట. అప్పటి మద్రాసు రాష్ట్ర ఇన్‌స్పెక్టరు జనరల్‌గారు చేసిన వాగ్దానం ప్రకారం మైరల్‌ను నెల్లూరు ఇన్‌స్పెక్టరు ఆఫ్ పోలీస్ నియామకం చేసి నెల్లూరు వెళ్ళమని ఆర్డరు చేశాడు.

తర్వాత అంటే 1860 అక్టోబర్ 3 వ తేదీన ఆ ఆర్డరును చేతపట్టుకొని మైరల్ మద్రాసునుండి నెల్లూరు బయల్దేరాడు వంటెద్దు బండిమీద. అప్పటి కింకా మద్రాసు–నెల్లూరు రైలుమార్గం ఏర్పడ

లేదు. కార్లు గీర్లు కూడా వచ్చేవట్టు లేదు. అందుకనీ కాబోలు ఎద్దుబండి శరణ్యమైంది మైరల్ కు.

రోడ్డు పొడుగునా కలరావ్యాధి విపరీతంగా సోకి ఉండింది. బండిలో ఎక్కువగా ఐదునోజుల తర్వాత, అంటే 1860 అక్టోబర్ 8వ తేదీన నెల్లూరు చేరుకున్నారు. ఆ రోజే నెల్లూరు రిజర్వు ఇన్‌స్పెక్టరుగా చార్జి తీసుకున్నాడు. అప్పటి నెల్లూరు జిల్లా కలెక్టరు జాక్సన విలియమ్ కాలింగ్టన్ క్లైన్స్‌దొరగారు.

మైరల్ కు చేతినిండా పని ఉంటూ వుండేది. జిల్లా స్థాయిలో పోలీసు వ్యవస్థ అప్పుడే అంటే 1859–60 సం॥లోనే ప్రారంభమైంది. కొత్తగా రిక్రూటయిన పోలీసులకు (దాదాపు 400 మందికి పైగానే) డ్రిల్లు–పెరేడ్లు చేయుటంలో శిక్షణ ఇవ్వడమనేది మైరల్ ఆధ్వర్యంలోనే జరుగుతూండేది. మిలటరిశాఖలో హవల్దారుగా ఉండి పెన్షన్ పొందుతూ ఉండిన భారతీయులు హెడ్ కాన్‌స్టేబిల్స్‌గా నియామకమవుతూండేవారు. వీరు మాత్రం ఈ బెటాలియన్ డ్రిల్లు – పెరేడ్లు సునాయాసంగా చేస్తూ ఉండేవారు.

ఎట్లయితేనేం, మూడునెలల వ్యవధిలోనే యీ కొత్తగా రిక్రూటయిన పోలీసులకు కంపెనీడ్రిల్లు, రైఫిల్ షూటింగ్‌లోనే గాక వీధుల్లో కాల్పులు జరపడం, గుంపుకొట్లాటలను చెదరగొట్టడంలో కూడా మంచి శిక్షణ ఇవ్వగలిగినందుకు మైరల్‌ను పైఆఫీసర్లు మెచ్చుకున్నారు. ఇంతేకాకుండా నిత్య నైమిత్తిక పోలీసు వ్యవహారాల్లోను, పరిశీలన విషయాల్లోనూ మైరల్‌గారే శిక్షణ తరగతులను నడిపి బోధించాడు. ఇట్లా శిక్షణ పూర్తయిపోగానే యీ పోలీసులు తాలూకా ఆఫీసులకు బదిలీ చేయబడుతూ ఉండేవారు.

ఆ రోజుల్లో నేరాలు విపరీతంగానే జరుగుతూండేవి. రాత్రిళ్లు కాగడాలు పట్టుకొని వూళ్ళమీద పడి దోపిడీ చేయడమనేది జాస్తిగానే వుంటుండేది. ఒక్క 1861 సం॥లోనే ఇట్లాంటి దోపిడీలు 26కు

పైగానే జరిగాయి. సరే, చిన్నసైజు దొమ్మీలు, దారిదోపిడీల సంగతి చెప్పనక్కర్లేదు.

ఈ పోలీసు వ్యవస్థ ప్రారంభంకాకముందు వుండిన పాత విధానంలో కలెక్టరు, జాయింటు మేజిస్ట్రేటు, యూరోపియన్ అసిస్టెంటు మేజిస్ట్రేటు, జిల్లా పోలీసుశాఖకు ప్రధానాధికారులుగా ఉంటుండేవారు; కాని వాస్తవంలో తాసిల్దార్లు, సబ్ మేజిస్ట్రేట్లు మొత్తం పోలీసు సంబంధమైన పనులన్నీ చేస్తుండేవారు. పెద్దపెద్ద తీవ్రమైన నేరాలను కూడా ముందు తాసిల్దార్లు, సబ్ మేజిస్ట్రేట్లు విచారించిన మీదనే సెషన్సు కోర్టుకు వస్తుండేది. అక్కడ యూరోపియన్ సెషన్సు జడ్జిగారు యిద్దరు ఆఫీసర్ల సాయంతో (హైకోర్టులో అయితే వీళ్ళనే జ్యూరీలు అనే వారు) ట్రయల్ జరిపేవారు.

సెషన్సుకోర్టు కొచ్చేముందు ఈ తాసిల్దార్లు, సబ్-మేజిస్ట్రేట్ల స్థాయిలో జరిగే ప్రాథమిక నేరవిచారణ ఎంతో లోపభూయిష్టంగా వుండటమేగాక లంచగొండితనానికి కూడా జాస్తి అవకాశం వుంటుండేది. ఈ 'ఆఫీసర్ల' ప్రమేయం వల్ల కూడా ఎన్నో అవకతవక లుండేవి. వాళ్లు పరమ దగుల్బాజీ రకంగా వ్యవహరిస్తుండేవారు. వాళ్ళ వైజ్ఞానిక స్థాయి అంతంత మాత్రంగానే వుంటూండేది.

మొత్తంమీద ఈ ఆఫీసర్ల తతంగం అంతా ఒక ప్రహసనంగా వుంటుండేది. పెద్ద పెద్ద కేసుల్లో కూడా యీ ఆఫీసర్లు నిర్వహిస్తుండే అదృశ్య పాత్రలవల్ల చాలా చాలా నేరాల్ని జడ్జీలు త్రోసివేస్తుండేవారు. ఈ ఆఫీసర్లు ఆనరరీ ఉద్యోగులే అయినా రెండు చేతులా జవురుకుంటూండేవారు. లంచగొండితనం విలయతాండవం చేస్తుండేది. కనక వర్షం కురిపించుకొంటుండేవాడు. "The Shaking of the Pagoda tree was much more common at that time" అని మైరల్ పేర్కొన్నాడు. సరే యిక కోర్టు సబార్డినేట్ వుద్యోగస్థుల్లో కూడా లంచగొండితనం స్వైర్యవిహారం చేస్తుండేది.

(ఈ 'ఆఫీసర్ల' వ్యవస్థ కట్జూ రిఫార్మ్సు వచ్చిన తర్వాత 10 ఏళ్ళ క్రితం రద్దయిపోయింది.)

క్రైరల్ వ్రాసింది చదువుతూంటే—ఇప్పటి కాలంలోనే కాదు, గత కాలంలో కూడా లంచగొండితనం అంత విపరీతంగా ఉండేదని అనిపిస్తుంది. "గతకాలము మేలువచ్చు కాలము కంటెన్" – అని నన్నయగారిసూక్తి చిలుకపలుకులా పలుకుతూంటాం. కానీ నిజానికి ఆ గతకాలంలో కూడా యింత లంచగొండితనం వుంటుండేదంటే మనం నమ్మగలమా? అయితే ఒక్కటి, ఆ రోజుల్లో యీ లంచ గొండితనం ఋజువు చేయడానికి కష్టమైన స్థాయిలో వుంటుండేది; ఇప్పుడు ఆ స్థాయిదాటి బరితెగించి పోతున్నది. అంతేనేమో బహుశా తేడా!

ఏమయితేనేం ఇంత లోపభూయిష్టమైన విధానంవల్ల పెద్ద పెద్ద కేసులు కూడా సెషన్స్ కోర్టు కొచ్చేసరికి త్రోసివేయబడు తూండేవి. ఈ కొత్త పోలీసు వ్యవస్థ ఏర్పడ్డతర్వాత కూడా ఈ పరి స్థితి దాదాపుగా కొనసాగుతూండేదంటాడు క్రైరల్. క్రైరల్ వచ్చిన క్రొత్తలో పోలీసువారు పకడ్బందీగా, బాగా విచారణ చేసిపెట్టిన (నిజంగా జరిగిన) 16 కేసులకు పైగానే డిస్మిస్ చేయబడ్డాయంటాడు. పోలీస్ లబోదిబో మంటుండేది. ఇదీ స్థూలంగా ఆ తొలిరోజుల పరిస్థితి!

## నూరేళ్ళనాటి నెల్లూరు మొదటి జర్నలిస్టు

### కీ. శే. దంపూరు నరసయ్య – 3

ఆచార్య రంగాగారన్నట్లు దంపూరు నరసయ్యగారు ఎంతటి అద్భుతమైన వ్యక్తి! ఆయన భావాలు ఎంతటి అభ్యుదయకరమైనవి. నూరేళ్ళక్రితమే నరసయ్యగారు తన జీవితకాలములో మొత్తం నాలుగు పత్రికలు నడిపినా ఏ ఒక్క సంపుటం కూడా లభ్యంకాలేదు. ఆయన బంధువులదగ్గరగాని లేక ఏ లైబ్రరీలో కాని,

ఇదిగో నరసయ్యగారిసొత్తు - అని ఆయన మనుమడు శ్రీ భట్టారం కృష్ణమూర్తిగారు ఈ లేఖకుడి కిచ్చిందల్లా - 1906 లో నరసయ్యగారు తన సొంత అక్షరాలతో రోజువారి వ్రాసుకున్న డైరి. 1875 ప్రాంతంలో మద్రాస్ మెయిల్ పత్రికలో పడిన "A native on unisances" అనే నరసయ్యగారి సుదీర్ఘమైన లేఖ.

డైరి అంత గజిబిజిగావుంది ఆయన వ్రాత పత్రికా వ్యాసంగానికి దూరంగా తన జీవిత చరమదశలో నెల్లూరు సమీప కోడూరు గ్రామంలో వ్యవసాయం చేసుకుంటూ వుండేదశలో (శ్రీనాథుని ఆఖరిదశ జ్ఞప్తికొస్తుంది) వ్రాసుకొన్న డైరి కాబట్టి అందులో వ్యక్తిగత విషయాలు తప్ప ఆశక్తికరమైన సామాజిక విషయాల ప్రస్తావన వున్నట్టు లేదు.

వెంకటగిరిలో దంపూరు నరసయ్యగారు జీవించిన పెంకుటింటిలో వొక భోషాణం పెట్టెవుంది. అందులో ఆయన పుస్తకాలు, ఇతర రికార్డు వున్నదని తెలిసి వెంకటగిరి వెళ్ళాను. నరసయ్యగారి ఇలాకా వ్యక్తి బి. వి. రాఘవన్ అనే హైస్కూలు సైన్సు టీచరు సహకారంతో ఇటీవల ఒకరోజు రాత్రి పదిగంటలకు ఆ భోషాణం పెట్టె తెరచి చూడగా ఆశ్చర్యపోయాను. ఆ పెట్టెనిండా పుస్తకాలే! ఇన్నాళ్లూ వెలుగు చూడకుండా ఆ అమూల్యమైన గ్రంథాలు యిందులో సమాధి చేయబడ్డవా అనిపించింది. ఇవిగాక నాలుగైదు బీరువాల పుస్తకాలు వెంకటగిరి ఆర్. వి. ఎం. హైస్కూలుకు నరసయ్యగారి పుస్తకాలు చాల ఏళ్ళక్రితమే బహూకరింపబడ్డవట.

దాదాపు నాలుగైదువందల ఆంగ్లగ్రంథాలున్నట్లున్నవి. అన్నిటిమీద దంపూరునరసయ్య లైబ్రరి అని వ్రాసివుంది. నెంబర్లతో సహా. ఈ పెట్టెలోనైన ఆయన ఎడిట్ చేసిన పత్రికల పేజీలైనా దొరుకుతాయేమోనని ఆశాంతం గాలించాను. లాభంలేదు. దొరకలేదు. 1850 ప్రాంతంలో వచ్చిన ఎన్నో ఆంగ్లగ్రంథాలు మంచి స్థితిలో వున్నాయి.

ఈ పుస్తకాలైనా శిథిలమైపోకుండా ఒక మంచి బీరువాలో పెట్టి ఏదైన ఒక పబ్లిక్ లైబ్రరీకి బహూకరించి, నూరేళ్ళనాటి నెల్లూరు మొదటి జర్నలిస్టు దంపూరు నరసయ్యగారి పుస్తకాలు''- అని బోర్డు వ్రాసివుంచితే, ఆ రూపంగానైన ఆయన పేరు చరితార్థ మౌతుందేమో అనిపిస్తుంది. వారి మనుమలు ఆలోచించగలరను కుంటాను. కొత్తగా వెలసిన వెంకటగిరి కాలేజీవారో లేక నెల్లూరు వర్థమాన సమాజగ్రంథాలయవారో వీటిని భద్రపరచడం వుచితంగా వుంటుంది.

మరొక విషయము - సంస్కరణ ప్రియులైన నరసయ్యగారు కందుకూరి వీరేశలింగంగారి స్నేహితులటకూడా, వీరేశలింగంగారి మార్గంలోనే వెంకటగిరిలో కొన్ని వితంతు వివాహాలను నరసయ్య గారు జరిపించారంటారు.

ఇక్కడెక్కడా లభ్యంకాని నరసయ్యగారి వ్రాతలనిక్షేపం ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్యగారు పంపిన పాతకార్డుల్లో దొరికింది.

ఆ రోజుల్లో తెలుగు పత్రికల్లోపడిన కొన్ని వ్యాఖ్యలు, విమర్శలు, వ్రాతలను ఏర్చికూర్చి - ఇంగ్లీషులోకి తర్జుమాచేసి ప్రభుత్వానికి నివేదికలరూపంలో పంపే ఏర్పాటు శాఖవొకటి ఉండేది. Selected extracts from the confidential reports on the native news papers - అని పంపుతుండేవారు ప్రభుత్వానికి. ఇట్లా 1907 లో దంపూరు నరసయ్యగారు ఆఖరుగా నెల్లూరు నుండి నడిపిన తెలుగు పత్రిక "ఆంధ్రభాషా గ్రామ వర్తమాని" నుండి తొమ్మిది Translated Cuttings దొరికాయి.

వీలు చూచుకొని వీటన్నింటిని గూర్చి ఎప్పుడైనా వొకసారి విపులంగా చర్చించుకుందాం. ఇంతటితో నరసయ్యగారి గుణగానం ప్రస్తుతానికి ఆపుదాం.

# నూరేళ్ళనాటి నెల్లూరు మొదటి జర్నలిస్టు దంపూరు నరసయ్య

## కందుకూరి వీరేశలింగం ఆత్మకథలో ఒక సన్నివేశం

నూరేళ్ళ నాటి మొదటి జర్నలిస్టు స్వర్గీయ దంపూరు నరసయ్య గారి ప్రతిభా విశేషాలను గూర్చి ఆ మధ్య 'జమీన్ రైతు'లోనే సీరియల్ గా చదివేవున్నారు. నెల్లూరు మొట్టమొదటి పత్రిక 'నెల్లూరు పయొనీర్'ను స్థాపించి, మద్రాసులో 'నేటివ్ అడ్వోకేట్' 'పీపుల్స్ ఫ్రెండ్' అనే పత్రికలు నడిపి, మళ్ళీ నెల్లూరులో 'ఆంధ్రభాషా గ్రామ వర్తమాని' అనే తెలుగు పత్రికను కూడా కొన్నాళ్ళపాటు నడిపి కాలగర్భంలో కలిసిపోయిన వ్యక్తి దంపూరు నరసయ్యగారు.

ఆ రోజుల్లోనే ఇట్లా తన జీవితకాలంలో ఒకటికాదు, రెండు కాదు, నాలుగు పత్రికలు నడిపి, పత్రికా సంపాదకత్వాన్ని నెరిపి, పత్రికలు నడపడం అనేది ఒక జీవిత వ్రుద్యమంగా నిర్వహించిన మాన్యవ్యక్తి దంపూరు నరసయ్యగారు.

ఒకవిధంగా పత్రికారచయిత అయిన ప్రతివాణ్ణీ పులకితం చేయదగిన చరిత్ర నరసయ్యగారిది. దురదృష్టవశాత్తు వారి చరిత్ర వారు నడిపిన పత్రికల చరిత్రవారు చేసిన పత్రికారచనల వైశాల్యము మనకు పూర్తిగా సమగ్రంగా లభించడంలేదు. ఎక్కడో చెదురు మదురుగా లభ్యమవుతున్న పుస్తకల ఆధారంతో వారి వ్యక్తిత్వాన్ని వూహించుకోవాల్సిరావడం విచారకరమైన అంశమే. ఇటీవల కందుకూరి వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్ర చదువుతూ వుంటే వొకచోట యాదృచ్ఛికంగా, యథాలాపంగా దంపూరు నరసయ్యగారిని గూర్చి ఒకే ఒక ప్రస్తావన లభించింది.

వీరేశలింగంగారు గ్రంథస్థంచేసిన విషయాలు ఇన్నేళ్ళ తర్వాత చదువుతూవుంటే ఏదో పురాతనమైన చరిత్ర వీథులగుండా పయనిస్తున్నట్లుండినది. మొట్టమొదటిసారి విధవా వివాహాన్ని జరిపించినపుడు వీరేశలింగంగారు ఎదుర్కోవలసి వచ్చిన తీవ్రసంఘ బహిష్కా-

రణ చర్చలు గూర్చి చదివినపుడు ఆనాటి మన సమాజం ఎంతటి పూర్వాచార పరాయణత్వంలో మగ్గిపోతుండినదో కొంతకు కొంత అర్థమైనది.

వర్ణాంతర వివాహమైనా కాదు. వీరేశలింగం బ్రాహ్మణ కులంలోనే జరిపిన వివాహమే అయినా అంతటి విసుర్నను ప్రతిఘటనను ఎదుర్కోవలసి వచ్చిందంటే ఈనాడు విడ్డూరంగానే కనబడుతుంది.

1881 సంవత్సరం డిసెంబరు 11 తేది రాజమహేంద్రవరంలో వీరేశలింగంపంతులుగారు మొట్టమొదటిసారిగా స్త్రీ పునర్వివాహాన్ని జరిపినపుడు మద్రాసులో కొందరు నాగరిక మిత్రులు అభినందన సూచకంగా ఆహ్వానిస్తారు మద్రాసులో కొన్ని ప్రచారోపన్యాసాలు చేసిపొమ్మని. ఈ ఆహ్వానం ఆసరాతో ఉత్సాహం పొందిన వీరేశలింగంగారు మొదట మద్రాసు పయనమై వెళ్ళే దారిలో తుఫానులో చిక్కుపడి నానాకష్టాలలో లోనై కడకు ప్రయాణమధ్యంలో మాను కొని రాజమండ్రికి తిరిగి వెళ్ళారు. మళ్ళీ మద్రాసు మిత్రులు జాబుల మీద జాబులు వ్రాస్తూ ఆహ్వానిస్తారు. మళ్ళీ రెండోసారి పయనమై వీరేశలింగంగారు మద్రాసు చేరుకుంటారు. ఆ ప్రథమ వివాహదంపతులను వెంటబెట్టుకొని.

వీరేశలింగంగారి రాకను పురస్కరించుకొని, ఆ మద్రాసు మిత్రులు కొందరు – తమ సంస్కరణవాదుల పక్షాన్ని ఎవరెవరు బలపరుస్తారో తేల్చుకోవాలని, తమతో సహపంక్తి భోజనాలుచేసి యే విధంగా తోడ్పడ్తారో చూడాలని పత్రికల్లో ప్రకటనలు చేశారట. బాగా పేరుగలిగిన పెద్దవాళ్ళు 30 మందిదాకా ఆ సహపంక్తి భోజనాల్లో పాల్గొంటామని జాబులు వ్రాసారట. అప్పటి హిందూ పత్రికలో రోజు మూడు నాలుగేసి వుత్తరాలు కూడా యీ విషయమై ప్రకటింపబడుతుండేవట.

తీరా మద్రాసులో వీరేశలింగంగారి గౌరవార్థం ఏర్పాటు చేసిన బ్రాహ్మణ సహపంక్తి భోజనాలకు రాగలమని 'శూర వాక్యాలు' లిఖించిన ఆ పెద్దవాళ్ళంతా జారుకున్నారట! ఆ విందు భోజనానికి (దీన్ని ఆ రోజుల్లో సంస్కార భోజనమన్నారు) వచ్చిన వారు. వివాహాదంపతులుగాక రఘునాథరావుగారు, ఏల్లై చెంచల రావుగారు, (నెల్లూరు ఫండాఫీసు స్థాపకులు) గణపతయ్య, దంపూరు నరసయ్య, యన్నవ బుచ్చయ్యపంతులును, నేనును కలసి "సాంఘిక సంస్కారాభిమాన చక్రవర్తులు" ఈ ఆరుగురితోను విందు జయ ప్రదంగా ముగిసింది-అని వ్రాశారు. వీరేశలింగంగారు (చూ. స్వీయ చరిత్ర, 4వ ప్రకరణం, 205 పేజి).

ఏమైనా ఆనాటి ఆ విందుకు హాజరు కావడమనేదే 'సాంఘిక సంస్కారాభిమానంగా' పేర్కొన్నారు. మరి వీరేశలింగంగారు, ఆనాటి ఆరుగురు మద్రాసు 'సాంఘిక సంస్కారాభిమాన చక్ర వర్తిగా' కొనియాడబడ్డాడు కాబట్టే – ఆ తర్వాత కొన్నేళ్ళకు వెలువడిన గురజాడవారి 'కన్యాశుల్కం' నాటకం పైన అంతటి అధునాతనమైన, విప్లవకరమైన సమీక్షను వ్రాయగలిగారు దంపూరు నరసయ్యగారు, తన 'పీపుల్ ఫ్రెండ్' పత్రికలో.

## 220 ఏళ్ళనాటి సంగతులు

ఈస్టిండియా కంపెని తొలిరోజుల్లో మద్రాసు సిపాయిలకు కమాండింటుగా పనిచేసిన

'నెల్లూరు సుబేదార్' మహమ్మద్ యూసఫ్ ఖాన్

ముందు చూపుమాని బంగోరె వెనక్కి వెళ్తున్నా డేమిటి చెప్మా అని అనుకోకుండా వుంటే ఒక విషయం చెప్పాలనుంది. నూరేళ్ళ క్రితం నెల్లూరు పోలీసాఫీసరుగా పనిచేసిన బైర్రల్ వ్రాసిన గ్రంథంనుండి సేకరింపపడిన 'నూరేళ్ళనాటి నెల్లూరు సంగతులు' జమీన్ రైతులో ధారావాహికగా కొందరైనా ఆసక్తితో చదివా

రనే అనుకుంటాను. స్థానిక చరిత్రకు సంబంధించిన చిల్లర అంశాలు కొల్లలుగా అందులో వుల్లేఖింపబడినాయి.

ముఖ్యంగా 1857 నాటి సిపాయిల తిరుగుబాటుకు సమానాంతరంగా మద్రాసు ప్రాంతంలో బ్రిటిషువారిపై తిరుగుబాటు ఉద్యమాన్ని లేవనెత్తి విఫలుడై, ఇగ్లాండు వెళ్ళి స్వాతంత్ర్య సింహగర్జనలు చేసి స్వదేశానికి తిరిగి వచ్చి తిరుచినాపల్లి జైలులో ఖైదీగా అనామకమైన చావుచచ్చిన 'వెంకటగిరి వీరుణ్ణి' గూర్చి కొత్తసమాచార మేదైనా దొరుకుతుందేమోనని ఎందరో చరిత్ర వేత్తలను అడుగుతూ వచ్చాను. దురదృష్టవశాత్తు ఏమి లభ్యం కాలేదు. కడకు అతని పేరైనా దొరకలేదు. ఆఖరుకు మనజాతిలో అతను నడిపిన వీరోచితమైన వుద్యమానికి సంబంధించిన స్మృతైనా ఏమీ మిగల్లేదు.

మద్రాసు వెళ్ళినపుడు ఆరుద్రగారితో యీ విషయమై అప్పుడప్పుడూ సంప్రదిస్తూ వచ్చినపుడు – అంతకంటె ముందు 1835 ప్రాంతాల్లో నెల్లూరు కలెక్టరు టి. వి. స్టోన్‌హావుస్‌గారి హయాంలో వొక తిరుగుబాటు వుద్యమగాథ వుందన్నారు. ఆ విషయమై వ్యాసానికరూపంలో వ్రాయమని ఆరుద్రగార్ని అభ్యర్థించాను. "ఆ వొక్క-విషయమే ఏం ఖర్మ బ్రిటిషువారిపై తెలుగుదేశంలో రేగిన తిరుగుబాటు ఉద్యమాలను గూర్చి ఎంతో విస్తారమైన చరిత్ర మరుగుపడి వుంది. వీలు చూసుకొని జమీన్‌రైతుకు వీటిని గూర్చిన పెద్ద వ్యాసమే ఒకటి వ్రాస్తాను"—అన్నారు. ఆరుద్రగారి ఆ స్టాండింగ్ ప్రామిస్ అట్లాగే వుంది.

ఆ వ్యాసం కోసం నేను నక్షత్రకుడిలా ఆయన్ను తగులుకుంటుంటే–వొకసారి మాటల సందర్భంలో ఈ నెల్లూరు సుబేదార్ ప్రస్తావన వచ్చి, ఈ సుబేదార్ను గూర్చిన వివరం ఫలాన పుస్తకంలో వుంది చూడమన్నారు. 'మద్రాసు సోల్జర్' అని ఆ పుస్తకం పేరు. మద్రాసు మిలిటరి రిజమెంట్ చరిత్రను గూర్చి వొక ఇంగ్లీషు

ఆఫీసరు వ్రాసిన చిన్న గ్రంథ మది. ఇటీవలే రాష్ట్రపతి వి. వి. గిరి గారు 225 ఏళ్ళు నిండిన మద్రాసు మిలిటరి రిజిమెంట్ సభలో పాల్గొని కొన్ని పతకాలు కూడా బహూకరించి వెళ్ళారు. ఆ సందర్భానికి తగినట్లుగా నాతో ఆరుద్రగారు ఈ విషయం సూచించారు. అయితే వేరే కార్యవ్యగ్రుడనై ఈ విషయం జోలికి పోలేక పోయాను. ఆరుద్రగారికి కృతజ్ఞత చెప్పుకుంటూ ఆలస్యంగానైనా ఈ నెల్లూరు సుబేదార్‌ను గూర్చిన కథనం దొరికినంతమట్టుకైనా ఇస్తున్నాను.

బ్రిటిష్ వారు మన దేశానికి వచ్చిన మొదటిరోజుల్లో వారికి చెప్పుకోదగిన సైన్యాగార మంటూ లేదు. 1628 లో నెల్లూరు జిల్లా దుగరాజపట్నం వద్ద వారు మొదటి స్థావరం ఏర్పరచుకున్నపుడు వారి సైన్యాగారంలో 28 మంది సోల్జర్లు, 12 ఫిరంగుల సామగ్రి మాత్రమే ఉండినాయి. తర్వాత 1644 లో తమ స్థావరాన్ని మద్రాసుకు తరల్చుకొని వెళ్ళినపుడు సోల్జర్లుగా 30 మంది కంటే ఎక్కువ లేరు. మరో వంద ఏళ్ళకు గాని వారికి మిలిటరి మనస్తత్వం ఏర్పడ లేదు. తగిన మిలిటరీ నిర్మాణం చేసుకో లేదు.

1744 లో ఇంగ్లీషువారికి ఫ్రెంచివారికి యుద్ధం రేగింది. ఫ్రెంచివారికి అప్పట్లో మంచి సైన్యబలగమే వుండింది. 1746 లో ఫ్రెంచివారి హస్తగతమైంది మద్రాసు; ఆర్కాటునవాబు నుండి బ్రిటిషువారికి ఏలాంటి సాయమూ అందలేదు. అప్పుడు కడలూరు కోటలో వుండిన బ్రిటిషు ఈస్టిండియా కంపెని గవర్నరుగారిపై రక్షణ బాధ్యత పడింది.

ఈ అపజయం తర్వాత గానీ బ్రిటిషువారు కలదెల్చుకో లేదు. ఆ తర్వాత పెద్ద సంఖ్యలో సిపాయిలను నియమించుకో సాగారు. మిలిటరి నిర్మాణం పట్ల దృష్టి మళ్ళించారు. మళ్ళీ తిరిగి 1749 లో ఫ్రెంచి-బ్రిటిషు వారి మధ్య సంధి ఏర్పడి మద్రాసు బ్రిటిషువారి చేతులోకి వొచ్చినా-కొన్నేళ్ళపాటు, దాదాపు పది పదిహేనేళ్ళ

పర్యంతం ఫ్రెంచ్ వారికి బ్రిటిష్ వారికి మధ్య యుద్ధ వాతావరణమే ఉంటూ వొచ్చింది. చిల్లర మల్లర యుద్ధాలే కొనసాగుతూ వొచ్చాయి. ఈ కాలం లో మేజర్ స్ట్రింగర్ లారెన్స్, కెప్టెన క్లైవ్ ల అధ్వర్యంలో బ్రిటిషు వారి మద్రాసు మిలిటరి శక్తి బలపడింది. ఫ్రెంచివార్ని పూర్తిగా అణగద్రొక్కగలిగారు. ఫ్రెంచివారి క్రింద వున్న సైన్యం బ్రిటిష్ వారి కైవశ మవుతూ వచ్చారు.

ఈ యుద్ధాల్లో బ్రిటిష్ మిలిటరి వ్యూహాల్లో ప్రముఖపాత్రను నిర్వహించి అగ్రపీఠాన్ని అలంకరించి మద్రాసు రిజిమెంటులో బ్రిటిషు వారి క్రిందనున్న మొత్తం సిపాయిలకు కమాండెంట్ గా నిర్వాహకం జేసి ఈస్టిండియా కంపెనివారి ప్రత్యేక బహుకరణకు పాత్రమైన నెల్లూరు సుబేదార్ కథ ఒకటి వుంది.

1752 లో మే 3 వ తేదీన ఉటతూరు వద్ద ఫ్రెంచివారిపై విజయం సాధించినపుడు క్లైవుకు కెప్టెన్ డాల్టన్ ఇట్లా తెలియ జేశాడు. మీ నెల్లూరు సిపాయిలు అసాధ్యులు, ముఖ్యంగా నెల్లూరు సుబేదారు అఖండుడు. అతనిమీదనే నేను అనాంతం ఆధారపడ్డాను. (Your Nellore Sepoys are glorious fellows and their Subedar as good a man as ever breathed. He is my soul-dependence) అంటాడు. ఈ నెల్లూరు సుబేదార్ మహమ్మద్ యుసుఫ్ ఖాన్.

ఫ్రెంచ్ వారితో జరిగిన పై యుద్ధ పరంపరల్లో ఘనవిజయా లను సాధించినందుకు ఈస్టిండియా కంపెనివారు మేజర్ స్ట్రింగర్ లారెన్స్‌ను లెప్టినెంట్ కర్నల్ గా రాయల్ కమీషన్ సత్కారా న్నందజెయ్యడమే గాక వజ్రాలతో పొదిగిన ఒక ఖడ్గాన్ని కూడ బహూకరించారు. కెప్టెన్ క్లైవ్‌కు కూడా మరో ఖడ్గాన్ని బహూ కరించారు. విశేష మేమంటే వీరితోబాటుగా, మన మహమ్మద్ యూసఫ్ ఖాన్‌కు కంపెని సిపాయిల కమాండెంట్ గా జేసి వొక స్వర్ణ పతకాన్ని కూడా ఇచ్చి ఘనసత్కారం జేశారు.

మన దేశంలో బ్రిటిష్ మిలిటరీ చరిత్ర తొలిరోజుల్లో నెల్లూరు సుబేదార్ యుసఫ్‌ఖాన్ మొదటి భారతీయ కమాండెంట్‌గా ఖ్యాతి పొందా డన్నమాట.

సెంట్ జార్జి పోర్ట్ గవర్నర్ కౌన్సిల్ చేత 1755 మార్చి 7 వ తేదీన యుసఫ్‌ఖాన్‌కు బహూకరింపబడిన 3 జోన్సుల 2½ పౌన్లు వెయిట్లు బరువు కల్గిన (302 2½ dut) బంగారుపతకము మీద ఒకవైపు ఇంగ్లీషులో as a distinguishing mark of his bravery and good service. (అతని ధైర్యసాహసాలకు, మంచి సర్వీసుకు ప్రత్యేక పరిగణనగా బహుకరింపబడినది) అని వ్రాయబడింది – మరోవైపు పర్షియన్ లిపిలో ఈ క్రిందివిధంగా వ్రాయబడింది–"ధైర్యసాహసాలతో కూడిన సోల్జరుగా నేర్పు నిపుణతలు కలిగిన మిలిటరీ ఆఫీసరుగా, విధేయుడైన అధికారిగా భావితరాలకు ఉదాహరణగా వుండేందుకు! ...ఇంగ్లీషు కంపెనీ సిపాయిల కమాండర్ మహమ్మద్ యుసఫ్‌ఖాన్ బహాదూర్‌కు అతని ధైర్య సాహస పరాక్రమాలకు మెచ్చి సెంట్ జార్జి పోర్టు గవర్నరు–కౌన్సిల్ వారిచే బహుకరింపబడినది" – అని వుంది.

కంపెనీ సిపాయిల కమాండెంట్‌గా ఆ తొలిరోజుల్లో యూసఫ్ ఖాన్ నిర్వహించిన ప్రధానమైన పాత్రను గూర్చి Orme (ఆర్మీ) అనే ఆయన వ్రాసిన– Military transactions in Indostan –అనే గ్రంథంలో మరికొన్ని ప్రస్తావనలు దొరుకుతాయి. 1758 నవంబరులో మద్రాసు రెజిమెంటులో మొదటి దఫాగా గుర్రపు దండును నిర్మించాలను కున్నప్పుడు 500 గుర్రపు దండును ఖరీదుచేసి తగిన రౌతులను నియ మించేందుకు యూసఫ్‌ఖాన్‌కు సంపూర్ణాధికారం యివ్వబడిందట.

1746 లో మద్రాసు ఫ్రెంచివారు స్వాధీనం చేసుకున్నప్పుడు తొలుత తన సైనిక జీవితాన్నే ఫ్రెంచివారి క్రింద ప్రారంభించి తర్వాత బ్రిటిషువారి మిలిటరీలోకి వచ్చి అనతికాలంలో అగ్రశ్రేణి హోదాలోకి వచ్చిన నెల్లూరు సుబేదార్ యూసఫ్‌ఖాన్ 1763 వచ్చేసరికి దిక్కు లేని చావు చావల్సివచ్చింది.

1763 లో ఆర్కాటు నవాబుగా మధుర - తిరునల్వేలిజిల్లాలకు ఇజారాదారు (renter) గా నియమింపబడి, ఒక తిరుగుబాటు ఉద్యమకరిలో చిక్కుకొని ఫ్రెంచివారివైపుకు చేరిపోతాడు. మద్రాసు నుండి వచ్చిన ప్రత్యేక సైనిక సహాయంతో బహుకష్టంమీద ఈ తిరుగుబాటును అణచివేసి, యూసఫ్‌ఖాన్‌ను బందీచేసి ఉరిశిక్ష విధిస్తారు నవాబు.

నెల్లూరు సుబేదార్ యూసఫ్‌ఖాన్ మరణంతో మద్రాసు రిజమెంట్ సృష్టించిన ఒక గొప్ప సోల్జర్ అదృశ్యం కావడం అటుంచి, దురదృష్టవశాత్తు ఆ నాటినుండి 'ఇండియన్ కమాండెంట్' హోదాయే తొలగింపబడి, భారతీయులపట్ల బ్రిటిషువారిలో అపనమ్మక మేర్పడి, బ్రిటిషు మిలిటరిలో భారతీయులకు శాశ్వతంగా క్రింది హోదా ఉద్యోగాలే శరణ్యమైనవి.

—ఇదే మద్రాసు రిజమెంట్ ఏర్పడిన ఆ తొలిదినాలల్లో ఒక వెలుగు వెలిగిన నెల్లూరు సుబేదార్ యూసఫ్‌ఖాన్ సంక్షిప్త చరిత్ర.

## రచయితగా శ్రీ నెహ్రూ

నెహ్రూగారిని నేను చూడనేలేదు. ఆయనంటే అంత భక్తి నా కెపుడు లేదు. అట్లాని లోహియాగారిలాగా ద్వేషము లేదు. నెహ్రూగారి రాజకీయజ్ఞత, నాయకత్వ లక్షణాలు వీటి గురించి ఇంట బయట కూడా వేలాదిమంది వేనోళ్ళ మాట్లాడినారు. అయితే రచయితగా నెహ్రూగారికే స్థానమున్నదనే విషయాన్ని ఈనాడైనా మనలో చాలమంది గుర్తించవలసినంతగా గుర్తించ లేదంటే; రచయితలపట్ల, రచనలపట్ల మన సమాజంలో యెలాటి దౌర్భాగ్యమైన భావాలున్నాయో గోచరమవుతుంది. నా దృష్టిలో నెహ్రూ ఒక రచయితగానే నాకు మరీ ఇష్టుడు, ఆరాధ్యుడు.

నెహ్రూ ప్రధానంగా సాహిత్యవేత్త కాకపోవచ్చు. 'ప్రొఫెషనల్'గా రచయిత కాకపోవచ్చు. కాని ఆయన కేవలం రాజకీయ నాయకుడు మాత్రమే కాదు. గొప్ప రచయితగా, మేధావిగా, విజ్ఞానిగా, పుస్తకాలు పఠించే సంస్కృతీ పరుడిగా ఆయనకు ప్రముఖమైన స్థానముంది. ఎడతెరిపి లేని రాజకీయ లంపటాల్లోంచి కాస్త విశ్రాంతి దొరికినప్పుడల్లా పుస్తకాలు చదువుతూ కాలం గడిపేవారు. పుస్తకాలు చదువుతూ విజ్ఞానాన్ని మథించేవారు. విదేశాల ప్రయాణం పెట్టుకున్నపుడు, దేశంలో దూర ప్రయాణం చేస్తున్నపుడు చదువుకోడానికి పెట్టెనిండా పుస్తకాలు పెట్టుకునేవారు. ''ఇన్ని చదవగలుగుతానా'' అనే నిట్టూర్పు విడుస్తూనే!

మొట్టమొదటిసారిగా కామన్వెల్తు కాన్ఫరెన్సుకు లండన్ వెళ్ళినపుడు లండన్‌లో పుస్తకాల షాపులు చూసేందుకని మూడు గంటలు కేటాయించుకున్నారు. అక్కడివాళ్ళకు ఆశ్చర్యం గొలిపేటంతగా లండన్‌లోని పెద్ద పెద్ద పుస్తకాలషాపులన్ని తిరిగారు. ఒక షాపులో అంతా తిరిగి ఆస్కారువైల్డు, బెర్నార్డ్‌షా పుస్తకాలు కొని పట్టుకెళుతుంటే, అక్కడివాళ్ళు నోరు తెరుచుకొని చూశారు. పుస్తకాలంటే అంత ప్రేమ, అభిమానం, అభిరుచి ఆయనకు; కొన్న పుస్తకమల్లా చదివే ఓపిక, విశ్రాంతి లేకపోయినా, విశ్వవిద్యాలయాల్లో ఆయన చదివింది సైన్సు, న్యాయశాస్త్రాలయినా, జైలులో సర్వమూ చదివారు. ప్రపంచ చరిత్ర గ్రంథాలన్నీ తిరగేశారట; తిరగేయడమే కాదు, అపారమైన చారిత్రక దృక్పథాన్ని, అనేక విషయములపైన ఒక సమ్యగవగాహనము ఏర్పరచుకొన్నారు. అంతేకాదు. బెర్నార్డ్‌షా, రస్సెల్, ఐన్‌స్టీన్ మొదలైన ప్రపంచ ప్రసిద్ధ భావుకులతో పరిచయం, స్నేహం, వారితో జరిపిన లేఖావళి ఇవన్నీ ఆయన జీవితాన్ని తేజోమయం చేశాయి.

ఒకసారి పత్రికావిలేకరుల గోష్ఠిలో మార్క్సిజం ప్రసక్తి వచ్చినపుడు, ప్రెస్‌వాళ్ళ నడిగారు నెహ్రూ — ''మీలో ఎవరైనా

మార్క్స్‌దాస్ క్యాపిటల్ చదివారా'' అని. అందులో ఎవరికి 'నేను చదివాను' అనే దమ్ములేకపోయాయి ఒక్క నెహ్రూగారికి తప్ప.

ఇన్ని చదివిన ఆయనెప్పుడూ గొప్పలు చెప్పుకోలేదు. అనేక బృహత్తర గ్రంథాలు వ్రాసినవాడైన ''నేనేమి సాహిత్యవేత్తను కాదు. గాకుంటే ఏదో శాస్త్ర జర్నలిస్ట్ బాణీవాడ్ని'' అని మాత్రమే చెప్పుకున్నారు. చాలామంది ఎరుగక పోవచ్చుగాని ఆయనే స్వయంగా తన తండ్రితో కలిసి 1919 లో కొన్నేళ్ళు 'ఇండిపెండెంట్' అనే పత్రికను నడిపిన పాత్రికేయుడు.

ఆయన స్వయంగా వ్రాసిన పుస్తకాలు పదిదాకా వున్నాయి- ఆత్మకథ డిస్కవరి ఆఫ్ ఇండియా, గ్లింసెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ, ఇండియా అండ్ ది వరల్డ్ ది యూనిటీ ఆఫ్ ఇండియా, సోవియట్ రష్యా, చైనా-స్పెయిన్ అండ్ ది వార్ మొదలైనవి. ఇవన్నీ అషామాషీగా చదువుకునేవి కావు; బద్ధకస్తుడు, ఆవులిస్తూ చదువుకోడానికి; కొంటెవాడు లొట్టలేసుకుంటూ ఆనందించుకోడానికి కాకుండా, పాఠకుని దృష్టిని శాస్త్ర విశాలంచేసి సంస్కృతిని పెంపొందించేవి; ఆధునిక వర్తమాన వ్యవస్థకు వజ్రాయుధంలా సీరియస్‌గా వ్రాసిన గ్రంథాలివి.

స్వాతంత్ర్య సమరయోధుడుగా శ్రమించి, నిర్విరామంగా జీవించి, జాతిని జాగృతంచేసి, దేశాన్ని నడిపిన నాయకుని ఉత్తేజకరమైన, వీరోచితమైన జీవితంలోంచి వచ్చిన 'బైప్రాడక్ట్స్'లాంటివి ఆయన రచనలు, అలుపెరుగని, విరామమెరుగని రాజకీయ జీవితం ముళ్లపొదల్లోంచి త్వరత్వరగా కోసుకున్న రాజఫలాల మాదిరిగా ఆయన రచనలు భాసిస్తాయి. క్రియాశీలమైన కల్లోలిత రాజకీయాల్లోంచి శాస్త్ర వెసులుబాటు చేసుకొని కలంబట్టిన కార్యవాది. దేశ రాజకీయాలకు తన జీవితం అంకితం కాకుండా ఉంటే ఒడిదుడుకులు

లేకుంటే కాలం మరింత ప్రశాంతంగా సాగి ఉండినట్లయితే ఆయన మరింత మహారచయితగా భాసించి ఉండేవారు, మరిన్ని వుద్గ్రంథాలు రచించి ఉండేవారు.

ఆత్మకథ, గ్లింప్సెస్ ఆఫ్ ద వరల్డ్ హిస్టరీ, ది డిస్కవరీ ఆఫ్ ఇండియా వంటివి ఆయన రచనల్లో కలకాలం నిలువగలిగేవి, కవిత్వ స్థాయినందుకొని గంభీరంగా, లయాత్మకంగా సాగిపోయే ఆయన వచన రచనల్లో యేదో వింత బలమూ, వెలుగూ వుంది. స్ఫటికం లాంటి స్వచ్ఛతో, పుష్పసౌరభంలాంటి సౌకుమార్యాలతో ఆయన వచన శైలిలో ఒకవింత మనోహారత గుబాళిస్తుంటుంది.

ఆయన ఆత్మకథలో చిరకాలం స్మరణకొచ్చే ఘట్టాలు అనేకం వున్నాయి. తండ్రి మోతీలాల్, భార్యకమల - వీళ్ళగురించి ప్రస్తావన వొచ్చినపుడు ఆయన మాటలతో గీచిన కలం చిత్రాలు మనస్మృతి పథంలో తరచు మెదులుతువుండే విధంగా ఎంతో కమనీయంగా గ్రంథస్థంచేశారు. అట్లానే మహాత్మగాంధీ, రాజా మహేంద్రప్రతాప్ మొదలైన నాయకుల గురించిన ప్రస్తావనలు అందమైన స్ఫటికాల్లాగా పొందుపర్చారు. ఇవన్నీ అందమైన ఆల్బమ్‌లో అమర్చిన చిత్రాల్లాగా గుర్తుంటాయి. ఆయన సంఘటనల్లోని స్ఫూర్తిని మహా విలక్షణంగా గంభీరంగా వర్ణించారు. తండ్రి మోతీలాల్ మరణాంతరం శ్మశానంలో చితిబెట్టి వస్తుంటే అంటాడు- "The stars were out and shinning brightly, when we returned, lonely and desolate.

భార్య కమలగురించి ఎంతో దీనంగా గుండెను పట్టుకొనే విధంగా వ్రాశాడు పలుచోట్ల, ఒకచోట అంటాడు. "Sometimes looking into her eyes I would find a stranger peeping out me, మరోచోట... that face of hers haunting me for long... అంటాడు.

జైలు జీవితంలోని విస్సారమైన దైనత్యాన్ని, చీకటిని, దారుణత్వాన్ని గురించి, చదవాలంటే నెహ్రూ ఆత్మకథను చదవాలి. "జైలులో చాలా విషయాలు మిస్" అవుతాము, అన్నింటికంటె

ముఖ్యంగా ఆడవాళ్ళ గొంతుకల్ని, పసిపిల్లల కేరింతల్ని మిస్ అవుతాం అని అంటాడు ఒకచోట ఏ సంసారి చెప్పగలడీ మాటను.

జైలు కిటికీలోంచి ఆకాశంలో కదలాడే మేఘాలను చూసి భావావేశంతో కవితోద్వేగంతో ఎన్నో మనోహరమైన వాక్యాలు రాశారు. ఆయన సౌందర్యతృష్ణకూ, మనోజ్ఞమైన శైలికీ మచ్చుతునకల్లాంటి ఘట్టాలు అనేకం ఉన్నాయి—వచన గేయాల్లాంటివి.

చెప్పడానికి ఏ కొంతో ఉండి, శక్తివంతంగా ఎలా చెప్పాలో తెలియక, చప్పగా ఎండిపోయిన బెండుల్లాఉండే రాజకీయ రచయితలు మనకు బోలెడుమంది వున్నారు. మరికొందరున్నారు చమత్కారంగా మాటల్ని మలిచే మోసగాళ్లు - ఐతేవారు ఇంకిపోయిన ఆలోచన శక్తితో, మొద్దుబారిన భావుకత్వంతో ఆడంబరాన్ని వొలకబోసే వారు. రచయితగా నెహ్రూ ఎపుడు ఈ కోవకి చెందినవారు కాదు. కలం చేతబట్టినపుడు కూడా ప్రపంచంచేత చెవి యొగ్గి వినిపించేట్లు చేయగలిగే నేర్పు ఆయన రచనల్లో అపారంగావుంది. [illegible] అమేయమైన భావుకత్వంతో పాఠకునిలో భావసంపదను రగిల్చి, వ్యక్తిత్వ పరిధిని విశాలంచేసి శాస్త్రవిజ్ఞానాన్ని మరికొంత వికాసాన్ని కలిగించే నవనవోన్మేషణశాలి కుండాల్సిన ప్రతిభావ్యుత్పన్నత లున్నాయి. వ్రాసే ప్రతివాక్యంలో ఒక వింత శక్తినీ, వెలుగునూ, హుందాతనాన్ని అలవర్చుకున్నాడు. చైతన్య విలసితమైన ఒక స్ఫూర్తీ, చిత్తశుద్ధీ, సంస్కార ప్రయత్నమూ ఆయన రచనలకు సభ్యతా పూర్వకమైన అద్భుతశక్తిని ప్రసాదించాయి. వీటన్నిటికన్నా రచయితగా శ్రీ నెహ్రూ ఒక ఆధునికమైన సమ్యగవగాహన కల్గిన హేతువాది.

అయితే అతని దృక్పథంలో విలక్షణంగా కనబడే ఒక మౌలికత, "ఒరిజినాలిటి" వుందని చెప్పలేము. ఆధునిక భారతీయ రాజకీయ రచయితల్లో అలాంటి 'ఒరిజినాలిటీ' కావాలంటే గాంధీగారి రచనల్లో దొరుకుతుంది. నెహ్రూగారి రచనలు ప్రధానంగా ఆధు

నికమైన సాంఘిక దృష్టినీ, భావజాలాన్ని స్పష్టీకరించేవి, ప్రముఖంగా కీర్తించేవి, ప్రగాఢంగా నొక్కిచెప్పేవి. మౌలికత కాదు గాని, సభ్యత, సంస్కృతి, సౌజన్యం కలిగిన మానవవాణి ఆయన రచనల్లో అనేక చోట్ల వినపడుతుంది.

కలంద్వారా రచయితగాను, కలం లేకుండా రాజకీయజ్ఞుడు గాను నెహ్రూ ఎంతో సాధించారు. ఎంతో చరిత్రను సృష్టించారు. నన్నడిగితే ఆయన కలంద్వారా రచయితగానే ఎక్కువ సాధించారు. నెహ్రూ ఒకరకంగా ప్రపంచం అంతా గుర్తించబడడానికి కారణం రచయితగా ఆయనకున్న ప్రముఖస్థానమే.

దేశభక్తుడుగా, స్వాతంత్ర్య సమరయోధుడుగా పాశ్చాత్య దేశాలకు నెహ్రూ ఏమీకాదు. తన విశ్వాసాలను; నమ్మకాలను; స్వప్నాలను పరిరక్షించి ప్రకటించగలిగి, ప్రపంచదృష్టికి తేగలిగాయి ఆయన రచనలు. శ్రీ హెచ్. జి. వెల్స్‌ను ఒకరకంగా తలదన్నే విధంగా ప్రపంచమానవ మహాచరిత్రను మహా విపులంగా, విశాలంగా సింహావలోకనంచేస్తు బృహత్తర రచనలు చేసిన వ్యక్తిగా, ఒక సువిశాలమైన అంతర్జాతీయ దృక్పథంతో, అభ్యుదయోద్యమాల పట్ల అపారమైన సానుభూతితో అక్షరాభిషేకం చేసిన రచయితగా నెహ్రూ గౌరవనీయులు, స్తవనీయులు, నెహ్రూను భారతీయుడుగా కాక, ఆసియావాడుగా కాక, ప్రపంచపౌరుడుగా, పూజ్యుడుగా నిల బెట్టగలిగేవి ఆయన రచనలుకూడా నంటాను.

చరిత్రను అవలోకన చేశారు. చరిత్రను రచించారు. చరిత్రను సృష్టించారు, చరితార్థులయ్యారు శ్రీ నెహ్రూ.

ఆఖరుగా ఆయన వీలునామాను గురించి తన చితాభస్మాన్ని గంగలో కలపమని, విమానాలమీదనుంచి పొదల్లో వెదజల్లమని కోరినందుకు కొందరు ఆధునికులు ఇదేమిటి చాదస్తం అనీ, ఇదేమిటి అమంగళకరమనీ, అంటే అనవచ్చును కానీ, నాకు మాత్రం ఆయన

వీలునామా, మహాకావ్య ఖండికలాగుంది. అరబ్ కవి ఖలీల్ గ్రాన్ గారి 'మరణసౌందర్యం' అనే బృహత్తర గేయం జ్ఞాపకానికొచ్చింది.

అంతేకాదు తన నాటకాలతో, ప్రపంచాన్ని ఒక ఊపు ఊపిన బెర్నార్డ్ షా కూడా దాదాపు ఇదే కోర్కెను కోరాడు. తన వీలునామాలో ఆయన కూడా తన భార్య చితాభస్మాన్ని ఒక పేటికలో భద్రపరచుకున్నవాడే, తన చితాభస్మాన్ని తన భార్య చితాభస్మంతో కలిపి తన గృహాంగణమందుండే తోటలో చల్లమని సూచించాడు. ఆ తోటంటే ఆయన కెంత మక్కువ.

అట్లానే 15 వ శతాబ్దపు బహు గ్రంథకర్త, సంస్కృత పండితుడు అయిన అప్పయ్య దీక్షితులు తన చితాభస్మాన్ని నటరాజ నగరమైన చిదంబరం వీధుల్లో చల్లించమని తన శిష్యులకు ఆదేశించాడు. నటరాజ దర్శనానికై వొచ్చే కళాప్రియుల పాదధూళితో తాము కలసిపోవాలని ఆయన తహ తహ లాడేవారు.

బండి గోపాలరెడ్డి

## వేమనపై 'నార్ల' గారి రెండు ఆంగ్ల గ్రంథాలు

మొదటినుండి మన సనాతనులచేత అనాదరింపబడుతూ వచ్చిన వేమన-పాశ్చాత్య పండితులు చేసిన పరిశీలన-

తెలుగు మహాకవి వేమన్నపై ఇంగ్లీషులో ఇటీవల రెండు మంచి గ్రంథాలు వెలువడ్డాయి. ఈ రెండు కూడా ఆంధ్రజ్యోతి సంపాదకులు శ్రీ నార్లగారు వ్రాసినవే. ఒకటి "Vemana - by V. R. Narla"- వేమన జీవిత సాహిత్యము గూర్చి ఉన్నంతలో సర్వ సమగ్రంగా, సమ్యగావగాహనతో కూలంకషంగా చర్చించిన గ్రంథం. ఢిల్లీ కేంద్ర సాహిత్య అకాడమీవారు 'మేకర్స్ ఆఫ్ ఇండియన్ లిటరేచర్' (Makers of Indian Literature) శ్రేణిలో ప్రచురించిన గ్రంథము.

రెండవది Vemana through western eyes ! Edited by V. R. Narla. ఎం. శేషాచలం అండ్ కో వారు ప్రచురించారు. వేమనగూర్చి పాశ్చాత్యపండితులు – ఫ్రెంచి సన్యాసి జి. ఎ. డుబాయిస్ (G. A. Dubois), బ్రౌన్, మెక్డోనాల్డ్, గోవర్, కాంప్‌బెల్, హెన్రీబవర్స్ ముర్డాచ్, బార్నెట్, గ్రిఫిల్, సి. ఆర్. రెడ్డి వగైరాలు రాసిన రాతలన్నిటిని నార్లగారు సేకరించి విపులమైన పీఠికలో ఈ గ్రంథ రూపములో సంకలనము చేసారు.

ఇంతకాలము అణగద్రొక్కబడి యుండినాడా ? కాక మరి ఏమిటి అంటారు నార్లగారే. మన తెలుగు సాహిత్య చరిత్రకారు లెవ్వరు. ఇటీవలి కాలముదాకా వేమనను మహాకవిగా అటుంచి అసలు కవిగానే పేర్కొనలేదు అని సాక్ష్యాలను అందిస్తున్నారు చూడండి నార్లగారు.

గురజాడ శ్రీరామమూర్తి ఆంధ్రకవుల జీవితములోగాని 1899 లో కందుకూరి వీరేశలింగం పంతులుగారు వెలువరించిన ఆంధ్రకవుల చరిత్రము లోకాని వేమన ప్రస్తావననే కానరాదు

తన ఈ కవుల చరిత్రలో ఎందరో మైనర్ కవులను, పిల్ల కవులను మరుగుపడిన మరగుజ్జకవులనుగూర్చి పేజీలు పేజీలు వ్రాసిన వీరేశలింగంగారు వేమనగూర్చి పూర్తిగా వదిలివేసినారు. ఎన్నో చేర్పులతో 1917 లో మళ్ళీ ఈ గ్రంథము ద్వితీయ ముద్రణ వెలువడి మొత్తం 220 కవుల చరిత్రగా విస్తరిల్లి అప్పుడు సైతం వేమన్న ఎక్కడా కానరాడు.

ఇంకా ముందుకు వెళ్ళి ఈ గురజాడ శ్రీరామమూర్తి వీరేశలింగం గార్లకంటే ముందు వెళ్ళి చూచినా అంతే. దాదాపు భారతీయులు వ్రాసిన తొలి ఇంగ్లీష్ గ్రంథాలలో ఒకటైన కావలి వీరాస్వామిగారు 1829 లో ప్రచురించిన (Biographical Sketches of Duccon Poets). దక్కను కవుల జీవిత చిత్రణలో మొత్తం 108

కవులగూర్చి అందులో తెలుగు కవులైనవారు 44 మంది గూర్చి వ్రాసి ఉంటే వీరిలో కూడా మన వేమన రాసరాడు.

ఇట్లా మన తెలుగు సాహిత్య చరిత్రకారులు, పండితులు వేమన పట్ల మౌనమే వహించినారు. ఏకో కుట్ర పన్నినట్లు ఆయన్ని బొత్తిగా ఎరగనట్లే దాటివేసారు. ఆయన్ని గూర్చిన రెఫరెన్స్ - ప్రశంస కాని దూషణ కానీ మన కెక్కడ మిగల్చకుండా చేసారు. దీన్ని నార్ల గారు amazing conspiracy of silence అన్నారు. 1914 లో సి. ఆర్. రెడ్డిగారు తన కవిత్వ తత్వ విచారంలో తొట్టతొలుతగా వేమన్నకు మహాకవి పీఠమిచ్చి పేర్కొన్నంతవరకు తెలుగు సాహిత్య విమర్శకుడు ఎవడూ వేమన పేరు ఉచ్చరించనే లేదంటారు నార్ల గారు. ఆశ్చర్యంగా లేదా? కనువిప్పుగా లేదా ఈ విషయం.

అంతేకాదు ఈ విషయం కూడా గమనార్హమైందే.

వేమన్న పద్యాలు క్రోడీకరించి ఇంగ్లీష్ తర్జుమాలతో మొదట ముద్రించిన మహానుభావుడు సి. పి. బ్రౌన్. బ్రౌన్ గారి వేమన పద్యాలు గ్రంథం - The Verses of Vemana; Moral religious and satirical - 1829 లో మొట్టమొదట మద్రాసు కాలేజీ తరఫున 500 కాపీలు అచ్చువేయటం జరిగినది. రచయిత బ్రౌన్‌కు బహుమాన పురస్కారంగా ఇచ్చిన 50 కాపీలు పోను మిగిలిన 450 కాపీలు మార్కెట్‌లోకి పోకుండానే మిస్టీరియస్‌గా మాయమైపోయాయి. పదేళ్లు పట్టింది బ్రౌన్‌కు ఈ విషయం కనుక్కోనేందుకు. కాలేజీబోర్డులో ఉండే సనాతన పండితులలో పాయికారీతనంతో ఆ కాపీలన్నీ వేస్ట్ పేపరు క్రింద కట్టలు కట్టి లైబ్రరీలంబర్ గదిలోపల పడవేయడం జరిగిందట. 1866 లో వ్రాసిన ఆత్మకథలో బ్రౌన్ గారి సొంత వాక్యాలే ఇందుకు సాక్ష్యం.

"In 1829 I had printed Vemana. As this Author Satirizes Brahmans they dislike or scorn his volume and at their desire the College Board shelved it, and it was forgotten About 50 copies were given me, and 450 disappeared. After ten years I discovered these rolled up as waste paper in the library. I then took steps to Publish Vemana; the book became popular among those who were learning either Telugu or English. It was a Juvenile effort and I have since remodelled several pages........My publishing Vemana's diatribes aginest Brahmans, and my cherishing Jangam Literature which they shun proved my antipathy to Hindu idolatry."

1839 లో ద్వితీయ ముద్రణ పొందిన సి. పి. బ్రౌన్ గారి వేమన పద్యాల గ్రంథంపై సమీక్ష పూర్వకంగా మెక్డొనాల్డ్ 1866 లో మద్రాస్ జర్నల్ ఆఫ్ లిటరేచర్ సైన్స్ పత్రికలలో ఒక సుదీర్ఘమైన స్వతంత్ర వ్యాసమే వ్రాసారు.

ఆ ప్రారంభ దినాల్లో వేమన పద్యాలను ప్రభుత్వ పాఠశాలలలో పాఠ్యాంశంగా చేర్చినప్పుడు పెద్ద గొడవే జరిగినట్లున్నది. చిత్తశుద్ధితో వేమన - పాఠాలను సరిగా చెప్పకుండానే అయ్యవార్లు దాటవేసారని, ముఖ్యంగా సనాతన సంప్రదాయాలను, మతాచారాలను, వేదాలను, పురాణాలను తూలనాడుతూ వేమన చెప్పిన పద్యాలను మరీ ముఖ్యంగా బహిష్కరిస్తు వచ్చారని యీ విధంగా సంప్రదాయపరులు పెద్ద అలజడినే రేపినట్లు మేక్డోనాల్డ్ వ్యాసంలో గ్రహించవచ్చు.

ఇట్లాంటి అలజడులను దృష్టిలో పెట్టుకునే మొత్తం ఇంగ్లీషు, తెలుగు, తమిళ పాఠ్యగ్రంథాలను రివైజు చేసేందుకు సూచన లివ్వవలసిందిగా ప్రభుత్వం ఒక కమిటిని మెక్డొనాల్ట్ అధ్యక్షతన నియమిస్తుంది. ఇందులో తెలుగు పాఠ్యగ్రంథాలపై రిపోర్టు తయారు చేసే భారం తెలుగు ప్రాంతాల్లో స్కూలు ఇన్స్పెక్టరుగా ఉంటుండిన హెన్రీబవర్స్‌పై పడుతుంది. ఈయన వేమనను మెచ్చుకుం

టూనే, హిందూ నూతన అభిమాన, దురభిమానాలకు ఎందుకు దెబ్బతగిలేటట్లు ప్రభుత్వం వ్యవహరించాలనే ఉద్దేశ్యంతో వేమన పద్యాలు పాఠ్య గ్రంథాలనుండి తొలగించమనే తీర్పు ఇస్తాడు. ఈ రిపోర్టును 1874 లో మద్రాసు ప్రభుత్వ ప్రెస్సు ముద్రించి ఉంది. బైబిల్ను తూలనాడే భాగాలను మనం ఒప్పుకోనట్లే, వేదాలను, హిందూమతాన్ని, బ్రాహ్మణ్యాన్ని నిందించే వేమన పద్యాలను మన మెందుకు పాఠ్యాంశలుగా వుంచాలంటూ 'ముర్డాబ్' అనే ఆయన కూడా వేమన విషయంలో వంత పాడ్డాడు.

ఈ రకంగా నూరేళ్ళక్రిందటే వేమనను అణగద్రొక్కేందుకు ఎన్నో రకాల ప్రయత్నాలు కొనసాగాయి. అయినాసరే వేమనపై పాశ్చాత్య పండితుల దృష్టి పలురీతులుగా పడ్తూనే వస్తుండేది. 1871 లో గోవర్ ప్రచురించిన – "ది ఫోక్ సాంగ్స్ ఆఫ్ సదర్న్ ఇండియా"లో వేమనకు స్థానం లభిస్తుంది. తర్వాత విన్సెంట్ స్మిత్ "ఆక్స్ ఫర్డ్ హిస్టరీ ఆఫ్ ఇండియా" వ్రాసేటప్పుడు కుల వ్యవస్థను గూర్చి తీక్షణంగా విమర్శించిన భారతీయుణ్ని ఎన్నుకోవాలనుకొన్నప్పుడు ఆయన గోవరీ పుస్తకం నుండి నాలుగు వేమన పద్యాలను తప్ప మరొకర్ని వుల్లేఖించలేకపోయారు.

తర్వాత 1898 లో మద్రాసు క్రిస్టియన్ కాలేజీమాగజీన్ లో W. M. కాంబెల్ గారు వేమనపై మరో ఉదాత్తమైన వ్యాసం సుదీర్ఘమైనది ప్రచురించారు.

మెక్డోనాల్డ్ వేమన గూర్చి వ్రాసిన వ్యాసం చూడండి.
In the whole range of Telugu Literature there is perhaps no author whose writings have attracted so much notice among Europeans, as those of Vemana. మొత్తం తెలుగు సాహిత్యంలో యూరోపియన్లను ఆకర్షించినంతగా మరొకరివి లేవోమో, ఈ మాట బహుశా ఈనాటికీ నిజమే.

ఇటీవలి కాలంలో వేమన గూర్చి ఇంతటి ఆధునికమైన అవగాహనతో కొనసాగిన పరిశోధన, పరిశీలన మరొకటి లేదేమో, నార్ల గారు ఇందుకు బహుధా అభినందనీయులు. పైన పేర్కొనబడిన ఆయన వ్రాసిన ఈ రెండు గ్రంథాలు ఆంధ్రేతరులకు ఉద్దేశింపబడినవే అయినా ఇంగ్లీషు తెలిసిన తెలుగు సారస్వతీయులు అవశ్యం చదువవలసిన ఉత్తమ గ్రంథాలు.

నార్ల గారు పేర్కొన్నట్లు తిరువళ్ళువార్‌ను రాజాజీ, కబీరును, టాగూర్ అనువదించినట్లుగా, వేమన పద్యాలను ఆంగ్లంలోకి దీటుతో తర్జుమా చేయగలిగిన అనువాదకుడు ఇంతదాకా లేక పోవడం పెద్దకొరతే. ఆ కొరత సమీప భవిష్యత్తులో తీరగలదని ఆశిద్దాం—బంగోరె.

## కన్యాశుల్కంలోని బహుముఖ విషయములు —

కన్యాశుల్కం మీద జరగవలసిన సెర్చి ఏమిటంటారా? ఈ పదివాక్యాలు చదవండి. కూలంకషంగా వ్యాసాంగం చేసినట్లయితే, గురజాడ సృష్టించిన కన్యాశుల్కం, ఆంధ్రనాటక వాఙ్మయంలోనే కాకుండా, భారతీయ భాషానాటక వాఙ్మయ ప్రపంచంలో ప్రధమ శ్రేణిలో ప్రకృష్టస్థానాన్ని ఆక్రమిస్తుంది. నాటక చరిత్రను, తెలుగులో నాలుగుమూలలు గాలించడానికి పరిశోధకులకు ఎంత శుల్కం ఇచ్చినా, యింత సలక్షణమైందీ లోకోత్తరమైంది. అయిన నాటక కన్య లభించడం అసాధ్యం. ప్రాచీన భారతీయం నాటక సాహిత్యంలోను ప్రాశ్చాత్యనాటక సాహిత్యంలోను ప్రత్యభివక్తమైన సంస్కారాన్ని జీర్ణించుకున్న ప్రతిభాశాలి. గురజాడ ఆ సంస్కారాన్ని తెలుగు సాహిత్యక్షేత్రంలో అనుపమానంగా సమ్మేళనం చేసి, నవ నవోన్మేషనంగా ఈ నాటకాన్ని సృష్టించారు. గతానుగతికంగా అనువాదపథకాన్ని ఆమూలాగ్రంగా అనుసరించే ఆంధ్ర నాటక చక్రాన్ని సహజమైనది. జాతీయమైనది అయిన స్వతంత్రపదకానికి మరల్చినది కన్యాశుల్కమే. ఈ మాటలు ఛాందస పండితుడని పేరు

పడిన శ్రీ నిడదవోలు వెంకటరావుగారిది. అంతేకాదు ఆయన ఇంకా అన్నవాక్యాలే ముఖ్యమైనవి. కన్యాశుల్క నాటకం కేవలం నాటకమే కాదు. అది ఆనాటి తెలుగువారి రాజకీయ, సాంఘిక సాహిత్య జీవనానికి అద్దంవంటిది. సంఘంలో కరడుగట్టిన దోషము లనేగాక, పాశ్చాత్య నాగరికతా సంఘర్షణలో సంఘపరిస్థితులు, చరిత్ర చక్కగా నిరూపించే ఒక విజ్ఞానకోశంవంటివి ప్రతిపదం ఒక చరిత్రతో, ఒక అద్దం తో ణిలాసుతు ఉంటుంను. కన్యాశుల్కం యొక్క ఈ లోకోత్తర విశిష్టత తెలుసుకొనవలెనంటే మనం దీనిని వొక సమగ్రమైన విపుల వ్యాఖ్యానం రచించవలెను. ఇంగ్లీషులో షేక్స్పియర్ ముప్పైయ్యేడు నాటకాలన్నిటికి ఇట్టి వ్యాఖ్యానము లున్నవి. ఆ ముద్రణలకు, ధేరియోరమ్, యెడిషన్లని పేరు. తెలుగులో షేక్స్పియర్ వంటి అప్పారావుకు అతని నాటకం ఒక్కటే అయినా అట్టి సమగ్ర వ్యాఖ్యానం లేదు.

మనకి వచ్చిన విమర్శలలో వాద ప్రతివాద వివాదాలు తప్ప, శబ్దార్థ విచారణ లేనేలేదు. ఈ విధంగా శబ్దార్థం విచారణ చేసి వ్రాయవలెనన్న ఆ గ్రంథం వేయిపుటలకు పైగా అవుతుంది. అప్పుడే ఆ నాటకం గొప్పతనం తెలుస్తుంది. ఒక్కొక్క వ్యాసంలో ఒక్కొక్క పదంలో ఎంతో అర్థం ఇమిడివుంది. మచ్చుకు ఒకటి రెండు మాత్రమే అటూ రెండు వుదాహారణలిచ్చి చర్చిస్తారు. నిడదవోలుగారు "ఈ రీతిగా ఒక్కొక్క వాక్యంలో ఒక్కొక్కపదంలో ఎంతో చరిత్ర కన్యాశుల్కంలో గర్భీకృతం ఐవుంది..." అని శెలవిచ్చారు ఆచార్య వెంకటరావుగారు ఏమిటి కన్యాశుల్కంలో పదపదంలో వాక్య వాక్యంలో యిమిడి ఉన్న ఆ చరిత్ర? (1) గిరీశం వెంకటేశంకు చెప్పిన టెక్ట్స్‌బుక్స్‌లిస్టులో ఆఖరున వెంకటసుబ్బారావు, మేడీజీ కుప్పుస్వామి అయ్యర్స్ మేడ్ డిఫికల్ట్ అంటారు. ఏమిటీ పుస్తకాలు? ఎవరీ వెంకటసుబ్బారావు. మేడీజీలు వ్రాసిన వెంకటసుబ్బారావు నిజంగా చరిత్ర పురుషుడేనా? లేక కల్పితవ్యక్తేనా? కల్పిత వ్యక్తి కాదు. అక్షరాల చరిత్రపురుషుడు. ఆంధ్రుల ముద్దుబిడ్డ. గిరీశం

ధోరణిలోనే చెప్పాలంటే ఒక్క– వెంకటసుబ్బారావ్స్ మేడీజీ– అనే పదంమీదనే గంట లెక్చరివ్వవచ్చును! ఎన్నో వివరాలు లభించాయి. (2) "కన్యాశుల్కం టేమిటి, మల్బరీ దాని విషయమై చాల ఎస్సేస్ వ్రాశిందు అంటాడు. గిరీశం, ఎవరీ మల్బరీ. ఈ మల్బరీ ఎవరో నెల్లూరులో నా కొక్కరు చెప్పలేకపోయారు. అడయార్ లైబ్రరీలో మల్బారీమీద ఒక అరడజను పుస్తకాలు లభించాయి. లార్డ్ రిప్పన్ హయాంలో ప్రఖ్యాత బొంబాయి జర్నలిస్టుగా, సంఘ సంస్కర్తగా, రచయితగా ప్రసిద్ధిపొందిన పార్శీవ్యక్తి మల్బరి. (3) బారోస్ రీడర్లో చదవానంటాడు – వెంకటేశం ఎవరీ బారో? రీడర్లు వ్రాసిన బారో? వీరేశలింగం స్వీయచరిత్రలో వచ్చే బారో ఈ బారో ఒకరేనా? రాజమండ్రిలో 1870 ప్రాంతంలోనే, గోదావరి విద్యా ప్రవర్ధని, అనే పత్రికను నడిపిన బారోదొరగారేనా? అవును దాఖలాలు దొరకాయి (4) అది రిఫార్మర్లో అచ్చువేయించేసరికి, టెన్నిసన్ చూచి గుండె బాదుకున్నాడు అంటాడు గిరీశం. రిఫార్మర్ అనే పత్రిక ఉండిందా? వుంది. తొలుత హిందూ వారపత్రికగా ప్రారంభమైనప్పుడు, అందులో పనిచేస్తుండిన స్టాఫ్ కొందరు–హిందూ పత్రిక మితవాద పాలసీ నచ్చక చీలిపోయి, కామాక్షి నటరాజన్ క్రింద, ది ఇండియన్ సోషల్ రిఫార్మర్ అనే పత్రిక నడిపారు. మద్రాసునుండి బొంబాయికి తరలించబడి తర్వాత రెనడే, గోఖలే లపై కూడా కాలుదువ్విన సర్వ స్వతంత్రపత్రిక. (5) ఇక గిరీశం చెప్పిన (గురజాడ అల్లిన ఇంగ్లీషు పద్యం 'విడో'కు మాతృక అవదగిన పద్యం ఉందా? అక్షరాల ఉంది. ఒక విస్మృత ఆంగ్ల రచయిత్రి వ్రాసిన మై మదర్, అనే పోయమ్ మాతృక బయటకి తీయడమైనది. (6) స్కార్లెట్ దొరగారిని మెప్పించిన ముండాకొడుకును నాకు 'లా' రాకపోతే ఈ గుంట వెధవల కటాయ'లా' వస్తుంది?___

అంటాడు నాయుడు, రామప్పంతులతో ఎవరీ స్కార్లెట్? ఏమిటీయన దొరతనం? అద్భుతమైన వ్యక్తి! 1834లో నెల్లూరు ప్రిన్సిపల్ కలెక్టరుకు హెడ్ అసిస్టెంట్ మేజిస్ట్రేటుగా పనిచేసిన

వాడు. ఈ అనుభవాలలో అప్పటి తెలుగుజిల్లాల సివిల్ అడ్మినిస్ట్రేషన్ వ్యవహారాలపైనే వొక గ్రంథం అద్భుతమైన గ్రంథం రాశాడు. ఇందులో నెల్లూరు రెఫరెన్సులు కూడా వున్నాయి. ఇది ఇంగ్లండులో అచ్చయిన గ్రంథం. ఇల్లా డజన్లకొద్దీ వున్నాయి. కన్యాశుల్కంలో విడగొట్టవల్సిన 'గ్రంథ గ్రంథులు'. ఇంతే కాదు. ఇక పద్యాలు. పద్యాల తునకలు; గిరీశం చదువుకుంటూ వెళ్తాడు – "పూజారివారి కోడలు తాజారగ బిందెజారి జర్రున పడియెన్" అంటాడు గిరీశం ఎక్కడదీ పద్యం? శ్రీనాథుడిది. "తవణింపుచున్నతి కాలకంఠ పాకాటా రిట్టల ప్రతోళీమిళ"–అని యింకో పద్యం వెంబడే ఇదీ శ్రీనాథునిదే దాఖలాలు దొరికాయి. "నలదమయంతు లిద్దరు మనఃప్రభవానల దహ్యమానులై"–అనే పద్యం చదవమంటాడు గిరీశం వెంకటేశాన్ని ఇదెక్కడిది? నన్నయ భారతం నలోపాఖ్యానంలోది. "కాముని విరిశరముల బారికి నే నెటులోర్తునో చెలియా!"—అనే జావళీ కూనురాగం తీస్తు గిరీశం ప్రవేశిస్తాడని వుంది. ఎవర్దీ, ఎక్కడ్దీ జావళి, మిగతా చరణాలేమిటి? ఇదీ దొరికింది.

"ఇంతలు బదరీ ఫలములు,
ఇంతలు మారేడు పళ్ళ యీడుకుజోడై
బంతులు తామర మొగ్గలు
దంతికుచ కుంభముల బోలు తరుణీ కుచముల్"

అని గిరీశం గ్యాసుకొడ్తూ వొక పద్యం చదువుతాడు. రెండో ముద్రణలో–గిరీశం గడగడ చదువుతాడు—

నదమా పొక్కిలి జాంబూ
నదమా మెయిఛాయ, కోకనదమా పదమా
వదమా జడ నడుము వియ
త్పదమా నూగారు గూడ పదమా చెలికిన్.

ఇది మంచి తిమ్మకవిగారి రసికజన మనోభిరామంలోది.

ఇట్లనే,

"చుక్కల వలె కర్పూరపు
ముక్కలవలె నీదు కీర్తి ముల్లోకములన్
క్రిక్కిరిసి పిక్కటిల్లెన్........"

ఇది అడిదం సూరకవిగారిది. ఇట్లా ఎన్నో ఎన్నో రెఫరెన్సులు స్ఫుటకింపులు.

ఇక ఇంగ్లీషు కొటేషన్లు కన్యాశుల్కం మొదటి సీన్లోనే "It is women that seduce all man kind" అంటాడు గిరీశం ఎవరిది? షేక్సిపియర్‌దా? మిల్టన్‌దా? లేక గురజాడదా? Can love be controlled by advice will cupid our mothers obey ఇదెక్కడిది ఈ మూలాలు బయటకు లాగడం జరిగింది. ఇక భాషావిషయం తీసుకుందాం. ఎన్నిపదాలు లుబ్ధావధాన్లు "జాపోయుచు" కరటకశాస్త్రి —"కొంపలర్థగు యిది నాతో తిరుగుతూ ఉంటే – అంటాడు. కొంప–అంటే? బ్రాత్రపోతం, బాడికరాముడు, గొట్టాలమ్మ, టర్రు కొట్టేశారు, గుడ్డె, భుక్త – ఎన్ని విజయనగరం మాండలిక పదాలు, ఎన్నిజాను తెలుగుపదాలు నిఘంటువుల కెక్కని పదాలు. పండితులకి తెలియకుండా, పామరులకు బాగా తెలిసిన పదాలు. కన్యాశుల్కంలో ఎన్నున్నాయి? వాటి అర్థ మేమిటి? ఇక ఎన్ని సామెతలు, నుడికారాలు, జాతీయాలు వాడారు? వాటివెనుక చరిత్ర గతించిన చరిత్ర సంప్రదాయాలు ఎన్ని సూచనప్రాయంగా వస్తాయి?

ఇట్లా యిట్లు కన్యాశుల్కంలో వివరించి వ్యాఖ్యానా లిచ్చి చెప్పవలసిన అంశాలు బోలెడున్నాయి. ఇక యింత అయిన తర్వాత అసలు కన్యాశుల్కం నాటకమేనా? అది నాటకము కాదు? ప్రహసనము కాదు; వొట్టి ఫార్స్. పొమ్మన్నాడు డాక్టరు కీతవరపు రామకోటిశాస్త్రి. సంస్కృతి నాటకపద్ధతుల్నిబట్టి చూచినా యిది అద్భుత నాటకమే పొమ్మన్నాడు మహానుభావుడు శ్రీపాద కామేశ్వరరావుగారు. ఇక యింగ్లీషుపద్ధతుల్నిబట్టి చూసిన అమోఘ

మైన నాటకం పొమ్మన్నారు. సోమయాజుల వెంకటరామమూర్తి ప్రపంచ నాటకరంగంలో, కన్యాశుల్కం పాత్ర యేమిటి – తేల్చి చెప్పారు మహానుభావుడు సి. ఆర్. రెడ్డిగారు. కన్యాశుల్క కన్నడ అనువాదానికి పీఠిక వ్రాస్తూ, డ్రామా యిన్ ది ఈస్ట్ అండ్ వెస్ట్ అనే వుపన్యాసంలో యింత విమర్శ సాహిత్యం వుంది కన్యాశుల్కం పైన.

ఇన్ని బహుముఖ విషయములను ఒక క్రమబద్ధమైన కోణంలో చర్చిస్తూ కన్యాశుల్కం మొదటి ప్రతిని Scholar's Edition (స్కాలర్స్ ఎడిషన్)గా ప్రచురించాడు. మీ బంగోరె సాహసమే అనుకోండి. ఇది నూరు పేజీలు నాటకమైతే ఇంకో నూరు పేజీలు వివరణలు. వ్యాఖ్యలిచ్చి కన్యాశుల్కంలోని ఈకకు ఈక, పీకకు పీక పోల్చి చర్చించాడు. ఎట్లుందో చెప్పాల్సింది పాఠకులు,

ఈ పరిశోధన కంతటికి వొకవిధంగా మూలబీజం – జమీన్ రైతు. ఎట్లంటారా? ఆనాడు జమీన్ రైతులో వచ్చిన నూరేళ్ళ నాటి గిల్లూరు విషయములను పరిశోధించేందుకు జమీన్ రైతు బంగోరె మద్రాసు వెళ్ళకపోతే యిప్పుడిదంతా సాధ్యమయ్యేది కాదు. ఈ కృషిలో ఆరుద్రగారి అనన్యమైన పర్యవేక్షణ సహాయము, సరే యిక కె. వి. రమణారెడ్డిగారినుండి పొందిన ప్రేరణ దీనికంతా మూలమనుకోండి. జమీన్ రైతులో రెండు వారాల నుంచి పూరిస్తూ వచ్చిన ప్రకటన వెనుక యింతగొడవ వుంది. ఇక నేరుగా ఆ ప్రతిని మీరు చదువుకోవచ్చు మార్కెట్లో కొనే అనుకోండి.



శ్రీహరికోట దీవులను గూర్చి యీవారం 'జమీన్ రైతు'లో జి. సి కొండయ్యగారు ఒక వ్యాసానికను వ్రాశారు. ఈ మధ్యనే మన అణుశక్తి ఉత్పత్తి కేంద్ర అధిపతి శ్రీ విక్రమ్ సారాభాయి ప్రత్యేక డకోటా విమానం మీద శ్రీహరికోట దీవుల్ని చూసి వెళ్ళారు. అంతకుముందు కొందరు అణుశక్తి యింజనీర్లు వచ్చి యీ శ్రీహరికోట దీవుల్ని కూలంకషంగా సర్వే జరిపిపోయారు. ఇంకొన్నాళ్ళలో కాలం కల్సివస్తే, శ్రీహరికోట దీవులకు మహర్దశ పట్ట బోతున్నది.

రాకెట్ ప్రయోగ కేంద్రాన్ని యీ శ్రీహరికోట దీవుల్లో ఏర్పర్చడమన్నది దాదాపు ఖాయమైనట్లే వున్నా - మద్రాసువాళ్లు దీనికి కూడా పోటీపడి చెంగల్పట్టు జిల్లాలోనో, తిరునల్వేలి జిల్లాలోను మరొక ప్రాంతాన్ని సూచిస్తున్నారు. ముందుకు తోస్తున్నారు. ఈ రెంటిలో ఎక్కడ పెట్టాలనేది రాజకీయంగా యింకా నిర్ధారణ కాకపోయినా, సాంకేతికంగా ఈ రాకెట్ స్టేషన్‌కు శ్రీహరికోటే ఖాయం కావచ్చు.

ఏమైనా యింతకాలం అనామకంగా దిక్కూ మొక్కూ లేకుండా నాగరికతకు దూరంగా అడవివంటి దీవిగా పడివున్న ఈ ప్రాంతానికి విశేష ప్రాముఖ్యత రాబోతున్నది. నూరేళ్ళనాటి పోలీస్ రిజర్వ్ యిన్‌స్పెక్టర్ మైక్రల్ స్మృతి గ్రంథంలో ఈ శ్రీహరికోట దీవులనుగూర్చి మైక్రల్ పలుసార్లు ప్రస్తావించారు. ఇది వుపోద్ఘాతం.

## అసలు విషయం చదవండి

పోలీస్ రిజర్వు యిన్‌స్పెక్టరు డ్యూటీల్లో ప్రధానమైంది - నెల్లూరు హెడ్‌క్వార్టర్స్ ట్రెజరీనుండి రెవిన్యూ కలెక్షన్ డబ్బును మద్రాసుకు తీసికెళ్ళడంకూడా ఒకటి. మైక్రల్‌పై ఈ బాధ్యత

3 పర్యాయాలు కాబోలు పడ్డది. ఈ 3 పర్యాయాల్లోనూ నెల్లూరు నుండి మద్రాసుకు 4 లక్షలకుపైబడిన ట్రెజరీ డబ్బును మోసుకు పోయారు ప్రైరల్.

ఒక హెడ్ కానిస్టేబుల్, ఒక డిప్యూటి కానిస్టేబుల్, 16 మంది పోలీసు కానిస్టేబుల్స్‌తో కూడిన వారి గార్డు బృందాన్ని కూడా ప్రైరల్ యీ ట్రెజరీ డబ్బు వెంట తీసుకెళ్ళేవాడు. ఆ రోజుల్లో రైలుమార్గం లేదు. ఇంతడబ్బును మద్రాసుకు తీసుకెళ్ళడ మంటే మాటలుకాదు.

నెల్లూరునుండి కృష్ణపట్నందాకా 18 మైళ్ళు రోడ్డుమీద ప్రయాణంచేసి, అక్కడనించి బకింగ్‌హామ్ కాలవలో పడవలమీద శ్రీహరికోటదాకావెళ్ళి, అక్కడినుంచి పులికాట్ సరస్సులో ప్రవే శించి, మళ్ళీ కాల్వలో ఎన్నూర్ మీదుగా మద్రాసు చేరుకునేవారు. యిందుకోసం రెండు పెద్ద నాటుపడవలు ప్రభుత్వం కేటాయించింది-ఈ ట్రెజరీ డబ్బు మోసుకొని పోయేదాని కోసంగానే ఒక పడవ మీద సగం మొత్తంపెట్టి అందులో ఒక హెడ్ కానిస్టేబుల్, 8 మంది కానిస్టేబిల్స్‌ను జతచేసి, రెండో పడవమీద మిగతా మొత్తం ఉంచి, ప్రైరలు మిగిలిన పోలీసుబృందం ఎక్కేవారు.

కాలవమీద శ్రీహరికోట ప్రాంతం చేరేటప్పటికీ, అడవి గడ్డి మేస్తు, స్వేచ్ఛగా తిరిగే పశువులమందలు కనపడేది. ఈ అడవిగడ్డి మేస్తు, ఏ యజమాని మచ్చిక ఎరుగని ఈ పశువులు క్రూరంగా కనబడేవి. ఈ దీవిలోకి యీ పశువులెట్లు వచ్చాయో అర్థమయ్యేది కాదు.

శ్రీహరికోట దాటగానే పులికాట్ సరస్సులో ప్రవేశించటం జరుగుతుంది. చాలామందికి తెలియకపోవచ్చును—ఈ దీవిలో తొలుత మరుగుజ్జులనే ఒకానొక వింతమనుష్యజాతి నివసిస్తుండేది. పాము విషయాలపై పరిశోధన జరిపిన డాక్టర్ షార్ట్ మానవజాతి తెగలకు సంబంధించిన శాస్త్రవిషయాలపై కూడా పరిశోధనచేస్తూ

ఈ దీవిలో యుక్తవయస్సుకు వచ్చిన ఒక పడుచుస్త్రీ బరువు కేవలం ముప్పైఆరుపౌన్లు మాత్రమే వుండినట్లుగా షైర్రల్ పేర్కొంటాడు.

కొన్ని ఋతువులలో పులికాట్ సరస్సునిండా పుష్కలంగా చేపలు కనబడుతుంటాయి. రాత్రులపూట ఈ చేపలు పడవలోకి ఎగిరెగిరి పడుతుంటాయి. ముఖ్యంగా పడవల్లో లైట్లు వెల్గుతుంటే మరీ త్రుళ్ళిపడి, ఎగిరి పడ్తుండేవి. ఒకసారి మొదటిపడవలో యిట్లా 132 చేపలు ఎగిరిపడ్డాయి, షైర్రల్ ఉండిన పడవలో 82 చేపలు ఎగిరిపడ్డాయి. ఈ చేపలు పడవల్లో ఎగిరిపడ్తుంటే కానిస్టేబుల్స్ కిలకిలమంటూ జవురుకునేవారు. రాత్రిపూట నల్లటినీళ్ళల్లో యీ చేపలు నల్లటి నక్షత్రాల్లా త్రుళ్ళిపడ్తుండేవి. ఈ దృశ్యం ఎంతో రమణీయంగా, చిరస్మరణీయంగా వుండేవంటాడు షైర్రల్. కొన్ని చేపలు బరువు వీసెడుకూడా వుండేవట. ఒకసారి తనపడవపై మంచంపై పడుకొనివుంటే ఒక పెద్దచేప ఎగిరిపడ్డదట. తర్వాత రోజు ఉదయం ఎన్నూరు వెళ్ళగానే యీ చేపల్ని వండించుకొని తినేవారట. మద్రాసుకు చేరుకొని మద్రాసు బ్యాంకులో యీ ట్రజరీ డబ్బు జమ కట్టి రశీదు పుచ్చుకొని తిరిగొచ్చేవారు. ఈ ప్రయాణపు 10 రోజుల పాటూ సాగుతుండేది....

నాటికీ ఈ పులికాట్ సరస్సులో మంచిచేపలు దొరుకుతాయి. కొన్ని ఋతువుల్లో వలవేస్తే ఆ వలనిండా మోయలేనన్ని చేపలు పడాల్సిందే. ఈ చేపలన్ని మద్రాసుకు ఎగుమతి అవుతుంటాయి. రెండుసంవత్సరాలనుండీ, యీ పులికాట్ సరస్సులో దొరికే రొయ్యల రకాలపై కేంద్ర మత్స్యశాఖవారు పరిశోధనలు చేస్తున్నారు కూడా.

## సాహిత్య బంధువుకు స్మృత్యంజలి

గురజాడకు బాస్వెల్ వంటి కీ. శే. ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం కన్యాశుల్కంగూర్చి, మునిసుబ్రహ్మణ్యం లేవనెత్తిన చర్చ.

(ఒంగోలు అడ్వకేటుగా వుంటూ తన 80వ యేట ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారు కాలధర్మం చెందారు. వారి జీవిత విశేషాలను గూర్చి శ్రీ కె. వి. రమణారెడ్డి. బం. గో. రె. వ్రాసిన వ్యాసము)

పదిహేడేళ్ళ కితం 1952 లో తొలిసారిగా నాకు ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారి పరిచయమైంది. నేనప్పుడు ఒంగోలు కాలేజీలో వుండేవాణ్ని. అప్పటికే ఆయన షష్టిపూర్తి వయసున వున్నారు. మేమిద్దరం బెజవాడలో జరిగిన గురజాడ జయంతి సభలో పాల్గొనేందుకు కలిసి ప్రయాణం చేయవల్సి వచ్చింది. అప్పటివరకు గురజాడ వాఙ్మయం గురించి నాలో ఉండిన ఉబలాటం ఆనాటినుంచి క్రమబద్ధమైన ఉత్సాహంగా మారింది. ఆరాధన నుంచి నా మనస్సు పరిశోధనవైపు మరలింది. దానికి మునిసుబ్రహ్మణ్యంగారు ముఖ్య కారణం.

పచ్చటి ఒంటిఛాయ, కంకంవంటి చలాకి దేహం, పలచటి ముఖాన ప్రశాంతంగా ఉండి కూడ తీక్షణమైన చూపులు, మరక మడత లేని దుస్తులు చేత వంకీకర్ర–తూచినట్లు తొణక్కుండా చల్లగా మెల్లగా నిండుకుండలాంటి మాటతీరు – జ్ఞాపకం వున్నంతవరకు ఆయన రూపురేఖల స్థూలచిత్రణ యిది. 1956 లో నేను కావలి కాలేజికి వచ్చాక, మళ్ళీ ఆయన దర్శనమే చేసుకోలేదు. అయితే గురజాడ వాఙ్మయాన్ని తరిచి చూచేకొద్దీ, మునిసుబ్రహ్మణ్యంగారి మీద గౌరవాభిమానాలు నాలో పెరుగుతూనే వచ్చాయి. నాలుగైదేళ్ళనాడు మాటపడిపోయి మంచాని కంటిపెట్టుకుంటూ వస్తున్నారని వింటూ వచ్చాను. పోయారని మొన్ననే తెలిసింది. మదర మునిగిన పండు రాలిపోయింది.

మునిసుబ్రహ్మణ్యంగారు మన ఒంగోలు వెంకటరంగయ్యగారి తమ్ముళ్లే కాబట్టి నెల్లూరువారి కందరికీ ఆత్మీయులు. ఆ రోజుల్లో విజయరామగజపతి, ఆనందగజపతి మహారాజుల ధర్మమా అని,

విద్యలనగరంగా విలసిల్లుతూ వచ్చిన విజయనగరానికి వెళ్ళారు. బీద బ్రాహ్మణ పిల్లలకు అప్పారావు సంస్థానం నుంచి తృణమో పణమో ముట్టు చెప్పిస్తూ ఉండేవారు. అప్పట్లో (1904) ఆయన మాటకు బాగా చెల్లుబడి. రీవారాణీకి ఆంతరంగిక కార్యదర్శి మరి! అయితే చేసే సహాయం దానంలా వుండకూడదు. కాబట్టి మునిసుబ్రహ్మణ్యంగారిని చేరదీసి తమ యింటిలోనే పని పెట్టారు. ఏం పని? పాత పుస్తకాలలో తలదూర్చి, విజయనగర వంశావతారిక భాగాలను ఆంగ్లీకరించి అచ్చువేయించే పని. పాఠ్యగ్రంథాలనుంచి తెలుగుసాహిత్యం చదువుకొన్నదానికంటె అప్పారావుగారి గ్రంథసంచయం నుంచి ఎక్కువగా చదువుకొంటూ జిజ్ఞాసాపరుడుగా సహృదయుడుగా తయారైన ఈ ఆనాటి నవయువకుడు Prabamdham pedigrees సమకూర్చడంలోను వీరేశలింగంగారి ఆంధ్ర కవుల చరిత్రను సంస్కరించి అభివృద్ధిపరిచే కృషిలోనూ, అప్పారావుగారికి మానవోపకరణ మయ్యారు. చదువు ముగించుకొని కాకినాడకళాశాలలో ట్యూటరుగాను, లెక్చరర్‌గాను కొన్నాళ్ళు పనిచేసి, చివరకు ఒంగోలులో వకీలు బోర్డు కట్టారు.

గురజాడ వాఙ్మయ పరిశోధకునికి మునిసుబ్రహ్మణ్యంగారు చేసిన సహాయం యింతంత కాదు. కన్యాశుల్కం నాటకం ద్వితీయ ముద్రణకు (1909) ముందు వెనుకల ఆయన సాగించిన ఉత్తర ప్రత్యుత్తరాలే లేకుంటే, నాటకరంగం గురించి, విశాలంగానూ, కన్యాశుల్క నాటక విశేషాల గురించి, ప్రత్యేకంగానూ అప్పారావుగారి అభిప్రాయాలు విస్మృతిపాలై వుండేవి. అప్పారావుగారు మరణించిన ఇరవైఏళ్ళ తర్వాత 1936 లో హిందూపత్రికలో ఈ వుత్తర ప్రత్యుత్తరాలను ముద్రణ కిచ్చారు. మన సుబోధిని పత్రికలో పునర్ముద్రితాలయ్యాయి కూడా.

సాంప్రదాయకమైన నైతిక దృక్పథంగల మునిసుబ్రహ్మణ్యం కన్యాశుల్కం నాటకాంతర్గతమైన అవినీతి, చిత్రణగురించి ధైర్యంగా

ఆక్షేపించినప్పుడు, మానవీయదృక్పథంతోటి ఆధునిక భావనతోటి అప్పారావుగారు ఓపికగా విపులమైన సమాధానా లిచ్చారు. అప్పారాయకవి హృదయావిష్కరణకు యిలా కారణభూతులయ్యారు. వేదం వెంకటరాయశాస్త్రిలకూ, అప్పారావుపంతులకూ మధ్య సద్భావసేతువు కిగ్మి పదలచారు. నెల్లూరు మాండలిక పదాలను చూచి తాను అప్పారావుగారికి అందించారు. మొత్తంమీద అప్పారావు 'జాన్సన్' అయితే తాము ఆయనకు 'బాస్వెల్' కాగలిగారు. ఆ రోజుల్లోనే (1906 - 1909) అంతమాట అనిపించుకొనేవున్నారు.

సాహిత్యబంధువై కూడా అజ్ఞాతంగా ఉండిపోయిన ఈ సహృదయుని కిదే నా స్మృత్యంజలి.

కీ. శే. ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగార్ని గూర్చి శ్రీ కె వి. రమణారెడ్డిగారు వ్రాసిన వ్యాసానికను చదివాను. అత్యంత స్వల్ప వ్యవధిలో ఏదైనా నాలుగు మాటలు వ్రాసిపంపమని అడిగిందే తడవుగా స్మృత్యంజలి పూర్వకంగా గబగబా వ్రాసిపంపిన వ్యాసమే అయినా శ్రీ సుబ్రహ్మణ్యం గూర్చి మొత్తంమీద ఎంతో ఉదాత్తమైన చిత్రణనే అందించగలిగారు. అయినా ఇంకా చెప్పుకోవాల్సిన వివరాలు కొన్ని లేకపోలేదు. వాట్ని పూరించే తాహత్తు నాబోటివాడికి లేకపోయినా ఆ సాహసానికి ఒడిగట్టినందుకు క్షమార్హుణ్ణి.

రమణారెడ్డిగారు మునిసుబ్రహ్మణ్యంగారు మన కీ. శే. ఒంగోలు వెంకటరంగయ్యగారి తమ్ము లన్నారు. తమ్ముడు కాదు. వెంకటరంగయ్యగారి అన్నకుమారులే అయినా, వారిద్దరిమధ్య వాళల విధంగా అన్నతమ్ములవంటి బాంధవ్యమే వర్ధిల్లింది. వీరిద్దరిమధ్య సాగిన ఉత్తరప్రత్యుత్తరాలు కూడా సాహిత్యపరంగా ఎంతో విలువైనవి. అవి కూడా వెలుగులోకి రావాల్సి వున్నవి.

1909 సంవత్సరం జనవరిలో బి. ఎ. పట్టభద్రులైన మునిసుబ్రహ్మణ్యంగారు మొదట నెల్లూరు వి. ఆర్. హైస్కూలులో కొంతకాలం వుపాధ్యాయులుగా పనిచేశారు. అప్పట్లో స్వర్గీయ

గురజాడ అప్పారావుగారిచే రచింపబడి తెలుగు సాహిత్యంలో ఒక అనర్ఘరత్నమైన కన్యాశుల్కం. రెండోముద్రణ మద్రాసుప్రెస్‌లో జరుగుతుండేది.

మద్రాసు, నెల్లూరుకు దగ్గర్లో ఉందనేమో—విజయనగరంలో తనకు అత్యంత అభిమాన విద్యార్థిగా, ప్రియశిష్యుడుగా ఉంటుండిన మునిసుబ్రహ్మణ్యంగారు నెల్లూరుకు చేరినందువల్ల ప్రూఫులు చూడమని మునిసుబ్రహ్మణ్యాన్ని పురమాయించినట్లున్నారు గురజాడ అప్పారావుగారు. ఆ ప్రూఫులు మద్రాసునుండి నెల్లూరుకు పంపబడుతుంటే, మన మునిసుబ్రహ్మణ్యంగారు, వాట్ని చూచి తిరిగి అచ్చుకు పంపుతుండేవారు. ఊరికే ప్రూఫులు చూసి పంపివుంటే, ఇంత చరితార్థులై ఉండేవారుకాదు. ఆ నాటకరత్నంలో తనకు కల్గిన భేదాభిప్రాయాలను, మరికొన్ని సందేహాలను గూర్చి అప్పారావుగారికి వుత్తరాలు వ్రాసి చర్చించేవారు. ముఖ్యంగా మునిసుబ్రహ్మణ్యంగారు ఎత్తి చూపిన కొన్ని భాగాలను దిగువ ఇస్తున్నాను.

1909 మే 21వ తేది గురజాడ మునిసుబ్రహ్మణ్యంకి వ్రాసిన లేఖలో నుండి కొన్ని వాక్యాలు.

"ఏనాడు బౌద్ధమతం, భారతదేశంలో తుడిచిపెట్టబడిందో, ఆనాడే భారతదేశం మత విషయక ఆత్మహత్య చేసుకున్నది."

"మీ సోదరుడు పట్టాభిరామమూర్తితో కలిసి తిరగడంవల్ల నువ్వు అవినీతిని ఏవగించుకొంటున్నందుకు సంతోషం ఒక సానిపిల్ల నిన్ను షాక్ చేస్తుంది. నీతిపై నీకు గల ఆ సుందరాతిసుందరమైన అభిప్రాయానికి నిన్ను నేను అభినందిస్తున్నాను. అందువల్ల యీ సమస్యను సాకల్యంగా నీతో నేను చర్చించదల్చుకోలేదు. వయసుకు మించిన జ్ఞానవంతుడివి నువ్వు.

"కవిత్వం, న్యాయం నిన్న మొన్నటిలాగా ఈనాడు లేదు. మానవ జీవితాన్ని నేను చిత్రిస్తాను! కళలో ఆదర్శపూరితం చేస్తానను కో, కవిత కళ్ళకు నేను లొంగివుండవల్సిన వాడినేమో, నాకు

మానవ సమాజం పట్ల మహత్తరమైన బాధ్యత అనేది ఒకటి వున్నది. కనుక పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును—ఒక దోషాన్ని, దుర్నడతను, అవినీతిని ఆకర్షవంతం చేశానా? చేయ లేదనే భావిస్తున్నాను. మొదటి కూర్పులో కన్యాశుల్కం నాటకంలో మధురవాణి వర్ణింపలేని హేయమైన నడవడి కలది. ఆ పాత్రకు ఎట్టి వన్నెలు చిన్నెలు లేవు. నాటకం రచి స్తున్న కొద్ది మధురవాణి పాత్రమీద నాకున్న దృక్పథం మారుతూ వచ్చిందని నేను చెప్పక తప్పదు. అలాగ చేయడంవల్ల మధురవాణి పాత్రలో వొకదాని కొకటి సరిపడని విషయాలు దొర్లాయేమో తెలియదు...మధురవాణి పాత్ర అంటే నాకు నేనే ముచ్చటపడ్డు న్నాను. కనుక ఆమెను చివరి అంకంలో సంస్కరించాను. ఇక నీకు నాతో వివాదగ్రస్థమైన విషయమేమీ లేదు...

''మానవ జీవితంతో నేను చెలగాటం ఆడ్డం లేదని ఈ నాటకం చదివితే నీకు తెలుస్తుంది. ఎట్టి తృణీకార భావము లేకుండా మానవ జీవితాన్ని గంభీరమైనదాన్నిగా భావించి నాటకంలో దాన్ని యితి వృత్తంగా స్వీకరించాను. మొదటి నుంచి చిట్ట చివరివరకు పొట్ట చెక్క లయ్యేటట్టు నవ్విస్తూ రాస్తూ అందులో యింత గంభీరమైన ఇతి వృత్తాన్ని నిర్వహించడం అంత తేలికైన పనికాదు. ''సానిపిల్లలో ఉండే మానవత్వాన్ని నీవు మర్చిపోకు. ఆమె విచారం కన్నీళ్లు, సంతోషం, ఆనందబాష్పాలు, నీ నా సుఖదుఃఖాలవంటివే. మన అనుభూతులవలె అవీ బలీరమైనవే, ఉదాత్తమైనవే.

''అవినీతిపరురాలు అయిన ఒక భార్య. లేదా వ్యభిచారి ఐన ఒక భర్త. లేదా వీరిద్దరితోనూ నిండిన సమాజం. ఏ విధంగా ఒక సానిపిల్లకంటె మిన్న? వ్యభిచారమే తనవృత్తిగా [illegible] వేశ్య బడ్డ సానిపిల్లకంటే యే దృష్ట్యా వీరు నయం? సానిపిల్ల ఏ వివాహ బంధనాలనూ వుల్లంఘించడం లేదు.

"ఇప్పుడున్న సాంఘిక భావాలుపోయి వీటి స్థానే కొత్తవి రావల్సిన అవసరానికి, అగత్యానికి మానవ పరిణామం దారితీస్తున్నది. కంటిఎదుట స్పష్టంగా కన్పిస్తున్న వాస్తవ విషయాలకు భయపడి సత్యాన్ని మరుగుపుచ్చి తప్పించుక తిరగడంవల్ల ప్రయోజనం శూన్యం...ఆధునిక మహిళలు మానవచరిత్రను మార్చి తిరిగి రచిస్తారు. నిజమే నీవన్నట్లు నాటకంలో మీనాక్షి కనిపించే దృశ్యాలు అంత అద్భుతావహమైనవి, వుపదేశకరమైనవి కావు. అయితే వొక సంగతి... (అంటూ షేక్స్పియర్ నాటకాలు, ఆడ్వోవెన్సిన్స్ ప్రిజర్వ్స్, అనే నాటకాల్లోని యితివృత్తాలపై దీర్ఘంగా చర్చించి యిట్లా అంటారు గురజాడ...వాస్తవిక రచన అనే వాఙ్మ కళలో ఎంత ఆదర్శపూరితం చేసినప్పటికి మానవ నైతిక ప్రమాణాలను అతి స్పృశించక తప్పదు. అతిని నైతికదృష్టికీ, భావాలకు కష్టం కలగక తప్పదు కొంతవరకు నైతిక భావాలను గురించిన యీ అధిక్షేపణ వారి వారి స్వభావాలను బట్టి ఉంటుంది...అన్నారు

నీ అభిప్రాయమంటె నాకు విలువహెచ్చు! అని నీ వుత్తరం నాకెతో ముచ్చటగొల్పిందనీ, నిన్ను నేనెప్పటికీ అపార్థంచేసుకోలేదని - యింకో జాబులో అంటారు గురజాడ. ఇంకోజాబులో వేదం వెంకటరాయశాస్త్రిగారి 'ఉష' నాటకంపై చాలా తీవ్రమైన అభిప్రాయాలనే వ్యక్తంచేసి వున్నారు. మరొక జాబులో - నెల్లూరు నూరేళ్ళ నాటి మొదటి జర్నలిస్టు దంపూరు నరసయ్యగారి ప్రస్తావన కూడా ఉంది చూడండి:- ఒక తెలుగు పుస్తకాన్ని ఎలా రివ్యూ చేయాలో తెలిసున్న వ్యక్తి నా ఎరికలో ఎవడూలేడు. అన్నట్లు శ్రీ డి. నరసయ్య అనే పండితుడు ఒకాయన "పీపుల్స్ ఫ్రెండ్" అనే వారపత్రికను నడుపుతుండేవాడు - ఆయన నెల్లూరు వాస్తవ్యుడు ఇప్పుడున్నారా? వుంటే ఆయన చిరునామా పంపించు. ఆంగ్లభాషలో ఆయన గట్టివాడు...అని 1909 జూలై 7 వ తేది యింకో జాబులో వ్రాస్తారు. మరో జాబులో ఆఖరున మద్రాసు నుంచొచ్చే మెయిలు నెల్లూరు ఎన్నిగంటలకు చేరుతుంది? అనికూడా అడుగుతాడు. ఇట్లు

వారి లేఖల్లో ఒక విధంగా నెల్లూరు, నెల్లూరు వ్యక్తులు కూడా చరితార్థులయ్యారు.

ఆఖరుగా మరొక్క విషయం శ్రీ మునిసుబ్రహ్మణ్యంగారు ఆనాడే అన్నట్లు కన్యాశుల్కం నాటకంలో చాలావరకు కొరకు రాని కొయ్యలు. ఇతర ప్రాంతీయులకు అర్థంకాని విజయనగరం మాండలిక పదాలు బోలెడన్ని వున్నాయి.

సరసలు టోంప, కత్రతు, పొత్తి, బారిక రాముడు, నుండేళింను, చిడపొక్కోలు, ధణుతు, యిసేచు, తిడాబోరీ, గుడ్డి, బిసాదు, చుక్క,-ఇట్లా ఎన్నో పదాలు వున్నాయి. ఇవన్నీ అప్పారావుగారికి, ఎత్తి చూపి అర్థాలు వ్రాయమన్నట్లున్నారు మునిసుబ్రహ్మణ్యంగారు.

నెల్లూరువాళ్ళకు అర్థంగాని పదాలన్నీ వేరే వొక పట్టిక తయారుచేయమన్నట్లున్నారు గురజాడ ఆ పదాల పట్టిక నే ముని సుబ్రహ్మణ్యంగారు పంపినట్లున్నది. రెండు జాబుల్లో "ని పదముల పట్టిక అందింది. నాటకం చివర నీవ్వు పంపిన పదాలపట్టిక తప్పక చేరుస్తాను" అని వ్రాసి ఉన్నారు. ఎందువల్లనో ఆ పదాల పట్టిక నాటకం చివర చేర్చబడలేదు. ఇట్లు గురజాడ మునిసుబ్రహ్మణ్యం గార్ల మధ్య సాగిన లేఖలు ఎంతో విలువైనవి సందేహంలేదు.

## విశ్వ విఖ్యాత నాటకకర్త షేక్స్పియర్

నిజం చెప్పొద్దూ, మనం చాలా గడ్డురోజుల్లో ఉన్నాం. ఫారిన్ ఎక్స్చేంజి విదేశీ మారకద్రవ్య మనేది గడ్డ సమస్యలలో గడ్డ సమస్యయి కూర్చున్నది. ఈ ఫారన్ ఎక్స్చేంజి బెడద లేకుండా, సునాయాసంగా ప్రపంచంనుంచి ప్రత్యేకించి బ్రిటన్ నుంచి దిగుమతి చేసుకోదల్చిన వస్తువు షేక్స్పియర్. ఆంగ్ల భాషలో మనకు వందలాది సంవత్సరాల పరిచయమున్నా షేక్స్పియర్ ను దిగుమతి చేసుకోవలసినంతగా చేసుకోలేదేమో-ఈనాటికి మన స్కూళ్ళల్లో

కాలేజీలల్లో షేక్స్పియర్ నాటకాలను కేవలం అకెడమిగ్గా మాత్రం వల్లింపజేస్తూ భట్టీయం వేయించడం తప్ప.

వాకానాక స్పానిష్ జానపద స్త్రీ అనుకొన్నట్లుగా, షేక్స్పియర్ అంటే ఒక రకముగా దేవుడు మనకు, ఆంగ్ల భాషాభిమానులకు ఈనాటికీ ప్రపంచంలో ప్రతి సంవత్సరము ఏవో వాకమూల షేక్స్పియర్‌ను కొత్త ధృక్కోణంతో అవలోకించి అవలోకన చేసి సవిమర్శకంగా డజన్లకొద్ది గ్రంథాలు వస్తూనే వున్నాయి. ముఖ్యంగా బ్రిటన్‌లో షేక్స్పియర్‌పై విమర్శా వ్యాసాంగం చేయనిదే-సాహిత్య విమర్శ శాఖలో శ్రీకారము చుట్టినట్లుకాదు-అన్నంత పరిగణన ఉంది. బ్రిటనులో షేక్స్పియర్‌పై విమర్శ ఒక జాతీయ పరిశ్రమగా కొనసాగింది, కొనసాగుతుంది. సారస్వత విమర్శకు షేక్స్పియర్ ఒక విశాలవేదికగా ఈనాటికి నిల్చియున్నాడు. ఈ విమర్శ సారస్వతావగాహనకు కొత్త కోణాలను, కొత్త రూపురేఖలను ప్రసాదిస్తుంది. డజన్లకు డజన్లుగా వున్న షేక్స్పియర్ స్వంత నాటకాల రచనమాట అటుంచి షేక్స్పియర్‌పై అపారమైన విమర్శా సాహిత్యం ఉంది. ఎందరెందరో విమర్శకులు షేక్స్పియర్ నాటకాలను, కవిత్వాన్ని ఆధారముగా తీసుకొని సాహిత్యములో విస్తారమైన విమర్శశాఖను వృద్ధిచేసినారు. శాఖోపశాఖలుగా విస్తరిల్లి షేక్స్పియర్‌పై వచ్చిన ఈ అనంత సారస్వత విమర్శ అమూల్యమైనట్టిది. ఆధునిక విమర్శకులలో అనేకులు షేక్స్పియర్‌ను నిష్పాక్షికముగా విమర్శించి వున్నారు. వుదాహరణకు శ్రీ టి. యస్. ఇలియట్. ఆయన అంటాడు చూడండి. "The only pleasure that I got from Shakespeare was the pleasure of being commended for reading him, Had I been a child of more independent mind I should have refused to read him at all" అంటాడు. ఈయన తన విమర్శాఖడ్గాన్ని ఎత్తి షేక్స్పియర్ నాటకాలను చీల్చి చెండాడియున్నాడు. "హామ్లెట్" అసలు నాటకమే కాదన్న ధోరణిలో వాదిస్తాడు. ప్రపంచమంతా 'హామ్లెట్" అమోఘమైన

నాటకమని కొనియాడుతుంటె టాల్‌స్టాయ్ షేక్స్పియర్ కింగ్‌లీర్ నాటకాన్ని గూర్చి చెప్తూ, బార్బగస్ అని నిరసించాడు, బెర్నార్డ్‌షా-స రేసరి! ఆఁ షేక్స్పియర్ దేముంది? షేక్స్పియర్ కంటె నేను గొప్ప వాడనని చెప్పుకున్నాడు.

ప్రాథమికంగా ఆలోచిస్తే - ఈ సృష్టి - నీరు, గాలి, నిప్పు, భూమి. మొదలైన వాటితో కూడుకున్నది. అట్లనే మానవ జీవితంలోని ప్రాథమికమైన అనుభూతులకు, అనుభవాలకు - ప్రేమ, అసూయ, భయం, గర్వం, కృతజ్ఞత, ఆశ, వాత్సల్యం - ఇట్లా ఈ మానవ ప్రాథమిక అనుభూతి ఉద్వేగాలను మరపురాని విధంగా మలచి నాటకీకరించాడు. ఇతరులెవ్వరికి సాధ్యంకాని రీతిలో మానవ మేధలోని మనస్సు లోతుల్లోని భావజలాన్ని మహా వైవిధ్యవంతమైన పాత్ర కల్పనద్వారా ప్రదర్శించాడు. రసప్లావితం చేసాడు. ఇంత ప్రాథమికంగా మానవజీవిత సామీప్యాన్ని సారూప్యాన్ని సాధించి రసమయం చేసాడు కనుకనే షేక్స్పియర్ పుట్టి నాలుగువందలయేండ్లు గడచినా సర్వమానవాళి ఈనాడు నివాళులు అర్పిస్తున్నది.

రష్యాలో మరేనాటకకర్త నాటకాలకన్నా షేక్స్పియర్ నాటకాలు విశేషంగా ప్రదర్శితమయ్యాయి. అవుతున్నాయి. అమెరికాలో వాషింగ్టన్‌లో - డిఫోల్గర్ షేక్స్పియర్ లైబ్రెరీ - అనేది ప్రపంచంలోకల్లా షేక్స్పియర్ సర్వ సాహిత్య గ్రంథాలను సేకరించడమే కాకుండా షేక్స్పియర్. సమకాలీన సమాజ జీవిత విశేషాలకు చెందిన అనేక కళాఖండాలను సేకరించి భద్రపరచిన పెద్ద గ్రంథాలయం వుంది. ఇట్లు షేక్స్పియర్ సారస్వత ఉద్యమం. ప్రపంచంలో పలుచోట్ల పాతుకొనివుంది. షేక్స్పియర్ రచనల్తో మనకు ఇన్ని వందలయేళ్ళ పరిచయంవున్నా ఆయనపై సర్వ సమగ్రమైన గ్రంథం మాట అటుంచి ఆయన నాటకాలు మన భాషలో మంచి అనువాదాలకు నోచుకోలేదు. కాళిదాసు శాకుంతలం అను వాదాన్ని చదివే కదా జర్మనీ మహాకవి "గోథె" మహా మురిసిపోయి గంతులేసింది.

షేక్స్పియర్ నాటకాలను అంత రసస్ఫూర్తితో చేసిన అనువాదాలు ఒక్కటీ మన తెలుగులో లేవు. ఇటీవల సాహిత్య అకాడమీ పుణ్యమా అని, షేక్స్పియర్ మేక్‌బెత్ హామ్లెట్ నాటకాలకు అనువాదాలొచ్చినాయి కాని అవేమంత గొప్పవస్తాయినందు కొన్నట్లు లేవు. కీ. శే. బళ్ళారి రాఘవ తర్వాత షేక్స్పియర్ నాటకాలను ఎవరూ ప్రతిభతో ప్రదర్శించిన పాపానపోలేదు.

ఇటీవల బ్రిటన్‌లో షేక్స్పియర్ 400 వ జన్మదినోత్సవం సందర్భాన జన్మస్థలమైన స్ట్రాట్‌ఫర్డ్ అన్ ఎవాన్‌లో పల్గొని షేక్స్పియర్ సమాధిపై పుష్పగుచ్ఛాలు సమర్పించిన దేశ దేశాల ప్రతినిధులు రాయబారులలో మన దేశంవారు పాల్గొన్నారనీ పులకితులవౌతున్నా – షేక్స్పియర్‌లాంటి విశ్వకవి రచనలకు మన భాషలో చెప్పుకోదగిన మంచి అనువాదాలు లేవే అనేబాధ! ఆయన ప్రభావం వల్లనైనా మన భాష కావాల్సినంత సంపన్నం కాలేక పోయిందే అను కొరత కలగకుండాపోవు.

## కలం చిత్రము

### పరిపూర్ణ కళాకారుడు చిత్తూరు వి. నాగయ్య

మనవాళ్లు పేరులో యేముందంటారు కాని. వుండేవంతా పేరులలోనే అనిపిస్తుంటుంది వొకోసారి. లేకుంటే శ్రీ నాగయ్య 'పద్మశ్రీ' బిరుదాంకితులు కావడంతో ఆంధ్రనగరాలు వరుసబెట్టి ఆయన్ను అఖండంగా సన్మానిస్తున్నయంటే ఏమని చెప్పాలి? పద్మశ్రీ ఉన్నా, లేకున్నా కళపేరుతో జీవించగలిగిన చిరంజీవి చిత్తూరు వి నాగయ్యగారు.

మొన్న నెల్లూరు సినిమా జీవుల కూటమివారు ఆయనకు చేసిన సన్మానాన్ని పురస్కరించుకొని నాగయ్యను గూర్చి నాలుగు మాటలు చెప్పడం భావ్యమనిపించుకొంటుంది. నాగయ్యను గూర్చి ఏమి చెప్పాలన్నా తెలుగు సినిమా చరిత్రనంత తడపవలసిఉంటుంది.

ఆలనాడు తెలుగు చిత్రసీమ కళగా శైశవ దశలో ఉంటున్న రోజులనించీ పరిశ్రమగా ప్రాశవికా స్థాయిని చేరుకున్న నేటి యీ రోజులదాకా తళుకు, బెళుకు రాళ్లు తట్టెడున్నా, నిక్కమైన నీల మని చెప్పదగినవారు, నటశేఖరులు శ్రీ నాగయ్యగారు. రకరకాల పిచ్చిలీగలతో పాచిపట్టిన సినిమా బురదమడుగులో కళాకాంతులు వెదజల్లుతూ, తెలుగుదేశంలో సభ్యత—సంస్కృతి, కలిగి సహృదయులను పరవశింపచేసిన సుందరపద్మం శ్రీ నాగయ్య – ఈ వాక్యం నాదికాదు, శ్రీ బి. ఎన్. రెడ్డిగారిది. ఎంత సూటిగా చెప్పారో అంత బాధాకరముగ చెప్పారు, కనుక నేను దానికి 'డిటో' చెప్తున్నాను.

నటులెందరోవున్నా జీవితానికీ నటనకీ తేడానే లేని జీవితం ఒక్క నాగయ్యగారిదే నేమో ననిపిస్తుంది. తరుణప్రాయం నుంచీ ప్రహ్లాద, పోతన, వేమన, త్యాగయ్య, రామదాసులాంటి భక్తాగ్రేసరుల పాత్రలే నాగయ్యను ఆకర్షించాయి, ఆకట్టుకున్నాయి. ఆ పాత్రల్లో ఆయన జీవించాడు. తెలుగు వెండితెరను జ్వాజ్వల్యమానం చేశాడు. నిజసంసార జీవితంలో సైతం ఆయన వైరాగ్యంతోనే చెలిమి చేసిన నట్లున్నాడు. (ఆధ్యాత్మికపరంగా వైరాగ్యం అంటే అనురాగాన్ని అన్నింటా వెదజల్లడమేనని కూడా వుంది). కుటుంబ జీవితంలో దుర్భరమరణాలను చూసి కొంతకాలం పాటు విరాగి అయి రమణా శ్రమంలో గడపి ఆ తాత్త్విక వాతావరణంలో మెలిగాడు. విద్యార్థి దశలో దివ్యజ్ఞానసభాలోలుడై అనిబిసెంటుకు చేరువగా వెళ్లాడు. ఈ రాపిడులవల్ల ఆయన వ్యక్తిత్వంలోని కళాంశ పొందిన వికాసపు నీడలమూలంగా నేమొ నటుడుగా ఆయన ధరించిన కరుణ, భక్తి, తత్వ, వైరాగ్య, దుఃఖపాత్రల నిర్వహణాభినయంలో మనకు కన్పించేది వొట్టి అభినయం కాదు, అసలైన అనుభవపారవశ్యం. నిజజీవితానికి నటజీవితానికి హద్దులు చెరిపేసుకున్న సిద్ధపురుషులు శ్రీ నాగయ్య.

అంతేకాదు. ఇంకో విశేషం కూడా ఉంది. ఆయన నిజజీవితంలో తొలుత స్వయంగా దేశ స్వాతంత్ర్యోద్యమంలో కృషి సాగించిన వ్యక్తి. హోంరూల్ ఉద్యమంలో ఊరికే మద్యనిషేధ ప్రచారం (ఇప్పటి సంగతేమోగాని, అప్పటిమాట ఇది), ఉప్పుసత్యాగ్రహం వంటి కార్యక్రమాల్లో పాల్గొని పోలీస్ లాకప్‌కు గురైనారు. తర్వాత నటజీవితంలో ఆయనకు తారసిల్లిన తొలిపాత్రలు కూడా యిట్లాంటివే. "గృహలక్ష్మి"లో స్వాతంత్ర్యోద్యమ ప్రచారకుని పాత్రను ధరించి – లేండు భారతవీరులారా! నిదుర లేవండోయ్... కళ్లు తెరవండోయ్—అని ఆయన హరిజన హాస్టలు పిల్లలను వెంటేసుకొని పాడినపాట ఇప్పటికీ కొందరి చెవులలో గింగురమంటూనే ఉంటుంది. ఆ తర్వాత వందేమాతరంలోని పాత్రకూడా అట్లాంటిదే. ఇట్లా నిజజీవితంలోని నీడలను నటజీవితంలోను చూచుకోగలుగుతూ రెంటిని సమాంతర రేఖలుగా పరుగులు తీయించుకున్న వ్యక్తి శ్రీ నాగయ్య. ఇక హీరోగా శృంగారరసాల్యాభినయంలో కూడా ఆయన చూపిన విభవం: స్వర్గసీమ, దేవతా లాంటి సినిమాల్లో వారి నటన కలకాలం జ్ఞాపకం ఉంచుకో దగినవి. అలనాటి "సుమంగళి" చూచినప్పుడు నాగయ్య అందులో ధరించిన సంస్కరణ వాది పాత్రకు పరవశులై శ్రీ బాబురావు పటేల్ "అరే ఇక్కడా వొక పాల్ముని వున్నారే" అని వ్రాశాడు.

వెండితెరపై ఆయన ప్రతిష్టాపన చేసిన వర్రోక్తి రివ్యాజం సంగీత సంబంధమైనది. అంతదాకా కేవలం నాటకఫక్కీలో గుక్క తిప్పుకోకుండా ఖంగున పాడే పద్యాల ప్రభావం ముంపులో పడి కొట్టుకుపోతూండిన సినిమా సంగీతానికి కొత్తవరవడి దిద్ది కర్ణాటక సంగీతం లలితమైంది కాదని, సినిమాస్థాయికి అరవనిదనేదు.

అభిప్రాయాన్ని మాపి ఎన్నో కర్ణాటకకృతులను సంగీతలోకం మెచ్చుకునేట్టుగా నిసర్గరమణీయంగా శాస్త్రసంగీత సామ్రాజ్యాన్ని జనసామాన్య స్థాయిలోకిదించి శాస్త్రీయస్వచ్ఛతకు విరుద్ధంకాని

రీతులలో అశేషజనావళి రసహృదయానుభూతి పరిధిని స్పృశించే సార్వజనీనతను, సువిశాలతను, సరళశ్రేణి మనోహారతను సమాపించి, లలితలలితంగా భావయుతంగా శ్రవణపేయంగా తీర్చిదిద్దిన స్వరకారులు శ్రీ నాగయ్య. వారు పాడిన రాగంలోని ప్రతిపలుకూ భావసమ్మేళనయుతంగా స్వతంత్రమై, స్వయంప్రకాశమానమై భాసిస్తుంటుంది. వారి సినిమా సంగీతానికి గీటురాయి కూడా యిదే. ఇందులకు తార్కాణంగానే ప్యారిస్‌లో జరిగిన అంతర్జాతీయ సంగీత చలన చిత్రోత్సవంలో భారత ఏకైక ప్రాతినిధ్యచిత్రంగా నాగయ్యగారి 'త్యాగయ్య'ను ప్రదర్శించారు. ఇన్ని విలువలు ప్రతిపాదించిన నాగయ్యలోని సమగ్రమైన, పరిపూర్ణమైన కళాకారునికి జోహారులు.

## అర్థంకాని మాడ్రన్ ఆర్టు

### చిత్రకళా ప్రదర్శన – ఆనందించినవారు తక్కువ ; అర్థంకాలేదన్నవారు ఎక్కువ.

రోమ్‌నగరంలో ఒక చిత్రకారుణ్ణి ఒక ఆయన అడిగాడట—'నీ బొమ్మలు ఇంత అందముగా ఉంటాయి—మరి నీ సంతానం అంత వికృతంగా ఉంటారేం?' దానికి ఆయన చెప్పిన సమాధానం చూడండి—"సంతానం చీకట్లో సృష్టి", బొమ్మలు వెలుగులో..."

"ఇప్పటి చిత్రకారులు, చిత్రకారిణులు అందంగా నేయుంటారు. మరి వీళ్లు గీచిన బొమ్మలు ఇంత అందవికారంగా గందరగోళంగా ఉంటాయేమి?"– అని మొన్న నెల్లూరులో చిత్ర కళానికేతన్ వారు ఏర్పాటుచేసిన వర్ణచిత్ర ప్రదర్శనను తిలకిస్తుండిన ఒక అజ్ఞాత ప్రేక్షకుడు తనలో గొణుక్కుంటూ ఉండినాడు.

దానికి మన నవీన చిత్రకారులిచ్చే సమాధానమేమిటో కాని, ఆ ప్రదర్శనలో పెట్టిన చిత్రాలు, మాడరన్ ఆర్ట్ ధోరణులు నెల్లూరు ప్రేక్షకులకు బొత్తిగా అర్థంకాలేదనీ, ఆనందించలేక పోయారనీ చెప్పవలసి యుంటుంది.

పెన్నునీటికి చిత్రకళకు చుక్కెదురా ఏమిటి అనిపిస్తుంది. నెల్లూరులో చెప్పుకోదగ్గ చిత్రకళాకారులెవరూ ఉద్భవించలేదన టానికి కారణమింకేమైనా ఉందో తెలియదు. కవిత్వరంగంలో వేదం వెంకట్రామశాస్త్రి, దువ్వూరు రామిరెడ్డి నాటకరంగంలో సరే దిగ్గతుల్యైన నటశిఖామణులే ఉండినారు నెల్లూరులో మరి లేనిది ఈ చిత్రకళారంగంలోనే టి. వి. ఎస్. శర్మ వంటివారు ఒకరిద్దరు మినహా.

కావలిలో కొంతకాలము ఉండి ప్రఖ్యాత చిత్రకళాకారులు శ్రీ కాశీ రామమోహనశాస్త్రిగారిని జవ్వాక్ భారతీవారు ఉంచు కొంటున్నారు. అక్కడి పిల్లలకు వీరినుండి ఏ పాటి శిక్షణలభిస్తుందో తెలియదు. ఇక పోతే మద్రాసు ఆర్ట్సూల్లో ఒకరిద్దరు నెల్లూరు వారు డిప్లొమాలు పొందినారు. చిత్రకళలో ప్రస్తుతం ఒకరో ఇద్దరో చదువుతున్నారు.

ఇన్నాళ్ళకు నెల్లూరులో చిత్రకళారంగంలో కొంత కృషి చేసేందుకు 'చిత్రకళానికేతన్' అని ఒకటి ఏర్పడ్డది. దీనికి అధ్యక్షులు మద్రాస్ ఆర్ట్సూల్లో నాలుగు సంవత్సరాలపాటు చదివి చిత్ర కళాడిగ్రీ పొందిన శ్రీ శివకోటారెడ్డి. కార్యదర్శి శ్రీ పి. వేణుగోపాల రెడ్డి. చిత్రకళా విషయంలో నెల్లూరు ఒక 'సహారా ఎడారి' అను కుంటే ఈ చిత్రకళానికేతన్ ఒక చిన్న 'ఒయాసిస్సు' వంటిది అనుకోవచ్చు. చిత్రకళలో అభినివేశం లేకపోయినా శాస్త్ర అభిరుచీ ప్రవేశము యున్న కొందరు ప్రోత్సాహకులు కల్సి ఏర్పరచుకున్న సంస్థ ఇది. ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమీ వారికి 'అఫిలియేట్' కూడా చేయించుకున్నారు. రాష్ట్ర అకాడమీ ఆఫీసు సెక్రటరీగా ఉంటున్న వ్యక్తి నెల్లూరువారే, శ్రీ మామిడిపూడి రామకృష్ణయ్య గారి కుమారుడు కృష్ణమూర్తిగారు.

చిత్రకళకు సంబంధించిన వొక చిన్న స్కూలువంటిది నెల్లూర్లో ఏర్పాటుచేసి కొందరికి శిక్షణ ఇప్పించాలని కూడా యోచి స్తున్నారు. యీ నికేతన్ వారు నెల్లూరుజిల్లా దేవాలయాల్ని తిరిగి

అందులో మరుగుపడిఉన్న శిల్పకళా మాణిక్యాలను ఏర్చి, కూర్చి ఒక గ్రంథముగా వెలువరించాలని కూడా ఆలోచిస్తున్నారు. ఇంకా వీలైతే ఒక చిన్న ఆర్ట్ గ్యాలరీవంటిదాన్ని ఏర్పాటు చేయాలని కలలు కంటున్నారు.

ప్రస్తుతానికి మాత్రం జోడిగా – యీ చిత్రకళా ప్రదర్శనను ఏర్పాటుచేసినారు. మొన్న 21 తేదీనుండి 24 తేదీదాకా టౌన్ హాల్ వద్ద వర్ధమాన సమాజంవారి రీడింగు రూములో. ఆంధ్రప్రదేశ్ ప్రఖ్యాతచిత్ర కళాకారులు గీచిన 65 వర్ణ చిత్రాలను లలితకళా అకాడమీవారు నెల్లూరుకు పంపారు. ప్రత్యేకంగా నిర్మించిన కొయ్యస్టాండులమీద వీటిని ప్రదర్శించారు. ప్రదర్శన యేర్పాట్లు చాలా సైన్‌టిఫిక్‌గా ఉండినాయి. ఈ చిత్రాలను చూస్తున్నంతసేపు – వెనుక ప్రక్క-గానుండి పెద్దశ్రాయిలో శాస్త్రీయ సంగీతపు రికార్డులను వినిపించారు ద్వారం వయోలిన్, రవిశంకర్ సితార్, బడే గులాం, అలీఖాన్, రాజరత్నం పిళ్ళై నాదస్వరం వగైరా వగైరా రికార్డులు వినిపించారు. ఈ ప్రదర్శనలో పెట్టిన చిత్రాలకన్నా యీ రికార్డులు సంగీత ధ్వనులే బాగుండినవన్న మాట లేకపోలేదు. 21 తేదీ సాయంత్రం, క్రొత్త కలెక్టరు శ్రీ శంకరన్ ఈ చిత్ర ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేశారు. 23 తేది స్త్రీలకు ప్రత్యేకం అన్నారు.

ఇంతకూ ప్రదర్శనలో ఉంచిన వర్ణచిత్రాల సంగతేమిటి? ప్రదర్శన నిర్వాహకులు వొక 'విజిటర్స్‌బుక్' పెట్టారు. దాదాపు 200 మందిదాకా ఆ పుస్తకంలో తమ అభిప్రాయాలను వ్రాసారు. తెలుగులో, ఇంగ్లీషులో, హిందీలో, అరవంలోకూడా. ఇందులో స్త్రీ ప్రేక్షకుల అభిప్రాయాలే శాస్త్ర సానుభూతితో కూడుకొని ఉన్నట్లున్నది.

ఒకరిద్దరు రాసారు – ఈ ప్రదర్శనలో 'కాతా' వారి చిత్రాలు లేవని. బుచ్చిబాబుగారి పెయింటింగులు లేవని. ఒకతను రాసాడు– ఏమీ దాపరికంలేకుండా 'నాకేమి అర్థం కాలేదు.' అవి మరొకతని

అభిప్రాయం చూడండి. చిత్రకళాపండితులను ఆనందపరచునేమో కాని సామాన్యులకు కొరకరాని కొయ్యలని నాభావం." వేరొకతను ఎం. ఎస్. సి. పట్టభద్రుడట – ఆయన వ్రాసిన అభిప్రాయం చూడండి. 'Is this the art? I am Puzzled.'

ఈ చిత్రాలలోని ఒక్కొక్కదాని శైలిని, రీతిని, వస్తువును తీసికొని చర్చించుకొంటూ పోవాలంటే చాల భారతమవుతుంది. ఉదాహరణకు నెల్లూరువాడైన శ్రీ ఎం. కృష్ణమూర్తిగారి చిత్రం తీసికుందాం. ఇదికూడా చాలామందికి అర్థం కాలేదన్న ఆరోపణలకు గురైన చిత్రమే. 'తనకు ప్రియమైనదానితో స్త్రీ' అని ఆ చిత్రానికి పేరు పెట్టాడు చిత్రకారుడు. స్త్రీ అని ఏకవచనము వాడారు. కాని ఇందులో ముగ్గురు స్త్రీలున్నారు. ఒకామె గోవుకు కాబోలు ఆనుకొని ఉంది. ఇంకొకామె తత్తరపాటుతో దేనినో నిరీక్షిస్తున్నట్లు చిత్రింపబడి ఉంది. ఇక మూడో స్త్రీ తన భుజంమీద పంజరములో ఉన్న చిలుక నొకదానిని మోసుకొని వస్తున్నట్లు గీయబడినది. ఆవు నానుకొని ఉన్న ఆమె కన్నుల్లో ఒక ప్రసన్నత, ప్రశాంతత, పరవశత గోచరిస్తుంటే, మధ్యఉన్న ఆమె చూపులో ఏదో ఆలోచనామగ్నమైన అమాయకత్వం గోచరిస్తున్నది. ఇక చిలుకతో ఉన్నామెచూపులో ఏదో నిర్వికారంతో కూడిన సంకీర్ణ వేదనాభారం కనపడ్తుంది. బహుశా తానుసైతం (ఆ పంజరంలో చిలక మాదిరి) ఎవరిచేతనో బందీయై ఉన్నట్లు ఒక సజెషన్ స్ఫురిస్తుంది. బహుశా ఈ భావంతోనేమో ఈ చిత్రం బ్యాక్‌గ్రౌండ్లో పల్చటి నల్ల రంగును వాడాడు చిత్రకారుడు. కాస్త ఓపిక చేసుకొని సానుభూతితో చూస్తే అర్థంకాకుండా పోయెది ఇందులో ఏముంది?

ఇక పోతే ఆ ముగ్గురు స్త్రీమూర్తులు నగ్నంగా నిలబడట మేమిటి అబ్బబ్బ, అశ్లీలంగా లేదూ! అని ఇంకో ఆడప్రేక్షకురాలి

ఫిర్యాదు. నిజమే! ఆ చిత్రకారుడు ఆ ముగ్గురు స్త్రీమూర్తుల్ని నగ్నంగానే చిత్రించారు. బహుశా ఆచిత్రకారుణ్ని నగ్నస్త్రీలే ఎక్కువగా ఆకర్షిస్తారేమో. అందుకనే ఆయన ఎక్కువగా తన చిత్రనాయికలగా వారినే స్వీకరిస్తాడేమో అది అతని Style (శైలి) అనుకో కూడదా?

ఈ నగ్నచిత్రణ అశ్లీలం క్రిందకు వస్తే భారతీయ దేవాలయాలపై ఉండే లతలాది శిల్పాలు. శంకరాచార్యుల వారి దేవీ స్తవం. ఇవన్నీ కూడా వేటి క్రిందకు రావాలి? ప్రాచీనులు చేస్తే పవిత్రము. నవీనులు చేసే అపవిత్రమా? అక్కడా ఇక్కడా సౌందర్యానుభూతే, సత్యదృష్టి. పవిత్రదృష్టే. అనుకోకూడదా? ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారులు అగస్టేరోడిన్, విలియంబ్లేక్, అరబ్ కవి ఖలీల్ జిబ్రాన్-వీరంతా నగ్నమూర్తులనే చిత్రించారు కనుక కేవలం అశ్లీలమని కొట్టిపారేయడానికి వీల్లేని చిత్ర మిది.

ఇక ఈ చిత్రంలో కానవచ్చే మరో విశేష మేమిటంటే – ఆ ముగ్గురు స్త్రీమూర్తులను పోతపోసినట్లు అందరికీ ఒకరకపు కళ్లు, అందరిలోనూ ఒకే భావవ్యక్తీకరణ (జానపదశైలిలో గీచే అనేకానేక బొమ్మల్లో మాదిరిగా గాకుండ) గాకుండా వారి మానసికానుభూతుల వైవిధ్యాన్ని మూడుతీరుల చిత్రించడం., రంగుల్ని. గీతల్ని సద్భావనతో వినియోగించుకోవడం. ఇవన్నీ ఈ చిత్రంలో కానవచ్చే కొన్ని మంచి లక్షణాలు. ఒక నెల్లూరు కళాకారుడు నవ్యరీతిలో గీచిన చిత్రం కాబట్టి దీన్నిగూర్చి ఇంత విపులంగా చర్చించాల్సి వచ్చింది.

అందరికీ అర్థమై ఆనందాన్నిచ్చిన శ్రీ కొండపల్లి శేషగిరిరావు వంటి చిత్రాలు కొన్నైతే, ఎవరికీ అర్థంకాకుండా విసుగు పుట్టించిన పి. గౌరీశంకర్; అజీజ్ వంటి వారల నైరూప్య – వికృత చిత్రణాలు మరికొన్ని లేకపోలేదు.

చిత్రకళాజగత్తులో రంగుకూ రూపానికీ వేర్వేరు స్వంత విలువ లున్నవి. కొందరు రూపాన్ని సుతారంగా చిత్రిస్తారు. అట్లానే మరికొందరు రంగును చిత్రించడంలో ప్రతిభను ప్రదర్శిస్తారు. మరి కొందరు కేవలం దృశ్యరూపాల్నిగాక వాటి సాంకేతిక రూపాల జోలికి కూడా పోతారు. మరికొందరు పరిచితరూపాల్ని, అపరిచిత రూపాలతో ప్రహేళికలుగా చిత్రిస్తారు. ఇంకొందరు రూపాన్ని పగుల గొట్టి విరూపపర్చి, విశ్లేషణాత్మకంగా చిత్రీకరిస్తారు. కొందరు సహజ రూపాన్ని అసహజపర్చి కాని భావతీవ్రతను వ్యక్తపరచలేరు – భావం కోసం రూపాన్ని బలిచేస్తారు. మరికొందరు కేవలం రూపాన్ని మాత్రమే పట్టుకొని భావం జోలికిపోరు. బుద్ధిబలంతో అర్థం చేసుకొనేవి కొన్నైతే, హృదయానుభూతితో ఆనందించేవి కొన్ని. నేటి చిత్రకళలో ఇన్ని రీతులున్నాయి. వీటన్నిటినీ ఆసరా చేసుకొని గీచిన చిత్రాలు ఆ ప్రదర్శనలో దర్శన మిచ్చాయి.

ఒకాయన ఫిడేలు వాయిస్తున్నాడనుకొందాం! ఆ కేవలనాదం, ఫలాన అర్థాన్ని కాని ఫలాన మాటల్ని కాని వ్యక్తం చేయదు. కేవలం ఆరాగాలాపన ఏదో అవ్యక్తరసానందాన్నిస్తుంది. అట్లనే ఏ విషయ వస్తువు వ్యక్తపరచకుండా కేవలం వర్ణశోభను, లేదా రూపశోభను, లేదా రేఖాశోభను నిర్మిస్తారు కొందరు చిత్రకారులు. సంగీతాన్ని సవ్యంగా ఆనందించాలంటే రాగ, తాళ జ్ఞానాలు ఎట్లా అవసరమవుతాయో చిత్రకళానందానికి, రేఖావర్ణజ్ఞానాలు అవసరమై ఉంటుంది. వాటిని తెల్సుకొనే సానుభూతి అభిరుచీ వోపికా లేకుండా; కేవలం కంటికి ఆనినదాన్ని బట్టి ఈ చిత్రం బాగుంది, ఇది బాగ లేదు అని తీర్పు చెప్పడం సబబు కాదేమో.

## దంపూరు నర్సయ్యగార్ని గూర్చి మళ్ళీ కొంత సమాచారం....

దంపూరు నర్సయ్యగార్ని గూర్చి అతని జర్నలిస్టిక్ జీవితం గూర్చి పరిశోధన చేయడానికి లోకలిస్టు మద్రాసు వెళ్ళినప్పుడు ఆధునిక తెలుగు సాహిత్యంలో మరుగునపడిన మాణిక్యంగా ఉండిన అప్పారావుగారి మొదటి కన్యాశుల్కం ( 897 నాటి ప్రచురణ) దొరికింది. ఆ 'కన్యాశుల్కం' గురించి మరికొంత పరిశోధించడానికి మళ్ళీ వెళ్తే దంపూరు నర్సయ్యగార్ని గూర్చి మరికొంత సమాచారం దొరికింది. దంపూరు నర్సయ్యగార్ని గూర్చి పరిశోధించవల్సింది ఇంకా ఎంతో వుందనిపిస్తోంది.

సరిగ్గా 102 సం॥ల క్రితం అంటే 1867 సం॥లో దంపూరు నర్సయ్యగారు వొక చిత్రమైన ఆ గ్రంథం అచ్చు వేయించారు. "లెటర్స్ ఆన్ హిందూ మారేజస్" "హిందూ వివాహాల గురించి కొన్ని లేఖలు – అని ఆ పుస్తకం పేరు.

ఇటీవల శ్రీ చంద్రశేఖర్ కేంద్ర కుటుంబనియంత్రణ మంత్రిగా వున్నప్పుడు మన ఆడవాళ్లు 18-20 ఏళ్లలోపున వివాహం చేసుకోకూడదనే శాసనం సృష్టించాలనుకోవడం, అందుమీదట పార్లమెంటులోనూ బయటా పెద్ద గొడవ జరగడం మనమెరిగిందే. దాదాపు ఇట్లాంటి గొడవే మద్రాసులో అప్పుడూ జరిగింది. హిందూ వివాహ సంస్కరణ భావాలు అప్పుడప్పుడే మద్రాసులో యేర్పడుతున్న రోజులవి. నెల్లూరుజిల్లా గూడూరు తాలూకా కోటదగ్గర వెంకన్నపాలెం గ్రామవాసి కీ. శే. చదలవాడ అనంతరామశాస్త్రిగారు బాల్య వివాహాలు కూడదనే వివాదం లేవనెత్తుతూ మనుస్మృతినుండి దాఖలాలు చాటుతూ 'వివాహ కన్యాస్వరూప నిరూపణం' అనే పేర సంస్కృతంలో వొక సిద్ధాంత గ్రంథం రచించారు. బాల్య వివాహాలు కూడదంటూ సంఘ సంస్కార భావుటాను కందుకూరి వీరేశలింగం కంటే ముందే రెపరెపలాడించిన తొలి దాక్షిణాత్యుడు బహుశా ఈ చదలవాడ అనంతరామశాస్త్రిగారే కావచ్చునేమో.

దీన్ని తూర్పారపడ్తూ, ఖండిస్తూ—మరో నెల్లూరీయుడు "చతుష్షష్టి కళాత్మ అలంకార సార్వభౌమ' బిరుదాంకితుడు అయిన శ్రీ॥ శే॥ గుర్రం వెంకన్నశాస్త్రిగారు అదే 'మనుస్మృతి' నుంచి ఛాందసపు దాఖలులు చూపుతూ 'సిద్ధాంత సిద్ధాంజనం' అనే సంస్కృతఖండన గ్రంథం వ్రాశారు. ఈ వాద ప్రతివాదనలు పరాకాష్ట నందుకున్నాయి. పండితులు పిచ్చికుక్కల్లాగా పోట్లాడుకున్నారు.

ఇక ఈ వివాదం తెమిలేదెట్లు అని మద్రాసు పండితులు తికమక పడ్తుంటే – అప్పటి కంచికామకోటి పీఠాధిపతి శంకరాచార్యులగారి ముందు ఈ రెండు వాదాలు పెట్టగా ఆయన సనాతన ధర్మపరాయణుడు కనుక గుర్రం వెంకన్నశాస్త్రిగారిదే కరెక్టన్నాడు. అంటే బాల్యవివాహాలుండాల్సిందననే వాదాన్ని ఒప్పుకున్నాడన్నమాట.

ఈ వాద ప్రతివాదనలను సన్నిహితంగా పరిశీలిస్తూ వుండిన వాడు కనుక, మన దంపూరు నరసయ్యగారు ఇంగ్లీషులో గట్టివాడు కనుక "మద్రాసు టైమ్స్" (అంటే యిప్పటి 'మెయిల్ పత్రిక')కు యీ హిందూ బాల్యవివాహాల గురించిన వాదప్రతివాదనలకు సంబంధించి వివిధ కలంపేర్లతో అందరి తరఫున వకాల్తు పుచ్చుకొని అన్నివాదాలు వివరించాడు. ఇతరుల వాదాలే కాకుండా ఒకటి రెండు లేఖల్లో తన సొంతవాదం సైతం వివరించాడు. ఆ లేఖలు చదివితే నరసయ్యగారిలో ఎంతటి ఆధునిక భావాలున్నవో అర్థమవుతుంది. 'మద్రాసు టైమ్సు'లో నరసయ్యగారి ఈ లేఖలు యుద్ధాన్ని లేపింది. 1865 లో, తర్వాత 1867 లో యీ లేఖలనే ఒక చిన్న గ్రంథరూపంగా అచ్చువేయించారు.

ఈ 102 ఏళ్ళనాటి దంపూరు నరసయ్యగారి పుస్తకమే మొన్న 'లోకలిస్టు' బయటకు తీశాడు. అయితే చిరిగిపోయే కాగితాలు, ఎట్లాగో టైపు చేయించి మొకాబిలా చేయిస్తున్నాడు. వీలు చూసుకొని వివరాలు త్వరలోనే అందిస్తాడు. ఇవికాక ఇంకో రెండు ఇంగ్లీషు పుస్తకాలు కూడా నరసయ్యగారి లేఖనుండి వెలువడ్డాయి.

## కోటిరూపాయల కవిత్వం చెప్పిన అరబ్ కవి జీబ్రాన్: ఆంధ్రానువాదం సమకూర్చిన కాళోజి

నాలుగేళ్ళ పిల్లవాడొకడు దాదాపు డెబ్బైయేళ్ళక్రితం లెబనాన్ కొండచరియల్లోని ఆరామంలో ఆడుకొంటూ చిరిగిన కాగితాల్ని పోగుచేసి మట్టిలో పూడ్చిపెట్టి అక్కడే కాచుకూర్చున్నాడు - ఆ మట్టిలోనుంచి ఆకులతో, రెమ్మలతో, కొమ్మలతో చెట్టు మొలిచి పళ్ళు పడిస్తుందా అని ఎదురు చూశాడు. అతని వెర్రికాని ఆ కాగితాల పోగుల్లోనుంచి చెట్టు మొలవడమేమిటి!

కాని అతను పెద్దవాడై కవితలు, కథలు, గేయాలు, వ్రాసిన కాగితాలే అతను చనిపోయిన తరువాత 10 లక్షల డాలర్లకు మించి సంపాదించి పెట్టాయి. ఈనాటికీ సంవత్సరానికి లక్షడాలర్లు చొప్పున అతని కవిత్వ గ్రంథాలపై ఇంకా వస్తూనే వున్నది. పెండ్లి పెడాకులు లేకుండా బ్రతికినంతకాలం ఏకాకిగా కవిత్వం వ్రాస్తూ బ్రతికాడు. మన రూపాయల్లో చెప్పాలంటే అతని కవిత్వం ఇప్పటిదాకా దాదాపు కోటిరూపాయలు సంపాదించి పెట్టింది.

1931లో చనిపోతూ అతను వొక వీలునామా వ్రాసిపోయాడు - అతని పుస్తకాలపై వొచ్చే రాయల్టీ సొమ్మంతా తన స్వంత గ్రామమైన షెర్రీ (Bsherri) కు చెందాలని వ్రాసిపోయాడు. అతను బ్రతికుండగా ఎన్నెన్నో కష్టాలుపడి వ్రాసిన కవిత్వం; అతని స్వగ్రామ ప్రయోజనానికి అంత డబ్బును యీనాటికీ సంపాదించి పెడుతున్నా - ఆ వీలునామా డబ్బును అజమాయిషీ చేస్తున్న 40 మంది ట్రస్టు కమిటీ సభ్యులు తమలో తాము తగవులాడుకొంటూ కోర్టుకెక్కి ఉన్నారట. మేరియన్ జిబ్రాన్ అనే అతని సోదరి (ఇప్పుడు ఆమె అమెరికాలోని 'బోస్టన్' నగరంలో నివసిస్తున్నది) ఆ డబ్బులో తనకూ కొంత వాటా రావాలని కేసుపెట్టి ఉన్నదట.

'ఈనాటికీ ప్రతి సంవత్సరమూ అతని పేర ఒక ఉత్సవం అతని గ్రామంలో జరుగుతూనే ఉన్నది. ఆ వూరులోనే అతని పేర వొక మ్యూజియమ్‌ను నిర్వహిస్తున్నది ఆ ట్రస్టు కమిటీ. ఆ మ్యూజియమ్‌ను

ఏ పేటా చూడవచ్చే లక్షలాది జనంనుండి ప్రవేశరుసుం వసూలు చేస్తూ ఆ సదరు ట్రస్టు కమిటీ లాభాలను కూడా గడిస్తున్నది.

ఈ కోర్టు గొడవలన్నీ ఒక కొలిక్కివస్తే త్వరలోనే ఆ మ్యూజియమ్‌ను యింకా పెద్దది చేయాలనీ; అతని పేరుతో ఒక ఆసుపత్రిని నెలకొల్పాలని; అతని జ్ఞాపకార్థం వొక పెద్ద సారస్వత పోటీ నిర్వహించాలని కొన్ని పథకాలు తయారుచేసి ఉన్నారు ఆ ట్రస్టు కమిటీ సోదరులు.

ఇంతకూ ఎవరీ మహాకవి? మహామనీషి? ప్రఖ్యాత అరబ్ కవి ఖలీల్ జిబ్రాన్ అతని పేరు. ప్రపంచంలోని అనేక భాషల్లో; దాదాపు అన్ని భాషల్లో అతని కవిత్వ పుస్తకాలు అనువాదితమై వున్నాయి; హిందీ, తమిళం, మలయాళం, మరాటి, గుజరాతీ, బెంగాలీ వగైరా భారతీయ భాషల్లో సైతం అతని రచనల అనువాదా లున్నాయి. ఇప్పుడు తెలుగుభాషలో కూడా అతని అనువాద గ్రంథమొకటి వెలిసింది. మొన్నటి శనివారమే (23-2-68) హైదరాబాదులో ఆవిష్కరణ జరిగింది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొనే బంగోరె అతని అమేయమైన కవిత్వాన్నిగూర్చి ఈ నాలుగు వాక్యాలు వ్రాయ సమకట్టాడు.

జిబ్రాన్ బ్రతికుండగా ఎన్నో కష్టాలు పడ్డాడని అన్నాను. మొదటి కష్టం అతని 19 వ యేటనే. స్వగ్రామం నుండే కాదు; స్వదేశం నుండే తరిమి వెయ్యబడ్డాడు. ఎందుకనయ్యా అంటే – "The Spirits Rebellious" (తిరగబడిన ఆత్మలు) అనే పుస్తకం వ్రాసినందుకు. చిత్రమైన పుస్తకం అది. అందులో నాలుగే నాలుగు కథ లున్నాయి. నాలుగు కథలు నాలుగువిధాల విప్లవాత్మకమైనవి. వివాహ వ్యవస్థమీద, మత వ్యవస్థమీద, తన కవిత్వధ్వజం ఎత్తి వ్రాసాడు. అలనాటి అరబ్ ప్రభుత్వం, ముఖ్యంగా మత సోదరుల వ్యవస్థ, అతన్ని బహిష్కరించి ఆ పుస్తక ప్రతులన్నీ చౌకలో కాల్చి పారేసింది.

అతను స్వదేశంనుండి తరిమివెయ్యబడితే పారిస్‌లోను పరిసర దేశాల్లోను కొంత కాలం గడిపి చిత్రకళ నభ్యసించి, కడకు అమెరికా వచ్చి స్థిరపడ్డాడు; అమెరికాలోనే మరణించాడు.

ఆయన రాసిన పుస్తకా లన్నిటిలోకి తలమానికమైనది 'The Prophet' (ప్రవక్త) అనే పుస్తకం. మహాభారతానికి పంచమ వేదమని పేరు వచ్చినట్లే ఈ 'ప్రాఫెట్' అనే పుస్తకానికి 'The Little Black Book' అనే పేరు వచ్చింది. 'Black Book' అని పాశ్చాత్యదేశాల్లో బైబిల్‌నే పిలుస్తారు అంటే ఈ ప్రాఫెట్ ఆ బైబిల్‌తో సరిసమానంగా గౌరవాన్ని పొందిందన్నమాట. ఏ చర్చి పీఠాధిపతులు, మతాధికారులమీద తను మొట్టమొదట ధ్వజమెత్తాడో; వాళ్ళే ఆరాధించే బైబిల్ ప్రక్కనే తన గ్రంథం స్థానం సంపాదించుకొన్నది అమెరికాలోని కొన్ని చర్చివేదికలనుండి యీ గ్రంథపఠనం యీనాటికీ జరుగుతున్నదట.

జిబ్రాన్ ఈ మహాకావ్యాన్ని పన్నెండేళ్ల పసి ప్రాయంలోనే వ్రాశాడట. ఆ వ్రాసినదాన్ని తల్లికి వినిపించాడు. It's all right but yet green—"బాగానే వుంది, కాని యింకా పసిగావుంది" అని ఆ కన్నతల్లి అన్నదట. మళ్ళీ పదేళ్ళపాటు వళ్ళీ మళ్ళీ తిరగ వ్రాయటం, తల్లికి వినిపించటం చేస్తూ వచ్చాడట. ఏడోసారికాబోలు ఆ తల్లి సంతృప్తిని ప్రకటించగా అప్పుడు ఆ గ్రంథాన్ని తనే ఇంగ్లీషు అనువాదం చేశాడు.

మొదటిసారి అచ్చువేసిన ఆల్‌ఫ్రెడ్ ఎ. క్నాఫ్ (Alfred A Knopf) అనే ఆయన అనుభవాలు చూడండి. 1933 లో 'ప్రాఫెట్' ను అచ్చువేశాడు. 2 వేలకాపీలు వేస్తే సంవత్సరానికి 1200 కాపీలు అమ్ముడయ్యేసరికి తలప్రాణం తోక కొచ్చింది. జిబ్రాన్ మార్కెట్ అంతటితో సరి అనుకున్నాడు.

ఆ మరుసంవత్సరమే క్నాఫ్‌కు ఆశ్చర్యం కలిగింది. 'ప్రాఫెట్' కు డిమాండ్ రెండింతలుగా పెరిగింది.

1935 లో 12 వేల కాపీలు, 1961 లో 1 లక్షా 11 వేల కాపీలు, 1964 లో 1 లక్షా 40 వేల కాపీలు, ఇప్పుడు సంవత్సరానికి 20 లక్షల కాపీలు ముద్రణ అవుతున్నాయని, వారానికి 5 వేల కాపీల చొప్పున అమ్ముడు అవుతున్నాయని 'టైమ్' పత్రిక 1965 ఆగస్టులో లెక్క కట్టింది. అప్పటివరకు 40 ముద్రణలు పొందింది.

అతని కవిత్వ గ్రంథానికున్న ఇంతటి విపరీతమైన ఆదరణ లోని రహస్యమేమిటి ? వీటిని కొనేవారందరు ఎవరు ? అదంతా ఒక మతం అంటాడు క్నాఫ్ ప్రచురణాలయంలో సంపాదకుడుగా ఉన్న విలియమ్ కోప్లాండ్ కోకార్నులై పున్నవాన్ని ఈ గ్రంథం ఎంతో ఊరట కొల్పుతున్నట్లుంది. ఎక్కడో ఒకచోట ఒక అనామకుడు చనిపోతే అక్కడ 10 కాపీలు అమ్ముడవుతాయి వెంటనే అని అంటాడు.

ఇంకొక ఆయన అంటాడు చూడండి కుర్రకారువారు ఈ పుస్తకాన్ని ఎక్కువగా కొంటారు. అందులోని భాగాలను చదివి వినిపించి మగువలను మరులుగొల్పి వారి మనసుల నాకర్షించే దాని కోసంగా - అని అంటారు. అమెరికాలోని 'సెవెంటీన్' అనే పత్రిక ఈ "ప్రాఫెట్" పాపులారిటీ సర్వే చేయించినపుడు ఒక నవనవ లాడే యువతి ఈవిధంగా అన్నదట - "It is unique and just right for clearing cobwebs and refueling weary souls". టైమ్ పత్రిక ఆఖర్లో ఈరకంగా అంటుంది - 'In a word it seems to provide a Philosophy for the somewhat immature, a creed for the vaguely well meaning, a consolation for those who think religion is a misty feeling'

నామటుకు నేను ఈ ప్రాఫెట్ చదివి ఎంతో మానసిక ఊరట పొందాను. జిబ్రాన్ కవిత్వంతో మిత్రులెందరికో పరిచయం చేయించాను, కేవలం ఆ పుస్తకం ద్వారానే ఎందరికో మిత్రుణ్ణయ్యాను. ఆదేపనిగా ఇరవయ్యేసి రూపాయలుపెట్టి ప్రాఫెట్ కాపీలు కొని

చ్చారు. ఆ మధ్య ఒక కడపజిల్లా విఖ్యాత కమ్యూనిస్టు సారస్వత విమర్శకులొకరికి ఈ పుస్తకం ఇస్తే చదివి "immature spiritua nonsense" అని అన్నాడు. మన ప్రఖ్యాత భౌతికవాద రచయిత, కవి, కావలి శ్రీ కే. వి. రమణారెడ్డిగారికి ఈ పుస్తకం ఇస్తే చదివి ఎంతో ఆసక్తిని వ్యక్తం చేసారు. ప్రత్యేకించి ఆంధ్రానువాదంసైతం సమకూర్చాలనే అభిలాషను వ్యక్తం చేసారు కంట్రాక్టరు, ఇప్పుడు 'విప్లవ' కర్షకుడుగాను ఉంటున్న శ్రీ కాకాణి రమణారెడ్డిగారికి సంవత్సరం క్రితం కాబోలు చదవమని ఇస్తే ఆయన ఓపిగ్గా నెలరోజులుంచుకొని పుస్తకం మొత్తం టైపు చేయించుకొని ఒక కాపీ తనవద్ద ఉంచుకున్నాడు. 'రాత్రులపూట ఏకాంతంలో ప్రశాంతంగా చదువుతూంటే నన్నేవో లోకాలకు కొనిపోయింది. జిబ్రాన్ కవిత్వం, సీరియస్‌గా అధ్యయనం చేయదగ్గ గ్రంథం కాబట్టి టైపుచేయించి పెట్టుకున్నాను' అన్నాడు.

అట్లాంటి ఈ పుస్తకాన్ని 'నాగొడవ' గేయాలద్వారా విఖ్యాతిబడిసిన తెలంగాణ కన్నీటి కవి శ్రీ కాళోజి ఇప్పుడు తెలుగులోకి అనువాదం చేసాడు. 'జీవనగీత' అనే పేర. ఒకవిధంగా తెలుగుదేశపు జిబ్రాన్ అనవచ్చు శ్రీ కాళోజిని. నైజాం ఉద్యమపు రోజుల్లో కవిత్వం వ్రాసి ప్రజోద్యమాలు నడిపి తెలంగాణానుండి తరిమివెయ్యబడ్డవాడు, కష్టాలు పడ్డవాడు, జైళ్ళల్లో నివాసం చేసినవాడు, కవిత్వమే వూపిరిగా కల్గినవాడు. యుద్ధంలో ఫ్రాన్సు కవులంతా చెల్లాచెదరయిపోతే లూయీ ఆరగాన్ ఒక్కడే దేశంలో నిలబడి మహాప్రజల విశ్వాసాన్ని వెల్లడించే గీతాలు వ్రాసాడు. కాళోజి లూయీ ఆరగాన్ వంటివారు అని శ్రీ శ్రీ చేత పేర్కొనబడినవాడు. ప్రాఫెట్ తెలుగు అనువాదం 'జీవనగీత' మొన్న హైదరాబాద్‌లో ఆవిష్కరణ జరిగింది. యువభారతి, 5 కింగ్స్‌వే సికిందరాబాద్ వారు ప్రచురించారు. వెల ఎప్పుడూ కాళోజి పుస్తకాలకు అమూల్యమే. మూడురూపాయలకు తక్కువ కాకుండా ఎంత పంపించినాసరే అంటున్నారు ప్రచురణకర్తలు.

ప్రాపంచిక ధర్మాలను నిర్వచించే ఒక అధునాతన ఉపనిషత్ వాక్యసరళి ఈ గ్రంథంలో సర్వత్రా గోచరిస్తుంది. ప్రేమ, వివాహం, పిల్లలు సంతోషం – దుఃఖం, స్నేహం, క్రయ – విక్రయాలు, నేరం–శిక్ష, విద్య వగైరా అనేక విషయాలపై ఉదాత్తమైన కవిత వ్యాఖ్యానాలిచ్చే గ్రంథం ఇది. శ్రమ, కృషిపై గాఢమైన విశ్వాసాన్ని, ఫలితంపట్ల ఆశాభావాన్ని నిండుగా వ్యక్తపరుస్తుంది. ఆ వ్యక్తీకరణలో ప్రేమ జాలువారుతూ, భక్తి తొణికిసలాడుతూ, కరుణ ప్రవహిస్తూ, ఆనందం వెల్లివిరుస్తూ, అశేష మానవ ధర్మమేరూపు దిద్దుకుంటుంది జిబ్రాన్ వాక్యాల్లో.

Work is Love made visible అంటాడు. **Your Joy is your sorrow unmasked** అంటాడు యింకోచోట.

పిల్లలనుగూర్చి పిల్లల పెంపకాన్నిగూర్చి జిబ్రాన్ చెప్పిన వాక్యాలతో ఈ వ్యాసాన్ని ముగిస్తాను.

Your children are not your children,
They are the sons and daughters of Life's
Longing for itself They come through you
but not from you.

And though they are with you, yet they belong not to you
You may give them your Love but not your thoughts.
For, they have their own thoughts
You may house their bodies but not their Souls,
For, their soals dwell in the house of to-morrow
which you can not visit, not even in your dreams,
You may strive to be like them, but seek not to
make them like you

For, Life goes not back ward nor tarries with yesterday,
you are the bows from which your children
as living arrows are sent forth............

# వీరేశలింగం పంతులుగారిపై అమెరికన్ యువకుని పరిశోధనలు

తెలుగు నేర్చుకోవాలనుకొన్నాను. ఐతే తెలుగులో పండితుణ్ని కావాలనికాదు సుమా, నా కారణం వేరు, నా ప్రేరణ వేరు. భాష అనేది నాకొక పనిముట్టు. చరిత్ర గవేషణకు ఒక సాధనం. నేను హిస్టరీ విద్యార్థిని. బ్రిటీషు సామ్రాజ్య చరిత్ర చదువుతుండగా భారతీయ విజ్ఞానాన్ని అధ్యయనం చేస్తుండగా నాకొకటి అనిపించింది. ఈ దేశంలో ఎక్కువమంది మాట్లాడే భాషల్లో తెలుగు రెండోస్థానంలో వుంది. అయినా యిదివరలో ప్రాచ్యాత్యులెవరూ చరిత్ర పరిశోధనకు దీనిని అంతగా వుపయోగించుకొన్నట్లు లేదు. తెలుగు నేర్చుకొనడానికి నన్ను పురికొల్పిన ముఖ్యకారణం ఇదే.

ఒకసారి విస్కాన్సిన్ విశ్వవిద్యాలయం చరిత్ర ఆచార్యులు ఫిలిప్ డికర్టిన్ ఒకమాటన్నారు. వలసపాలకుల కోణంనుంచిగాక, స్వతంత్ర దృక్కోణం నుంచి లోతుగా పరిశోధించే నాధుడుండాలి గాని ఆసియా, ఆఫ్రికా దేశాల చరిత్రలలో స్వంతమైనది స్వతంత్రమైనదీ బోలెడంత వుంటుందన్నారాయన. ఈ లోతుకుదిగి పరిశోధించడానికి ప్రేరణ అప్పుడు కలిగింది.

ఈ మాటలన్నది ఒక అమెరికన్ యువకుడు. అతని పేరు జాన్ జి. లెనర్డ్. అనడమేకాదు అన్నంతపనిచేసి చూపించాడు. తెలుగు భాషా పరిజ్ఞానం కొంత సంపాదించాడు. కందుకూరి వీరేశలింగం పంతులుగారిని గురించి చారిత్రక పరిశోధనచేసి పి. హెచ్.డి. డిగ్రీ తీసుకొన్నాడు.

విస్కాన్‌సిన్ విశ్వవిద్యాలయానికి లెనర్డ్ సమర్పించిన ఆ పరిశోధనా వ్యాసంలో కొత్త విషయాలు, కుతూహలకరమైన విశేషాలు ఏమైనా వున్నాయా?

ఫిలడెల్ఫియాలోని లూథరన్ మిషనరీ ఆర్కైవ్స్‌లోనూ, లండన్ చర్చి మిషనరీ సొసైటీలోనూ భద్రపరచియున్న పురాతన పత్రాలెన్నో తొలిసారిగా పరిశీలనచేసి వీరేశలింగం పంతులుగారిని గురించిన కొత్త చారిత్రకాధారాలను వెలికి తెచ్చాడు. సాహిత్య పరంగా కాక, నూరేళ్ళనాటి దక్షిణభారత సాంఘిక – రాజకీయ పుద్యమశక్తులను సవిమర్శకంగా అంచనా కడ్తూ ఆ మేటి సంఘ సంస్కర్త నిర్వహించిన భూమికను, ఈ రంగంలో ఆయన జయాపజయాలను చర్చించాడు. లెనర్డ్ ఈ కృషి ఒక్కరోజులో జరిగినది కాదు, ఒక దారిని సాగిందీకాదు. దారిలో తగిలిన ఎదురు దెబ్బలకు తట్టుకొని భల్లూకపు పట్టుతో పనిచేసి మరీ సాధించాడు.

ఇటీవలి కాలములో ఇండియా గురించి, ముఖ్యంగా దాని ఆధునిక చరిత్రగురించీ అమెరికన్ల రచనలు పరంపరగా వస్తున్నాయి. అమెరికన్ పరిశోధకులు కొత్తదారులు తొక్కుతూ అజ్ఞాత విషయాలు త్రవ్వి తీస్తున్నారు.

ఉదాహరణకు షికాగో విశ్వవిద్యాలయానికి చెందిన డాల్టన్ ఎఫ్. లాక్ 1965 లో ఒక పుస్తకం వ్రాశాడు. దానిపేరు: ఇండియా ఇన్ ది–ఏజ్ ఆఫ్ యూరప్: 16 వ శతాబ్ది భారత చరిత్రకు సంబంధించి పోర్చుగీసు, డచ్, ఇటాలియన్, లాటిన్ భాషలలో గ్రంథస్తమై, ఆయా దేశాలలో నిక్షిప్తమైవున్న ఎన్నెన్నో సంగతులు త్రవ్వితీశా డీయన ఆ గ్రంథంలో.

అట్లాగే మరొక అమెరికన్ రాబర్ట్ ఫ్రైకెన్ బర్గ్. ఈయన ప్రస్తుతం విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో చరిత్ర అధ్యాపకులుగా వుంటున్నారు. ఈస్టిండియా కంపెనీ రోజులనాటి గుంటూరు జిల్లాలో ప్రజాజీవితాన్ని, పరిపాలనా విశేషాలను "గుంటూర్ డిస్ట్రిక్ట్ 1788–1848" అనే గ్రంథంలో పూసగ్రుచ్చినట్లు వివరించాడు. ఇదికూడా 1965 లో వెలువడింది. ఈ పరిశోధనా ప్రాశస్త్యాన్ని గుర్తించి లండన్ విశ్వవిద్యాయం ఈయనకు పి.హెచ్.డి. డిగ్రీ యిచ్చింది.

ఇక యిప్పుడు వీరేశలింగం పంతులుగారిపై పరిశోధన జరిపి లెనర్డ్ వ్రాసిన ఈ ఉద్గ్రంథం ఒకటి.

లెనర్డ్ మొదట విస్కాన్సిన్ విశ్వవిద్యాలయంలో తంటాలు పడి తెలుగు నేర్చుకున్నాడు. అమెరికా విద్యాలయాలలో తెలుగు బోధన ప్రారంభమైంది కూడా అప్పట్లోనే - విస్కాన్సిన్ గాక, టెక్సస్, కాలిఫోర్నియా, కార్నెల్ విశ్వవిద్యాలయాలలో కూడా తెలుగు బోధనా పీఠా లున్నాయి. విస్కాన్సిన్ విశ్వవిద్యాలయం నుంచి తెలుగు నేర్చుకొన్న మొదటి అమెరికన్ విద్యార్థుల్లో లెనర్డ్ ఒకడు. "మేము గ్రాంథిక శైలి జోలికి పోలేదు. తేలికైన పత్రికల భాష నేర్చుకొందామని మాత్రమే ప్రయత్నించాము" అని అన్నాడు లెనర్డ్, తన తెలుగు తరగతులనాటి సంగతులు నెమరువేసుకొంటూ.

స్టాన్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో బి. ఏ. అయిన తర్వాత, లెనర్డ్ ఒకవైపు తెలుగు నేర్చుకుంటూనే హిస్టరీ ఎం. ఏ. పూర్తి చేశాడు. ఈ ఎం. ఏ. డిగ్రీకోసం ఆనాడు ఆంధ్రోద్యమంపై ఒక పరిశోధన వ్యాసం "పాలిటిక్స్ అండ్ సోషల్ చేంజ్ ఇన్ సౌత్ ఇండియా: ఎ స్టడీ ఆఫ్ ది ఆంధ్రా మూవ్‌మెంట్" (దక్షిణ భారత దేశంలో రాజకీయ, సాంఘిక పరిణామం: ఆంధ్రోద్యమ పరిశీలన) వ్రాశాడు.

1964లో అమెరికా నేషనల్ డిఫెన్స్ ఫారిన్ లాంగ్వేజ్ ఫెలోషిప్ పథకం క్రింద లెనర్డ్ కి స్కాలర్‌షిప్ వచ్చింది. ఆ సంవత్సరం సెప్టెంబరులోనే ఇండియా వచ్చాడు. 18 నెలలపాటు తెలుగు దేశంలో ఉన్నాడు. దీక్షగా విషయ సేకరణ జరిపాడు. దాదాపు తెలుగుపట్టణాలన్ని తిరిగాడు. ఓపిగ్గా పాతగ్రంథాలయాలన్నీ గాలించాడు. దొరికిన పాత పత్రికలన్ని తిరగేశాడు. కొన్నిటికి మైక్రో ఫిల్ములు తీసుకొన్నాడు. విసుగు విరామం లేకుండా వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమ, చరిత్ర అన్వేషించాడు. లండన్‌లో ఇండియా ఆఫీసు లైబ్రరీలోనూ, తమిళనాడు స్టేట్

ఆర్కైవ్స్‌లోను వీరేశలింగంపంతులుగారికి సంబంధించిన సమాచారం దొరికినంత వరకు సేకరించి పోల్చి చూచి నిర్ధారణలు చేసుకొన్నాడు.

రాజమండ్రి మునిసిపాలిటీకి సంబంధించిన ప్రారంభ ప్రాథమిక రికార్డులను శోధించాడు. అట్లాగే రాజమండ్రిలో ఆ మధ్య ఏర్పరచిన "వీరేశలింగం మ్యూజియం"లో భద్రపరచిన లేఖలు, పంతులుగారు డైరీలాగా వ్రాసిపెట్టుకొన్న నోట్సూ ఇంకా యితర సమాచారమూ జాగ్రత్తగా పరిశీలించి వారి జీవిత విశేషాలెన్నిటినో రాబట్టగలిగాడు లెనర్డ్.

వీరేశలింగం జీవితం ఆనాటి స్థానిక రాజకీయ, సాంఘిక పరిస్థితులకు దర్పణంవంటిది. సంస్కర్తగా, సాహిత్య వైతాళికుడుగా ఆయన సాగించిన పోరాటాలు నేటికి వాద ప్రతివాదాలను రేకెత్తించే అంశాలను ప్రసాదిస్తాయి అని లెనర్డ్ తన తీసిస్‌లో ఒకచోట అంటాడు.

1968 లోనే పరిశోధనను పూర్తిచేసి తీసిస్ సమర్పించినాడు. కాని డిగ్రీకి ఆమోదయోగ్యం కాలేదని చెప్పి ఆ విశ్వవిద్యాలయం వారు ఈయన తీసిస్‌ని తిప్పి పంపివేశారు. లెనర్డ్ నిరుత్సాహపడ లేదు. వెన్నుచూపలేదు. దీనిని ఒక సవాలుగా స్వీకరించాడు. మరింత తీవ్ర పరిశోధనకు పూనుకొన్నాడు.

వీరేశలింగంపంతులుగారి చరిత్ర అంతు తెలుసుకొందామని బయలుదేరిన ఈ యువ అన్వేషికి దారిలో పెద్ద ఎదురు దెబ్బ తగిలింది. తెలుగుదేశం అంతా తిరిగి, తిరిగి ఎన్నో గ్రంథాలయాల నుంచి ఎంతో సమాచారం ఫోటోస్టాట్ కాపీలరూపంలో, నోట్సు రూపంలో భద్రపరచి పెట్టుకొన్న సంచిని ఒకనాడు న్యూయార్క్‌లో ఒక టాక్సీలో పోగొట్టుకున్నాడు. తన మెదడునే పోగొట్టుకొన్నంత పనైంది. క్రుంగిపోయాడు. ఎంతో శ్రమబడి సంపాదించుకొన్న కష్టఫలం యిట్లా అయిపోయింది. తాను ఓడిపోయా ననుకొన్నాడు.

అప్పట్లో హైదరాబాదులో వేరొక పరిశోధన చేసుకొంటున్న తన భార్యకు ఈ మాట వ్రాశాడు. ఆమె ధైర్యం చెప్పింది. నిస్పృహ చెందవద్దన్నది. తాను పదిలంగా దాచి వుంచిన అతని చిత్తు వ్రాతలన్నీ ఇచ్చి, మళ్ళీ ప్రయత్నించమని ధైర్యం, ఉత్సాహం నూరిపోసింది భర్తకు. అట్లా తేరుకొని పని ప్రారంభించాడు లెనర్డ్. ఈ చిత్తు వ్రాతలనుంచీ, తన జ్ఞాపకాలనుంచీ మళ్ళీ థీసిస్ వ్రాశాడు. ఫలితం. "కందుకూరి వీరేశలింగం 1948-1949 : ఎ బయాలజీ ఆఫ్ యాన్ ఇండియన్ సోషల్ రిఫోర్మర్" అనే చారిత్రక పరిశోధన గ్రంథం. ఈసారి ఈయన కృషిని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయం గుర్తించింది. డాక్టర్ డిగ్రీ ఇచ్చింది.

ఈ థీసిస్ కి మరొకసారి మెరుగులు దిద్దుకొందామని మళ్ళీ ఇండియా వచ్చాడు. "ఈసారియాత్ర మరింత లాభమైంది. క్రొత్త సమాచారం ఎంతో దొరికింది. అన్నిటినీ సమన్వయపరచుకొని, సాఫీచేసి థీసిస్ ముద్రణ చేయించే ప్రయత్నాలు చేయాలని అన్నాడు లెనర్డ్ అమెరికా తిరిగివెళుతూ.

లెనర్డ్ భార్య కారెన్ హైదరాబాదు ప్రాంతంలో 'కాయస్థ' ప్రజల గురించి పరిశోధన చేసి పి. హెచ్. డి. పట్టం పొందింది. ప్రస్తుతం ఇద్దరూ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో చరిత్రశాఖలో అధ్యాపకులుగా పనిచేస్తున్నారు. ఆమె కేమో భారత దేశ ప్రాచీన చరిత్రపై ఆసక్తి. తనకేమో ఆధునిక చరిత్ర అంటే మక్కువ అంటాడు లెనర్డ్. ఈ యువదంపతులకు యిద్దరు సంతానం.

తెలుగునాటి చరిత్ర లెనర్డ్ మెదడుకు పదును పెడుతూనే వుంటుంది. రాజమండ్రి, మదరాసునగరాల నుంచి ఆనాడు నడచిన సంఘ సంస్కరణ ఉద్యమాలను, స్థానిక, రాజకీయాలను గురించి పోలికలతో పరిశీలించి మరొక గ్రంథం వ్రాసేపనిలో లెనర్డ్ మునిగి ఉన్నాడిపుడు.

## రచయిత ఒక ప్రభుత్వం వంటివాడు

విరసం కవి, భారత–చైనా మిత్రమండలి కార్యదర్శి, గొప్ప రచయిత, జన్వార్ భారతీయుడు శ్రీ కె. వి. రమణారెడ్డి అరెస్టు వార్త నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేయలేదు. అసూయపడేటట్లు చేస్తున్నది. ఆయన నిబద్ధ రచయిత. నేను అనిబద్ధుణ్ణి. ఈ సందర్భంలో సోల్జినిత్సిన్ ప్రస్తావన తేవడం అనుచితం కావచ్చునేమో గానీ ఆయనన్న ఒక వాక్యం చెవుల్లో మ్రోగుతున్నది.

For a country to have a great winter.........is like having another Government. That is way no regime has ever loved great winters, onely minor ones.........

రమణారెడ్డి సంకలనం చేసిన 'ఝంఝ'ను ఆం. ప్ర. ప్రభుత్వం నిషేధించింది ఆ మధ్య. అది తప్పు అని తీర్పు చెప్పింది హైకోర్టు. ఇప్పుడు మళ్ళీ అదే సరళిలో జరుగుతున్నది తతంగం.

మంటల కవిత్వం :

గతవారం దాదాపు 180 గుడిసెల్ని హరించిన నెల్లూరు అగ్నిప్రమాదం గురించి శ్రీ నేతి శివరామశర్మ పంపిన గేయంలో నుంచి ఒక తునక.

"ఎక్కడున్నాం మనం?
ఏమైపోతున్నాం మనం!
బస్తీలో ఉన్నాం – బ్రతకలేక
ఈసు స్తీలు పడ్తున్నాం......
తంటాలుపడి, తలదాచు
కోడానికి వేసుకొన్న గుడిసెల
మంటలు మింటికెగుస్తుంటే,

ఆయిల్ లేని శకటాలు
వికటాట్టహాసం చేశాయి -
కన్నీళ్ళ కట్టలు తెంచుకున్నాయి.
కారుచిచ్చు
కడుపు చిచ్చుగా మారితే
ఆక్రోశిస్తున్న కన్నతల్లి......"

కవిత్వం కన్నీరు తుడపలేక పోవచ్చుగానీ కవి అనేవాడు గతానికి విగతానికి కట్టుబడిపోకుండా చుట్టూ పారాడే నిత్యవాస్తవాలకు నీరాజనాలెత్తుతూ బరువుగా పలకడమనేది ఒక సుగుణం. ఆ గుణాన్ని దేనితో గుణించినా మహాకవిత్వ మవుతుంది.

## పె ల వు

వచ్చేవారం నుండి యూత్ కాంగ్రెస్‌లో ఈ వేదిక వుండదు. ఒక వేళ వున్నా ఈ వేదికపై బంగోరె వుండడు.

ఆర్. ఎల్. రెడ్డి వాగ్దానాల్లాగా, నేనూ కొన్ని సంపాదక వాగ్దానాలు చేసిన మాట వాస్తవం. Agitate through news. అన్న లెనిన్ సూక్తి ననుసరించి; కదిలేదీ కదిలించేది, మారేదీ, మార్పించేదీ, మునుముందుకు సాగించేదీ, పెనునిద్దర వదిలించేదీ, పరిపూర్ణపు బ్రతు కిచ్చేదీ కావాలోయ్...అన్న శ్రీ శ్రీ సూక్తి ననుసరించి వీలున్నంతవరకు అలజడి రేపే, ఆందోళన రేపే వార్తలను ఇవ్వాలని చూశాను. ఈ దృష్టితోనే జిల్లాలోని దేవాలయాలు, పబ్లిక్ ట్రస్టులు ఒక్కొక్కటి పేరు పేరునా తీసుకొని వాటిల్లో పబ్లిక్‌గ్గా జరుగుతున్న దోపిడీ గూర్చి ఘోరబడ్తాననీ చెప్పాను. ఒకటి రెండు

దేవాలయాలలోనే ఆ శీర్షికను అవతలకు నెట్టవలసి వచ్చింది. ఆ ఒకటి రెండింటిగూర్చి కూడా సమగ్రంగా ఇవ్వలేకపోయాను, తీక్షణంగా చెప్పలేకపోయాను.

నా దృష్టిలో రేపు భూసంస్కరణ చట్టం పకడ్బందీగా అమలు జరిగి గిరిగి జిల్లా మొత్తంమీద బీదలకు పంచడానికి మిగిలే గిగిలే భూములకన్నా జిల్లాలో ఈ దేవాలయాల పేరుతో దోపిడీ చేయబడ్తున్న వేలాది ఎకరాల భూములు ఎక్కువేనని అంటున్నాను. ఈ దొంగ భూసంస్కరణలు అమలుచేసేకన్నా ఖాళీగావుంటే ఈ భూముల్ని పేదలపరం చేయమనండి చూద్దాం. దేవుడి పెళ్ళికి అందరూగదా పెద్దలు, ఈ దేవుడిసొత్తు ఎవడు తింటేనేమి ? అందుకనే ఈ సొత్తును పేదల్నే తినమందాం, అనేదినా థీసిస్. ఈ థీసిస్‌ను వార్తారూపంలో విడమర్చిచెప్పే అవకాశం లేకపోయింది. మన్నించండి.

ఇంకా ఏవేవో వేదికలూ, శీర్షికలూ అన్నాను. ఇప్పుడవన్నీ వదలిపెట్టి వెళ్ళిపోవలసి వస్తున్నది. వెళ్ళిపోతున్నాను.

పాఠక మిత్రులకు

## నిర్గమన నీరాజనాలు

యూత్‌కాంగ్రెస్ ఎడిటర్‌గా నా నూకలు నేటితో చెల్లిపోయాయి. కనుక నిర్గమిస్తున్నాను. గుడ్‌బై చెప్పేముందు ఈ నిర్గమనవేళ నాలుగుమాటలు.

ఈ పత్రికా పాఠకులుగా మీతో పరిచయమేర్పరచుకొని పట్టుమని పదినెల్లుకూడా కాలేదు. వోరుమంటే 50 సంచికల అనుబంధమైనా కాదు మనది.

మీతోనే గడిపిన రోజులు బహుతక్కువ. మీతోనే పలికిన పలుకులు అంతకన్నా తక్కువ. అయినా యివాళ వీడ్కోలు చెప్పి వెళ్ళిపోవడమంటే ఎందుకింత బాధ?

మీకు మరో ఎడిటర్ దొరక్కపోడు నెల్లూర్లో ఎడిటర్లకు కొదవా? నాకు సరిపడే, నేను ఇమడగలిగే పత్రిక మళ్ళీ మరొకటి దొరకడం నాకు కష్టంకావచ్చుగాక. అయినా ఇది తప్పని నిర్ణయం.

నిజమైన జర్నలిస్టుల బ్రతుకులు ఎప్పుడూ ఇట్లాగే వుంటాయ్. ఆరకం దేశదిమ్మరినే నేను కూడా. ఎప్పుడూ ఒంటరిగా ఏకాకి మార్గాన్ని వెతుక్కుంటూ వెళ్ళేవాణ్ణి. శక్తిమేర వ్యాఖ్యానించు కుంటూ, రిపోర్టు చేసుకుంటూ వెళ్ళే దేశద్రిమ్మరులం మేము. నిత్య వార్తలతో నడుస్తున్న చరిత్రాంశాలతో ముడిబడిన వాక్చిత్రాలను చెక్కుకునే అల్ప సంతోషపు శిల్పులం మేము. నిత్యజీవితంలోని సూక్ష్మాంశాల నిజాంశాలమీద ముగ్గు అల్లే గాలిజీవులం మేము. వీలుంటే విశ్వాసి లోకనం చేసి చావాలనే అమాయకపు తహతహ గాళ్ళం-ఏమిచేయమంటారు. అది మా జర్నలిస్టుల జాఢ్యం. ఏదో గాలిచేతిలో నెట్టబడి, అలవోకగా విసిరేయబడే విత్తనాల గింజలం మేము. చదివిన క్షణాలో ఎలాగో భావస్ఫూర్తిని కల్గించి మరు క్షణంలో మనసులోనుంచి మాయమైపొయ్యే, ఒకపూల సువాసన వెదజల్లి మరుపూట వాడిపొయ్యే పువ్వుల లిపుల్ని అల్లే పిచ్చి మొక్కలం మేము.

విపులాచ పృధ్వీ - ఈ రకం బ్రతుకు మా జర్నలిస్టులకు పరిపాటే.

ఈ ఉన్న పదినెలల్లో ఏదో నా శక్త్యానుసారం ఎడిటర్ గా శ్రమించాను. ప్రమిదలో చమురుపోసి చిరుదీపం వెల్గించినట్లు నా జీవరక్తపు సిరాలో కలాన్నిముంచి వ్రాసుకొంటూ ఎడిట్ చేసుకొంటూ ఇన్నాళ్ళు ఒంటరిగా నిస్సహాయంగా ఒక్క చేతి

మీదుగా పత్రికను నడిపాను. అడపాదడపా సహకరించిన చెయ్యూనరా ఇచ్చిన మిత్రవర్యులకు ధన్యవాదాలు.

చేసే పని చిన్నదైనా వళ్ళు దగ్గరపెట్టుకొని ప్రేమార చేయడం, వ్రాసే వార్త స్థానికవార్తే అయినా, విశ్వగీతికే అయినా హృదయమిచ్చి వ్రాయడం మినహా మరో బాణీచేతగాని వాణ్ణి.

అందుకే ఉన్న మేరకు నా గుండెను పిండి తునా తునకలుచేసి మీముందు వెదజల్లాను. నా కాంతుల సంతానాన్ని మీ ముందు దిసమొలతో కేరింతలతో తచ్చాడేలాగున చేశాను. బాధతోగాక, బరువుగుండెతోగాక ఇప్పుడు ఏదో బంధాన్ని అనుబంధాన్ని తెంచుకొని ఎడబాసి పోవాలంటే చేతకావడం లేదు. తృష్ణతో, దప్పికతో తీపెక్కిన హృదయాన్ని విడిచి వెళ్తున్నానా అనిపిస్తున్నది.

అరబ్ కవి ఖలీల్ జీబ్రాన్ అన్నట్లు – It is not a garment I cast off this day, but a skin that I tear with my own hands.

ఇక్కడ కొలిక్కి తగిల్చిపోతున్నది ఏదో మాసిన చొక్కా లాంటిది కాదు, చేతులారా నా చర్మాన్నే చీల్చిపెట్టి పోతున్నానా! చర్మకారు డెవరికైనా ఏ మాత్రం వుపయోగపడినా మేలే!

| | |
|---|---|
| 12-10-1938 | నెల్లూరు జిల్లా, కోవూరు తాలూకా, మినగల్లులో జననం. |
| 1942-1952 | కోవూరులో విద్యాభ్యాసం. |
| 1952-1954 | (లెఖ్ఖలు ముఖ్యంగా) ఇంటర్మీడియెట్, వి.ఆర్. కాలేజి, నెల్లూరు. |
| 1954-1957 | B. Com. (Honors) ఆంధ్రా యూనివర్శిటీ, వాల్తేరు "స్రవంతి" పత్రికాధిపత్యం (దీని గురించిన ఇతర వివరాలేవి లభ్యమవలేదు). |
| 1960 | "ఆంధ్ర జ్యోతి" దినపత్రికలో కొన్ని నెలల ఉపసంపాదకత్వం. |
| 1961 | సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకులో అకౌంటెంట్‌గా చేరిక. కడప బదిలీ. |
| 1963 | సెక్రటరీగా పదవీ విరమణ. నల్లపరెడ్డి చంద్రశేఖరరెడ్డిగారి సంపాదకత్వంలో ప్రచురింపబడ్డ "శ్రీ విక్రమసింహపురి సర్వస్వ గ్రంథ మండలము"నకు శ్రీ K. సుందరరామశర్మగారితో కలిసి సహాయ సంపాదకత్వం. ఆ గ్రంథానికి ఈ క్రింది వ్యాసాల రచన. |
| | 1) మండల వ్యాపారములు (N. రాఘవయ్య పేర్న) P. 396. 2) నెల్లూరు మండల పత్రికలు P. 877. 3) మండల శిల్ప విద్యా (ఎన్. రాఘవయ్య పేర్న) P. 887. 4) నెల్లూరు జిల్లా మైకా పరిశ్రమ చరిత్ర P. 893. 5) నెల్లూరు-సినిమా P. 909. 6) పాతపత్రాలు P. 947. |

| | |
|---|---|
| 1964 | జమీన్ రైతు ఉపసంపాదకునిగా నియామకం. |
| 25-8-1966 | సుమిత్రగారితో వివాహం. |
| 1968 | వై. ఫైరల్ వ్రాసిన గ్రంథం "From England to the Antipodes S - India 1846—1902 with startting revelotions (Or) 56 Years of My Life In the Indian Mutiny police. S. Jail లోని 50 పేజీల నూరేళ్ళనాటి నెల్లూరు సంగతులకి శ్రీ ఎన్. ఎస్. కృష్ణమూర్తిగారితో కలిసి అనువదించి 'జమీన్ రైతు'లో ప్రచురించడం. |
| | "కన్యాశుల్కం" నాటకపు (1897 వ నాటి) తొలి ప్రచురణ బంగోరె దృష్టిలో పడ్డం ఈ త్రవ్వకాల కాలంలోనే. |
| 1969 | అమూల్యమైన వివరణలతో "కన్యాశుల్కం" తొలి ప్రతి ప్రచురణ. |
| 1969 | తమిళ జాతీయకవి సుబ్రహ్మణ్యభారతి కందుకూరి వీరేశలింగం - రాజ్యలక్ష్మమ్మగారి పాత్రలతో చేసిన అసంపూర్ణ తమిళ నవల 'చంద్రిక కథ'కు శ్రీయుతులు ఎన్. ఎస్. కృష్ణమూర్తి, వి. ఎస్. రాఘవన్ గార్లతో కలిపి చేసిన తెలుగు తర్జుమాని వెలుగులోకి తెచ్చింది, (జమీన్ రైతులో.) |
| 1970 ఫిబ్రవరి | నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్ వారి ప్రచురణ "స్పీచస్ అండ్ ఎస్సేస్ ఆఫ్ డా. సి. ఆర్. రెడ్డి"కి శ్రీయుతులు ఎన్. ఎస్. కృష్ణమూర్తి, వేదం వెంకట్రామన్ గార్లతో కలిసి ఎడిటింగ్ బాధ్యత. |

| | |
|---|---|
| ఏప్రిల్ '71 | "చంద్రిక కథ" సొంత ప్రచురణ. |
| 1971 | మద్రాసులోని అమెరికా సమాచార శాఖ లోకి ప్రవేశం. |
| జనవరి '73 | నెల్లూరు వర్ధమాన సమాజంవారు పునర్ముద్రించిన శ్రీ పట్టాభి "ఫిడేలు రాగాల డజను" వెనక ముఖ్యపాత్ర. |
| అక్టోబర్ '73 | "బ్రౌన్ జాబులు- తెలుగు జర్నలిజం చరిత్ర" కూర్పు, ప్రచురణ. |
| 1974 | "తాతాచార్యుల కథలు" కూర్పు (ఎమెస్కో ప్రచురణ.) |
| 1974-'75 | "యూత్ కాంగ్రెస్" సంపాదకత్వం. |
| అక్టోబర్ '75 | డా॥ కె. మంగమ్మగారి పరిశోధక గ్రంథం "Book Printing In India ! with Special Reference to the Contribution of European Scholars to Telugu (1746–1857) స్వంతంగా ప్రచురణ. |
| 1975 | శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీలోకి సి. పి. బ్రౌన్ ప్రాజెక్టు రీసెర్చి ఆఫీసర్‌గా ప్రవేశం. |
| ఫిబ్రవరి '77 | బ్రౌన్ లేఖలు : ఆధునికాంధ్ర సాహిత్య శకలాలు. |
| మార్చి '77 | డా॥ జి. ఎన్. రెడ్డిగారి పర్యవేక్షణలో ఆంధ్ర గీర్వాణచ్ఛందము. |
| డిశంబర్ '77 | బ్రౌన్ జాబుల్లో (స్థానిక చరిత్ర శకలాలు); కడప జాబుల సంకలనం. |

| | |
|---|---|
| 1978 | లిటరరీ బయోగ్రఫీ ఆఫ్ సి. పి. బ్రౌన్ ప్రాజెక్టు ముగింపు. |
| 1978-79 | "మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు"పై పరిశోధన, సొంత ప్రచురణ. |
| 1980 | హైదరాబాద్‌లోని యోగి వేమన విజ్ఞాన కేంద్రంలోకి రీసెర్చి ఆఫీసరుగా నియామకం. |
| జూలై 1980 | 141 సం॥ల క్రితం, 1839లో అదృశ్యమై పోయిన వేమన పద్యప్రతి లండన్‌నుంచి సేకరించిన ఫోటోకాపీ ఆధారంతో...... "వేమన పద్యాలు సి. పి. బ్రౌన్ 1839 నాటి సంకలనం ప్రచురణ. |
| ఏప్రిల్'81 | వేమన విజ్ఞాన కేంద్రంనుంచి తిరోన్ముఖం. |
| జూన్'81 | వాల్తేరులో C. R. రెడ్డి రీసెర్చి కేంద్రంలో రీసెర్చి ఆఫీసరుగా నియామకం. |
| డిశంబర్'81 | సి. ఆర్. రెడ్డి సెంటినరి సెలిబ్రేషన్స్ కమిటి, ఆంధ్రా యూనివర్సిటి వారి ఆధ్వర్యంలో "వేమన-సి. ఆర్. రెడ్డి" ప్రచురణ. |
| సెప్టెంబర్-అక్టోబర్'82 | విశాఖపట్నం నుంచి నెల్లూరుకు తిరుగు ప్రయాణం – బహుశా సాహిత్య పరిశోధకునిగా తాను నడిపిన యుద్ధాల తాలూకు గాయాల్నీ విజయాల్నీ బేరీజు వేసుకుంటూ. |
| 5-11-1982 | వార్తాపత్రికలు బంగోరె మరణాన్ని గూర్చి నమ్మశక్యం కాని వార్తలను మోసుకు వచ్చాయి. బంగోరె పిల్లలు. |

జూనియర్ ఇంటర్ చదువుతున్నా సం॥ 16
సుధీర్, 8 వ తరగతి చదువుతున్నా 13 సం॥
ప్రేమసాగర్.

పై సమాచారాన్ని సేకరించడంలో దయతో నాకు సహాక రించిన వారు శ్రీయుతులు ఎస్. ఎస్. కృష్ణమూర్తి, వేదం వెంక ట్రామన్ గార్లు, శ్రీమతి సుమిత్రగారును, వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. వారిచ్చిన సమాచారాన్ని వరుస క్రమంలో కూర్చడంలో కలిగిన లోపాలికి బాధ్యత అంతా నాదే.

1. ఇంక '60 తొలి దశకంలోనే ఏదో సినిమా నిర్మాణంలో బంగోరె చేయి ఉందనుకుంటాను, వివరాలకి ప్రయత్నించమని శ్రీ కె. వి. రమణారెడ్డి అన్నారు. కానీ దానికి సంబంధించిన వివరా లేవీ తెలిశాయి కావు, ఆరుద్ర కూడా నిస్సహాయతని వ్యక్తపరిచారు మిత్రుడు బాలబ్రహ్మయ్య అడిగితే.

2. ఎంతో ముఖ్యమైంది. గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారి మీద బనాయింపబడ్డ రాజద్రోహ నేర విచారణకు సంబంధించిన పరిశోధన కూడా బంగోరె కొంత చేశారని దానికి సంబంధించిన ఫైలుకూడా బంగోరె ఇంట్లోనే ఉండొచ్చునని వెదకమని శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు ఒక ఉత్తరం వ్రాశారు, కానీ అదీ మాకు లభ్యమవ లేదు.

3. మరింక కె. వి. రమణారెడ్డిగారి మహాగ్రంథాలు 'కవి కోకిల' 'మహోదయాల'కి కాని శ్రీశ్రీ సాహిత్య సంపుటాల కూర్పులో కాని, తర్వాత ఆరుద్రగారికి నారాయణబాబు గీతాలు సంపాదించడంలాంటి విషయాల్లో బంగోరె అందించిన సహకారం గురించి ఆయా ప్రముఖులు తెలియజేయాల్సిందే!

H. S. V. K. రంగారావ్,
నెల్లూరు.

15-3-'83.

---

1. ఈ విషయం శ్రీ కె. వి. రమణారెడ్డి తెలిపారు. అది సకాలంలో అందకపోయినందువల్ల ప్రచురించలేకపోయాము.